# వివాహము : నేడు, రేపు

సంకలనకర్త :

మల్లాది సుబ్బమ్మ

9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ,

అభ్యుదయ వివాహ వేదిక

వివాహము : నేడు, రేపు

ముద్రణ : 1983 అక్టోబరు

ప్రతులు : 2000

వెల: రు. 20-00

ప్రతులకు :
అభ్యుదయ వివాహ వేదిక,
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ,
మెహిదీపట్నం,
హైదరాబాదు - 500 028

# వి ష య సూ చి క

# నా మాట

ఏ సుఖశాంతుల కోసం, ఏ స్వేచ్ఛా సమానత్వాల కొరకు ఏ అండ దండలను ఆశించి, ఏ అనిర్వచనీయానందానుభూతిని అందుకోవటానికి వివాహ వ్యవస్థ ఏర్పడిందో, వాటికి అనేక అవరోధాలు, అడ్డంకులు, రుగ్మతలు దాపురించాయి. ఒక ప్రక్క కులం, మరొకప్రక్క మతం, వేరొక ప్రక్క భాషా ప్రాంతీయ దురభిమానాలు 'భూతాల్లా' యువతీ యువకులను పట్టి పీడిస్తున్నాయి. ఒకవంక కట్నం, మరొకవంక లాంఛనాలు, వేరొక వంక వేడుకలు వీటిబరువుతో ఆడపిల్లను కన్నవారి నడ్డి విరిగిపోతోంది. ఆడంబరాలతోనే కాక దుబారా ఖర్చులతో కుటుంబాలే కూలిపోతున్నాయి. వివాహ విధిలోని మతతంతు మానవస్వేచ్ఛను వమ్ముచేస్తున్నది; స్త్రీకి తక్కువ స్థాయిని నిర్దేశిస్తున్నది. జాతకాలని, జన్మ నక్షత్రాలని, తిధివార వర్జ్యాలని, పట్టింపులు మూఢ విశ్వాసాలు ప్రబలమవుతున్నాయి. వివాహం జరిగేది కన్యల మనస్సుకూ, మమతకూ కాదు; కులానికీ, మతానికీ, ధనానికీ మాత్రమేనని చెప్పుకోవచ్చు. ఇన్నిరకాల రుగ్మతలున్నందు వలననే నేటి ఈ వ్యవస్థలో నవ వధువుల ఆత్మహత్యలు పెచ్చు పెరిగిపోతున్నాయి. ముఖ్యంగా స్త్రీల జీవితాలు విషాదాంకితాలవుతున్నాయి. ఆడపిల్లలను కన్న తల్లిదండ్రులకు అల్లుళ్ళు శిక్షలూ, జరిమానాలూ వేస్తున్నారు. స్త్రీల యెడ వివక్ష కొనసాగుతున్నది. ఎవరు సృష్టించారు ఈ అసమానత్వాన్ని? ఈ విషజాడ్యానికి బాధ్యులెవరు. అసలు వివాహం అనేది స్త్రీలకే అవసరమా? పురుషులకిది వ్యాపారమా లేక వినోదమా? వ్యక్తి స్వేచ్ఛను, ప్రేమానురాగాలను అడ్డదారులు పట్టిస్తున్న ఈ స్థితికి పరిష్కృతి లేదా?

నేటి వివాహ వ్యవస్థ దెబ్బ తిన్నది. వివాహబంధం పతనావస్థలో పడిపోయింది. అసలు వివాహోద్దేశ్యం మరుగున పడిపోయింది. వివాహం యొక్క నిజస్వరూపాన్ని సంరక్షించుకోవాలంటే సత్వర చర్యలకు గడంగాలి.

విలువలు నేటి వైజ్ఞానిక యుగంలో అవశేషాలుగా మిగిలిపోయాయి. కన్యాదానం లాంటి విధులు విషతుల్యాలు. సామాజిక విలువలు మారినప్పుడల్లా వివాహ వ్యవస్థల్లో, దాంపత్యజీవిత విధానంలో, ఆలుమగల అనుబంధంలో మార్పులు వస్తాయి. రావాలి కూడా.

ఈవిషయాన్ని కూలంకషంగా చర్చించటానికి, వివాహానికి ఒక నిర్దుష్ట స్వరూపం ఇవ్వటానికి ఆం. ప్ర. అభ్యుదయ వివాహవేదిక 1983 అక్టోబరు 15,16 తేదీలలో ఒక సెమినారును నిర్వహించింది. అనుభవజ్ఞులైన మేధావులూ, శాస్త్రీయ దృక్పథం కలవారూ చర్చలో పాల్గొన్నారు. వివిధ దృక్కోణాల నుండి తరచి చూచి రచించిన వ్యాసాల రూపమే ఈ పుస్తకం. ఇందులో విభిన్న ఆలోచనా ధోరణులు దర్శనమిస్తాయి.

శారీరకమయిన విధిని క్రమబద్ధంగా నిర్వర్తించటానికే వివాహ వ్యవస్థ ఏర్పడిందనే భావం కూడా ప్రకటితమయింది. ఒకరు వివాహ వ్యవస్థ కావాలని రాస్తే, అసలు వ్యవస్థే అక్కరలేదని, తమ ఇచ్ఛవచ్చిన రీతిలో దంపతులు కలసి కాపురం చెయ్యవచ్చనేదాకా అభిప్రాయాలు వెలువరింపబడ్డాయి. పరస్పరాకర్షణ, ప్రేమలకే ప్రాధాన్యత ఇవ్వాలనే వాదన గట్టిగా వినవచ్చింది. ఏ ఒక్కరూ మరొకరిని శాసించరాదనే భావం వెల్లడయింది. ఏదైనా ఇరువర్గాలవారు ప్రేమానురాగాలకే విలువ ఇచ్చారు. వరకట్నాల పద్ధతిని నిరసించారు. మత విధిని త్రోసి రాజన్నారు. చర్చలు చాల ఫలవంతంగా ముగిశాయి.

వేదిక లక్ష్యాలపై ఉన్న ఆదరంతో, వేదిక నిర్వాహకుల యెడ ఉన్న అభిమానంతో, తమ కెంతో కార్యభారమున్నా, సకాలంలో వ్యాసాలు వ్రాసి యిచ్చిన రచయితలకు నా కృతజ్ఞతాపూర్వక అభివందనాలు తెలియుజేస్తున్నాను. వేదికకు ఉత్తేజాన్ని ఇస్తున్న గౌరవాధ్యక్షులు శ్రీ నార్ల వారికి, ఉత్సాహాన్ని అందిస్తున్న అధ్యక్షులు శ్రీ పి. సత్యనారాయణగారికి నా ధన్యవాదాలు. ఈ పుస్తకానికి ఉపోద్ఘాతం వ్రాసియిచ్చిన నా సహకార్యకర్త ఎం. వి. రామమూర్తిగారిని ఈ సందర్భంలో నేను విస్మరించలేను. సకాలంలో ముద్రించి ఇచ్చిన లిబర్టి ప్రింటర్సువారి సహకారం స్మరణీయం.

# ఉపోద్ఘాతం

స్త్రీ పురుషులు జంటగా ఉండటంతో ప్రారంభమైన సంబంధం చివరకు ఈనాటి రూపంలో వివాహ వ్యవస్థగా పరిణమించింది. అనేక లక్షణాలను స్వభావాలను సంతరించుకున్నది. వివాహబంధంలో వ్యక్తిగతాంశమూ, సామాజికాంశమూ రెండూ ఉన్నాయి. కాగా కాలక్రమేణ సామాజికాంశం బలవత్తరంగా తయారయింది. దాంతో పరస్పర ప్రేమానురాగాలపై ఆధారపడవలసిన ఆ బంధంలో హింస, దౌర్జన్యమూ, అసమానత్వమూ, మగవాని పెత్తనమూ, స్త్రీల అణచివేత చోటు చేసుకున్నాయి. తత్ఫలితంగా స్త్రీల ఆత్మహత్యలు, స్త్రీలు హత్యలకు గురికావడం రోజువారీ సంఘటనలయాయి. చైతన్యరహితంగా ఉన్న సమాజంలో కలవరం పుట్టున్నది. ఈ దుఃస్థితికి కారణాలను అన్వేషించడం మొదలయ్యింది. అలాంటి ప్రయత్న ఫలితంగానే ఈ పుస్తక ప్రచురణ జరుగుతున్నది.

వివాహ వ్యవస్థకు అనేక కోణాలు, అనేకానేక అంశాలూ ఉన్నాయి. వాటి నన్నింటిని పరిశీలించి, వాటి పరస్పర సంబంధాలను పరికిస్తే తప్ప ఆ వ్యవస్థ సమగ్ర స్వరూపం బోధపడదు. అదీగాక మౌలికాంశమూ, తదితర అంశాలూ రెండూ వివాహబంధంలో ప్రస్ఫుటంగా ఉంటున్నాయి. కనుక వీటి మధ్య తేడాను గమనించటం అవసరమవుతున్నది. విషయమూ, రూపం అలాంటివి. ఇవి పరస్పర ఆధేయాలు; అంతేగాక ఒకటి మరియొక దానిపై తన ప్రభావాన్ని చూపుతుంది. ఈ ప్రక్రియను సరిగా అవగాహన చేసుకోవలసి ఉంటుంది.

వివాహ వ్యవస్థ ఒకనాడు ఉద్భవించిందికాదు. కాలచక్ర పరిభ్రమణంలో వచ్చిన పరిణామ ఫలితం అది. కనుక వివాహం యొక్క గత చరిత్రను తరచి చూస్తే తప్ప వర్తమానమూ, భవిష్యతు అవగాహన

భవిష్యత్తుకు పరిమితం చేశారు. గ్రంథనామం ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నది.

వివాహం అనేక సమస్యలకు పుట్టినిల్లు. ఈ సమస్యలు కొన్ని గాఢమైనవి; మరికొన్ని పూత మెరుగులకు సంబంధించినవి. కాగా అన్నీ కాస్తో కూస్తో దంపతులను కలవరపెట్టాయి. స్త్రీ పురుషులలో బలహీనురాలయిన స్త్రీని - ఈనాటి సమాజంలో - ఇబ్బందుల పాలుచేస్తున్నాయి. వీటికి పరిష్కారమార్గాలు రెండు రకాలుగా ఉంటాయి. ఒకటి స్వల్ప కాలికం; రెండవది దీర్ఘకాలికం. మొదటిది సద్యోఫలితాన్ని ఇస్తుంది. బహుశః తాత్కాలిక ఉపశమనం కూడా కలుగవచ్చు. రెండవ మార్గం ఒక పట్టాన తెమలదు. సుదూర భవిష్యత్తులో సమస్యకు పరిష్కారం కన్పడుతుంది. ఇక్కడ మనం ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఒక సమస్యను మనం పరిష్కరించామని నిర్ణయానికి వచ్చామనుకోండి. మరుక్షణమే అది మరో రూపంలో మనకు దర్శనం ఇవ్వవచ్చును. కాకపోతే పాత ఆకారానికి క్రొత్త రూపుకు వ్యత్యాసం ఉండవచ్చును; లేక విషయ ప్రధానంగా వక్రీకరణ జరిగి యుండవచ్చును.

వివాహాన్ని పూర్వరంగం నుండి చివర వరకూ సునిశితంగా విశ్లేషణాయుతంగా, విమర్శనాదృష్టితో పరిశీలించి అధ్యయనం చేస్తే అనేక అభిప్రాయాలు ఉదయిస్తాయి; పెక్కు అనుమానాలు ఉద్భవిస్తాయి. పూర్తిగా ఊహాజనితమూ, నిరాధారమూ అయిన ప్రశ్నలను వదిలివేస్తే, కొన్ని ప్రశ్నలు ప్రాముఖ్యతను సంతరించుకుని జవాబుల కొరకు మనకు సవాళ్ళుగా నిలుస్తాయి. వివాహ వ్యవస్థ అవసరమా అనేది ముమ్ముందుగా వచ్చే అనుమానం. ఈ ప్రశ్న వేసేవారికి ఈనాటి వివాహ పద్ధతులు నచ్చకపోవచ్చును; లేక వివాహానికిముందు వధూవరుల ఎంపిక విధానం లోపభూయిష్టంగా కనపడవచ్చును. వరకట్న దురాచారం ఒకరి దృష్టిని ఆకర్షిస్తే, వ్యక్తి స్వేచ్ఛారాహిత్యం మరొకరికి బాధాకరం కావచ్చును. [illegible] జరిగే [illegible]

పరిస్థితిలో కాదు అని చెప్పటం కూడా సరియైన సమాధానమే కాగలదు. అప్పుడు సమాధాన స్పష్టత కోసం ఆ పరిస్థితిని వివరించవలసి ఉంటుంది.

ఒక వ్యవస్థ యొక్క అవసరానవసరాలను చర్చించే ముందు ఆ వ్యవస్థ యొక్క స్వరూప స్వభావాలను, లక్షణాలను, దోషాలను ముమ్మందుగా క్షుణ్ణంగా అధ్యయనం చేయవలసి ఉంటుంది. సి. శేషారత్నంగారు చెప్పినట్లు శాస్త్రీయ దృష్టి వివాహబంధ వివరణకు, ఆ బంధాన్ని సుఖప్రదమూ, శుభ ప్రదమూ చేసుకోవటానికి ఉపకరిస్తుంది. వివాహ వ్యవస్థ యొక్క మంచి చెడ్డలను నిర్ణయించాలంటే చారిత్రిక దృష్టి అవసరమని, అది ఆస్తి సంబంధాల నేపథ్యంలో సంతానాన్ని క్రమబద్ధం చేయవలసిన అవసరం దృష్ట్యా పురుషాధిపత్య పరిధిలో పుట్టి పరిణామం చెందినదని ఆచార్య ఎ. ఆర్. దేశాయిగారు ప్రకటిస్తే ఈ నాటి వివాహ వ్యవస్థ ఏ కోణం నుంచి చూచినా స్త్రీల అణచివేతపైన, వారి పరాధీనతపైన ఆధారపడి ఉన్నదని ఆచార్య నీరాదేశాయి నొక్కి వక్కాణించారు. ఈ రెండు దృక్కోణాలు సరిఅయినవే. ఒకటి వ్యవస్థ ఆవిర్భావాన్ని, పరిణామాన్ని వివరస్తే మరి యొకటి దాని వర్తమాన రూపాన్ని వెలికి తీస్తున్నది.

మానవుడు స్వేచ్ఛా పిపాసి. ఏ సంస్థను నిర్మించినా, ఏ వ్యవస్థను రూపొందించుకున్నా, ఏ ఆచారాన్ని అలవరుచుకున్నా, ఏ కార్యాచరణకు పూనుకున్నా మనిషిని ప్రేరేపించేది – అతనికి తెలిసి కాని, తెలియక కాని– అతనిలోని స్వేచ్ఛా పిపాసయే. వ్యక్తిగాను, సామూహికంగాను రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక, నైతిక, మానసిక రంగాలలో మానవుడు బంధాలలో ఉంటున్నాడు. ఆ బంధాలనుండి అతడు క్రమ క్రమంగా విముక్తుడవడమే అతడు స్వేచ్ఛను ఇతోధికంగా పొందడం. అతని శక్తి యుక్తులు వికసించటానికి అవరోధాలగా ఉన్నవి తొలగి పోవటమే స్వేచ్ఛ. ఆ త్రోవన పయనించటమే అభ్యుదయం.

ప్రకృతి బంధాలను అధిగమించటానికి సమాజం మానవునికి ఉపకరిస్తుంది. అయితే ఆ క్రమంలోనే అతనిని మరియొక రకపు బంధాలలో ఇరికిస్తుంది. వాటినుండి బయట పడడానికి అతడు ఎప్పుడూ ప్రయత్నిస్తుంటాడు. ఈ ప్రక్రియ నిరంతరం, అవిచ్ఛిన్నంగా సాగుతుంటుంది. వివాహ బంధంలో ఆలుమగలు ఇరువురి వ్యక్తి స్వేచ్ఛకు భంగం కలుగుతున్నా స్త్రీ యొక్క స్వేచ్ఛ పురుషుని స్వేచ్ఛ కంటే ఎక్కువగా కుంటు పడుతున్నదని సరస్వతీరావుగారు అభిప్రాయం వెలిబుచ్చారు. పెళ్ళి అనేది ఇద్దరి వ్యక్తిగత స్వేచ్ఛలను చెరోరకంగాను హాని చేస్తుందని రంగనాయకమ్మగారు చెప్తూ, పెళ్ళి అనే వ్యవస్థలోనే స్త్రీల స్వేచ్ఛను తీసేసే గుణం ఉందన్నారు. వివాహం వ్యక్తి స్వేచ్ఛకు సంకెళ్ళు వేస్తుందని, స్త్రీ స్వాతంత్ర్యం కోరేవారు వివాహ వ్యవస్థ రద్దును కోరాలని సురమౌళిగారు భావ ప్రకటన చేశారు. వీరందరూ వ్యక్తి స్వేచ్ఛకు ఇచ్చిన ప్రాముఖ్యత గమనార్హం.

ఎంపిక సమస్యను కూలంకషంగా వివరించిన డా॥ రావిభారతిగారు ఈనాడు పరిగణనీయాంశాలుగా ఉన్న కుల మత భాషా ప్రాంతాభిమానాలను, విద్యాధిక్యతను, వరకట్నాన్ని, ఆస్తిని, వ్యాపార తత్వాన్ని, అవాస్తవిక అభిప్రాయాలను, పెళ్ళిచూపుల తంతులో ఏక పక్ష నిర్ణయాధికారాన్ని పేర్కొని వాటిని ఖండించారు. ప్రేమ వివాహాల ఆవశ్యకతను ఉగ్గడించారు. ప్రేమ వివాహాలు సఫలం కావాలంటే తీసుకోవలసిన జాగ్రత్తలను గురించి వాసిరెడ్డి సీతాదేవిగారు విశదీకరించారు. ఆదర్శ దాంపత్యాన్ని గురించి వ్రాస్తూ ''వివాహమనేది ప్రధానంగా ఒక సర్దుబాటు విషయం" అని తురగా జానకీరాణిగారు భావ ప్రకటన చేశారు. వైవాహిక జీవితం సుఖంగా నడవటానికి సహనం, సర్దుకుపోవటం మూల సూత్రాలని తమ వ్యాసం 'వైవాహిక జీవితం: సఖ్యత, సామరస్యం'లో మల్లాది సుబ్బమ్మగారు అంగీకరిస్తూనే వాటిని పాటించేది స్త్రీ మాత్రమే కాదన్నారు.

వివాహంలో స్త్రీ తనకోసం జీవించడానికి భర్త, పిల్లలు అవరోధాలని వసంతా కన్నబిరాన్‌గారు అన్నారు. వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేసేది వివాహం అని వాసిరెడ్డి సీతాదేవిగారు వివాహబంధానికి నిర్వచనం ఇచ్చారు. అంటే వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేయని వివాహబంధం తెగ్రించి వేయాలని, ఆ మాటకువస్తే అలాంటి పెండ్లి సంబంధలో ఇరుక్కోపడం అవ్యక్తత అనే అర్థం వారి మాటల్లో కనిపిస్తుంది. వ్యక్తిత్వ వికాసమన్నా, వ్యక్తి స్వేచ్ఛ అన్నా ఒకటే. వ్యక్తిత్వ వికాసం కావాలంటే వ్యక్తి స్వేచ్ఛ అవశ్యం అభిలషణీయం.

వరకట్న సమస్యను ఆమూలాగ్రంగా పరిశీలించిన డా॥ మురళీ మనోహర్, శోభగారలు తమ వ్యాసంలో వరకట్నానికి మూలకారణాన్ని కనుగొన్నారు. స్త్రీలు నిర్వహించే గృహ కార్యకలాపాలకు ఎటువంటి ఆర్థిక విలువ లేకపోవడం ప్రధాన కారణమని వారి భావం. వరకట్నం స్త్రీ పురుషుల సమానతా భావానికి గొడ్డలి పెట్టని పి. సంజీవమ్మగారు వ్రాశారు. కట్నమూ, చదువుకు ఖర్చూ రెండూ భరించాల్సి వస్తుందని ప్రతిభావంతులయిన యువతులను తల్లిదండ్రులు పై చదువులకు పంపటం లేదని ఎస్. సి. భాగ్యవతిగారు విమర్శించారు. వరకట్న దురాచారం స్త్రీల ఆత్మగౌరవానికి భంగకరమని రజితగారు నొక్కి చెప్పారు. వరకట్నం ఇవ్వడం తల్లిదండ్రులకు భారమనే విషయం అందరూ అంగీకరించేదైనా దానిని అప్రధానాంశగా తలచి అందరూ విడిచిపుచ్చారు. మొత్తంమీద వరకట్నం కోరడంగాని, ఇవ్వడంగాని సమానత్వ సిద్ధాంతాన్ని త్రోసి రాజనడమని తేలుతున్నది. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం ఫ్రెంచి విప్లవ నినాదాలు. ఇవి మానవ విలువలు. వీటిని మన రాజ్యాంగ ఉపక్రమణిక (Preamble) లో కూడా వ్రాయటం జరిగింది. ఈ మూడూ ఒక దానిని విడిచి మరియొకటి మనలేవు. సమానత్వం లేని స్వేచ్ఛ రాణించదు; స్వేచ్ఛ లేనిది సమానత్వం నిరుపయోగం. బానిసత్వంలో సమానత్వం [illegible] కాని [illegible]

ఈ నాటి స్త్రీ ఎలా విషవలయంలో చిక్కుకున్నదో సోదాహరణంగా నిరూపించారు వనమాలగారు. జమీందారీ భూస్వామ్య విలువల విడనాడలేక మధ్య తరగతి ఎలా కొట్టుమిట్టాడుతున్నదో వివరించారు డా॥ జి. హరగోపాల్‌గారు.

మత తంతులన్నీ స్త్రీలకు తక్కువ హోదాను ఇచ్చాయని మమతా లక్ష్మన్నగారు రుజువు చేశారు. వివాహం స్త్రీ యొక్క మేథా జీవితానికి చరమ గీతం పాడుతున్నదని వారు భావ వ్యక్తీకరణ చేశారు.

ఇలా ఇంచుమించుగా అందరూ ఈనాటి వివాహ వ్యవస్థ స్త్రీని దాస్య శృంఖలాలలో బంధిస్తున్నదని అంగీకరించారు. దీనికి ప్రత్యామ్నాయం కొరకు అన్వేషణ ప్రారంభమయింది. తమ వ్యాసం 'విభిన్న వివాహరీతులు' అనే దాంట్లో మల్లాది సుబ్బమ్మగారు సంస్కరణ వివాహం, ఆదర్శ వివాహం, విప్లవ వివాహం అనే మూడింటిని పేర్కొన్నారు. అనేక సూచనలు వచ్చాయి రంగం మీదికి. కులమత ప్రసక్తి లేని వివాహాలు కావాలని, వర్ణాంతర మతాంతర వివాహాలను అందరూ ప్రోత్సహించాలని శ్రీ రాజ్యం సిన్హాగారు, న్యాయమూర్తి పున్నయ్యగారు కోరితే ఏక కులంలో వివాహాల నిషేధం అవశ్య కర్తవ్యమని వి. కోమలి, ఎ. గంగాధరరావుగారలు ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదన వ్యక్తిస్వేచ్ఛకు భంగకరమని రంగనాయకమ్మ, ఎం. వి. రామమూర్తిగారలు దానిని ప్రతి ఘటించారు. సంస్కరణకు ప్రాముఖ్యత ఇవ్వాలని ఒక వర్గపు వాదన; వ్యక్తి స్వేచ్ఛకు ముప్పు రాకూడదని మరియొక వర్గపు ఆలోచన. వ్యక్తి స్వేచ్ఛ పెరుగుతుందీ ప్రతిపాదన వల్లనని సమాధానం. పెరగడం తరగడం ముఖ్యం కాదు; సిద్ధాంత రీత్యా అది తప్పని సవాలు. కుంటి నడక సాగిస్తున్న సంస్కరణోద్యమాలపట్ల విసుగు పుట్టినపుడు ఇలాంటి సూచనలు రావడం అసహజం కాదు. మానవ మతం ఒకటే ఉండాలని వి. లీలావతిగారి ప్రతిపాదన గమనార్హము; ఆమోద యోగ్యము.

కుటుంబాన్ని ఆస్తి సంబంధాల సందర్భంగాను పరిశీలించాలని అంటే మౌలికమైన ఆర్థిక పునాదిని, ప్రాతిపదికను గుర్తించాలని ఆచార్య ఎ. ఆర్. దేశాయిగారు సూచన చేశారు. అంత, 'ఆస్థి సంబంధాలు మారిన సోషలిస్టు దేశాలలో స్త్రీ పురుషుల అసమానత్వ పరిస్థితి మారలేదు కదా అనే ఆక్షేపణ వచ్చింది. ఆ వాస్తవాన్ని ఒప్పుకుంటూ పితృస్వామ్య' విలువల ఉనికిని అంగీకరించడం జరిగింది. కాగా, పెట్టుబడిదారీ దేశాలలోని స్త్రీల స్థితికీ, సోషలిస్టు దేశాలలోని స్త్రీల స్థితికీ ఉన్న తేడా వివరణ వచ్చింది.

వివాహం, ప్రస్తుతం, పెట్టుబడిదారీ దేశాలలోనేగాక సోషలిస్టు దేశాలలోకూడ వ్యవస్థగా కొనసాగుతున్నమాట యథార్థం. స్త్రీ పురుషుల మధ్య అసమానత్వం రెండు సమాజాలలోను నెలకొని ఉన్నది. కాగా, ఆ వ్యత్యాసం – అంటే అసమానత్వంలో తేడా - గుణాత్మకమా లేక పరిణామాత్మకమా అనేది మీమాంస. విద్యావిషయికంగా సోషలిస్టు దేశాల స్త్రీలు పురోగమిస్తే పెట్టుబడిదారీ దేశాల ప్రతినిధి అయిన అమెరికాలో స్త్రీలు సామాజికంగా ముందడుగు వేశారు. ఆర్థికంగా సోషలిస్టు దేశాల స్త్రీలు అమెరికను స్త్రీలను అధిగమించారు. రాజకీయంగా ఇరు దేశాల స్త్రీలు ఒకే స్థితిలో ఉన్నారు. మగవారి అహంకారానికి ఇరువురూ ఏదో రూపంలో బలి అవుతున్నారు. ఇది పితృస్వామ్య విలువల ప్రభావం; పురుష దురహంకార ఫలితం. పురుషాధిపత్య సమాజ లక్షణం.

'వివాహ వ్యవస్థ అవసరమా' అనే ప్రశ్నకూ, 'వ్యక్తి స్వేచ్ఛ వివాహ వ్యవస్థలో మనగలదా' అనే ప్రశ్నకూ అవినాభావ సంబంధం ఉందని ఆచార్య లక్ష్మన్నగారు ప్రకటించారు వ్యక్తి స్వేచ్ఛ వైవాహిక జీవితంలో సాధ్యమైతేనే వివాహ వ్యవస్థ ఉనికి వాంఛనీయ మవుతుందని సమస్య యొక్క కొలికి పూసను బహిర్గతం చేశారు. కనీసం వృద్ధాప్యంలో సాహచర్యం కోసమైనా వివాహ వ్యవస్థ అవసరమని జె. కమలాబాయ్‌గారు వ్యవస్థ ఉనికిని సమర్థించారు. 'వివాహ వ్యవస్థ అవసరమా' అనే ప్రశ్న అరరహితమని మహీగర రామమోహన్‌గావుగాగు అంటూ అది మన ఇషా

మల్లాది సుబ్బమ్మగారు నిర్వచనం చేసిన విప్లవ వివాహానికి రంగనాయకమ్మగారు ప్రతిపాదించిన వివాహ వ్యవస్థ రద్దుకూ విషయ ప్రధానంగా తేడాలేదు.

యువతీ యువకులలో అభ్యుదయ భావాలు ప్రసారం చేయటానికి, వారు వివాహ పూర్వం కలసి సంప్రతించుకోవటానికి అభ్యుదయ వేదిక లాంటి వేదికలు అవసరమని డా॥ బల్వంత్‌రెడ్డిగారు తమ అభిప్రాయాన్ని విశదీకరించారు. ఇలాంటి వేదికలు "పెళ్ళిళ్ళ పేరయ్యలు" కారాదని రంగనాయకమ్మగారు హెచ్చరించారు. ఇదంతా మధ్య తరగతివారి సమస్య అనే ఈసడింపుకు సమాధానంగా డా॥ రమా మేల్కోటేగారు మధ్య తరగతి కృషిని కూడా బలపరచవలసిన అగత్యం ఉందన్నారు. 'రావలసిన మార్పు మనస్సులో' నని నార్ల వెంకటేశ్వరరావుగారు హెచ్చరించారు. ఈ ఉద్యమంలో యువత ప్రాధాన్యతను రతన్ ప్రసాద్‌గారు వివరించారు.

సమాజ ప్రగతికి సామాజిక శక్తులు ప్రేరకాలు; సామాజిక సంస్థలు సాధనాలు. కొలదిమంది వ్యక్తుల మనస్సులలో పుట్టిన భావ సంచయం క్రమక్రమంగా సమాజంలో తగినంత మందికి ప్రాకుతుంది. వారు సామాజిక మార్పుకు చోదక శక్తిగా రూపొందుతారు. సమాజంలో బలవత్తరంగా నెలకొని ఉన్న వ్యవస్థలను మార్చడానికి ప్రయత్నిస్తారు. వారి భావాలు వ్యవస్థలపై ప్రభావాన్ని చూపిస్తాయి. వ్యవస్థలు వారి భావాలపై ప్రభావం కలిగి ఉంటాయి. ఇలా వ్యక్తులు లేక వారి సంఘాల భావాలు, సామాజిక వ్యవస్థలూ ఒకటి మరియొక దానిని ప్రభావితం చేసుకుంటూ సాగిపోతయి. వ్యక్తులు లేనిదె సమాజం లేదు. సమాజంలేని వ్యక్తి లేడు. కాగా భావ విప్లవం ముందు; కార్యాచరణ తర్వాత. మానవ సంకల్ప బలాన్ని విస్మరించటం ప్రమాదకరం. అలాగే సంప్రదాయ భావాల బలిమిని, పాతకాలపు సంబంధాలను వ్యక్తం చేసే సంస్థలూ, వ్యవస్థలూ వీటి యొక్క ప్రతిబంధక తత్వాన్ని గుర్తించి, మదింపువేసి వాటిని అధిగమించడానికి కృషి చేయటం అవసరం. అలాంటి కృషియొక్క అవశ్యకతను ఈ గ్రంథం స్వేచ్ఛా ప్రియుల దృష్టికి

# రావలసిన మార్పు మనస్సులో

- నార్ల వెంకటేశ్వరరావు

వివాహ వ్యవస్థలో పవిత్రత అనేది ఏదీ లేదు. ఒక్కొక్క దేశంలో, ఒక్కొక్క జాతిలో, ఒక్కొక్క కాలంలో ఒక విధమైన వివాహ వ్యవస్థ ప్రచారంలో ఉండేది. ఇప్పుడు కూడా ఆ విధంగానే ఉన్నట్లు చెప్పవచ్చు. మన దేశంలో కూడా కొన్ని కొన్ని ప్రాంతాలలో బహు పత్నీత్వం ఉండేది. కొన్ని ప్రాంతాలలో, కాదు, హెచ్చు ప్రాంతాలలో బహు పత్నీత్వం ఉండేది. పోతే ఒకే భార్యకు నలుగురైదుగురు భర్తలు ఉండటం కూడా కద్దు. అది కూడా మన దేశంలో ఉన్నది. ఆటవికులలో వివాహానికి ముందు అన్య పురుషులతో సంపర్కం పెట్టుకొనడం తప్పుగా భావించడం లేదు. ఇది మన దేశపు ఆటవికులలోనే కాదు. మరి మెలినీషియాలోకూడా ఈ విధమైన ఆచారం ఉన్నది. ఆఫ్రికను దేశాలలోకూడా ఈ విధమైన ఆచారం ఉన్నది. అందువల్ల వివాహ వ్యవస్థ విషయంలో ఇది పవిత్రమైనది, ఇది అపవిత్రమైనది అని చెప్పడానికి ఎంత మాత్రమూ వీలులేదు. కాగా బహుళ దేశాల, బహుళ ప్రజల అనుభవాన్ని పురస్కరించుకొని చెప్పగలిగినటువంటి మాట ఆ MONOGAMY అనేది; అంటే ఒకేభార్య ఒకే భర్త అనేపద్ధతి సర్వోత్తమమైనదిగా కనిస్తున్నది. ఒక వేదకాలంలో మాట నేను గట్టిగా చెప్పలేనుగాని, తర్వాత మాత్రం దీనికి విరుద్ధంగానే దేశంలో జరిగినట్టు కన్పడుతున్నది.

ఆర్యుల రాకకుముందు ఈ దేశానికి వచ్చినవారు నిషాదులు, కిరాతులు, ద్రావిడులు. తర్వాత వచ్చిన వారు ఆర్యులు. మొదటి మూడు జాతులలో ఏ విధమైన వివాహ వ్యవస్థ ఉండేదో నాకు తెలియదు. కాని ఆర్యులు వచ్చిన తరువాత ముఖ్యంగా బ్రాహ్మణాలు, గృహ్య సూత్రాలు అనేటటువంటి మతగ్రంథాలు వెలువడిన తరువాత బహు పత్నీత్వాన్ని అంగీకరించినట్లు కన్పడుతుంది. ఒక ధర్మశాస్త్రంలో ముఖ్యంగా బ్రాహ్మణ కులానికి చెందిన వారు ఒక బ్రాహ్మణ స్త్రీని, ఒక క్షత్రియ స్త్రీని, ఒక

పూర్తిగా విశ్వసించినవారు మన విశ్వనాథ సత్యనారాయణగారు. ఆయన తన పెద్ద నవల 'వేయి పడగల'లో దాని ముఖ్యపాత్ర ధర్మారావు చేత ఈ విధంగా నాలుగు కులాలనుంచి నల్గురు స్త్రీలను వివాహం చేసుకున్నట్లో లేక దగ్గరకు చేర్చుకున్నట్టో రచించారు. ఆ విధంగా చేయటంవల్ల తన ధర్మాన్ని, మత ధర్మాన్ని, మానవ ధర్మాన్ని పరిపాలించినట్లు నిరూపించడానికి ప్రయత్నం చేశారు కూడా. మరి ఈ విధమైన వ్యవస్థను క్రైస్తవ మతం ఒప్పుకోదు. నాకు తెలిసినంతవరకు బౌద్ధం ఒప్పుకోదు; జైనం ఒప్పుకోదు. ఇస్లాం మాత్రం ఒప్పుకుంటుంది. మరి ఈ మాట అంటే మన ముస్లిం సోదరులకు ఆగ్రహం రావచ్చునేమో కాని విల్ డ్యూరాంట్ తన 'హిస్టరీ ఆఫ్ సివిలిజేషను' లో (WILL DURANT IN HIS HISTORY OF CIVILI-SATOIN) ఒక ఛలోక్తి విసిరాడు. మహమ్మదు ప్రవక్త మొత్తం నల్గురిని వివాహం చేసుకున్నాడు. అందువల్ల నేకావచ్చు నల్గురివరకు వివాహం చేసుకోవటంలో తప్పులేదనిచెప్పాడు. ఆయనకు అయిదుగురుభార్యలుంటే బహుశ అయిదుగురి వరకూ వివాహమాడవచ్చని అనేవాడేమో అని ఛలోక్తిగా ఒక మాట అన్నాడు. ఏమైనా ఈ విధమైన వివాహ వ్యవస్థ వల్లను జీవితం దుఃఖభాజనం కావటానికి అవకాశాలు చాల హెచ్చుగా ఉన్నవి. అయితే ఒకే భార్య ఒకే భర్త అంటే 'మోనగిమీ' (MONOGAMY) వ్యవస్థలో కూడ సాధక బాధకాలు చాలా లేకపోలేదు. దీనికి కారణం ఏమిటంటే స్త్రీకి ప్రతిపత్తి తక్కువ చేయడమే. స్త్రీ పురుషులకు సమానమైన హక్కులున్నపుడే, ప్రతిపత్తి ఉన్నప్పుడే, బాధ్యతలున్నపుడే, స్వాతంత్ర్యం ఉన్న పుడే ఏవివాహమైనా సుఖవంతంగా ఉంటుంది; ఆనందదాయకంగా ఉంటుంది. సంఘ క్షేమానికి తోడ్పడుతుంది. అలాకాని పక్షంలో, పురుషుని ఆధిక్యత బాగా చెల్లినపుడు, సంఘం ముందుకు నడవటానికి బదులు వెనక్కి నడవడమే జరుగుతుంది. మన ధర్మశాస్త్రాలలో, మన గృహ్య శాస్త్రాలలో ఇంకా తక్కిన మత గ్రంథాలలో స్త్రీకి చాల హీనమైన స్థానాన్ని నిర్ణయించారు. మనుధర్మ శాస్త్రంలో స్త్రీ స్వాతంత్ర్యానికి అర్హురాలు కాదన్నంత వరకు వెళ్ళటం జరిగింది. స్త్రీ కన్యగా తల్లి దండ్రుల పోషణలో ఉండాలని, భార్యగా భర్త పోషణలో

అనర్హురాలని స్పష్టంగా చెప్పడం జరిగింది. తక్కిన ధర్మ శాస్త్రాలయినా ఇంతకు తక్కువగా చెప్పలేదు. ధర్మ శాస్త్రాలను మించి కూడా పురాణాలు స్త్రీకి చాల అన్యాయం చేసినవి. అందువల్ల ఈనాడు మన దేశంలో గృహిణి స్థానం అనేక సందర్భాలలో అని అనను-చాల సందర్భాలలో చాల హీనంగా, హేయంగా ఉన్నది. ముఖ్యంగా మధ్య తరగతి కుటుంబాలలో దీనిని మనం చూస్తాం. మనలో స్త్రీ యొక్క ప్రతిపత్తి తక్కువ అనే విశ్వాసం, స్త్రీ స్వాతంత్ర్యానికి అనర్హురాలనే నమ్మకమూ ఇవి కారణాలని నేను అనుకుంటాను. ఈ విధమైన నమ్మకం మన మతంలో ఉన్నది; ఆచార వ్యవహారాలలో ఉన్నది. మన రక్తంలో ఉన్నది. చివరకు మనలోనే వున్నదని కూడా చెప్పవచ్చు. ఇది తొలగనంతవరకు సుఖమైనటువంటి వైవాహిక జీవితము సాధ్యం కాదేమోనని నామటుకు నాకు గట్టి అనుమానము.

మరొక విషయం నాకు ఎప్పటికపుడు ఆశ్చర్యాన్ని కలిగిస్తూ ఉంటుంది. అదేమిటంటే, మన దేశంలో — ఎందువల్ల జరుగుతున్నదో తెలియదు. బహుశః స్త్రీ యొక్క ప్రతిపత్తి తక్కువ అనే అభిప్రాయం మన రక్తంలో జీర్ణించి పోయినందు వల్లనే కావచ్చు. పురుషుడు స్త్రీ పట్ల చేస్తున్న అన్యాయాల కంటే స్త్రీ స్త్రీ పట్ల ఎక్కువ అన్యాయంగా, ఎక్కువ క్రూరంగా, ఎక్కువ ఘోరంగా ప్రవర్తిస్తున్నదని నాకు అనిపిస్తున్నది. ఇటీవల పత్రికలలో దాదాపు ఏ రోజు పత్రిక తీసినప్పటికి ఎవరో ఎక్కడో ఒకచోట ఒకరినో ఇద్దరినో కట్నాలు పూర్తిగా తేలేదని చెప్పేసని కాల్చి చంపినట్లు వార్తలు కనబడుతున్నాయి. వార్తలను క్షుణ్ణంగా పరిశీలించినట్లయితే, కట్నం తగినంత తేలేదని ఈ హత్యకు ప్రధాన కారణం. నూతన వధువు అత్తగారే అవుతున్నదేమోనని అనిపిస్తున్నది. స్త్రీ స్త్రీపట్ల ఇంత క్రూరంగా, ఇంత ఘోరంగా ఎందుకు ప్రవర్తిస్తున్నదో నామట్టుకు నాకు అర్థం కావటంలేదు. అన్నట్టు అర్థంకావటం లేదని చెప్పనక్కర లేదేమో! ఎందుకంటే ఇందాక చెప్పినట్లు ఒక స్త్రీ స్థానం ఒక పురుషుని స్థానంకంటే హీనమయినదని, హేయమయినదనే విశ్వాసం మన రక్తంలో జీర్ణించి పోయింది

నమ్మకం మనలో బాగా పాదుకు పోయినట్లు కనిపిస్తున్నది. ఈ నమ్మకం పురుషుడికంటే స్త్రీ లోనే ఎక్కువగా వుండేమోనని అనిపిస్తున్నది. పైగా మనం పతివ్రతలని పొగిడే వాళ్ళు — సీతకాదు నిజానికి — ముఖ్యంగా దమయంతి, సావిత్రి వగైరాలు — పూర్తిగా వ్యక్తిత్వాన్ని చంపుకొని భర్త సేవచేస్తేనే తాము మోక్షాన్ని పొందుతామని, ముక్తిని పొందుతామని, తమ జన్మ తరిస్తుందని, తమకు ఆధిక్యత లభిస్తుందని భావిస్తున్నట్లు చూపించారు. ఎప్పుడైతే ఈ విధమైన వ్యక్తిత్వం లేనటువంటి, మెదడుకూడా లేనటువంటి స్త్రీలను ఆదర్శపు గృహిణులుగా, భార్యలుగా చూపించడం జరిగిందో, అప్పుడు వాళ్ళకు సంబంధించిన కథలు నిత్య ప్రచారాన్ని పొందడం ప్రారంభమయింది. అలాంటప్పుడు ఈనాడు స్త్రీల పట్ల జరుగుతున్న అత్యాచారాలను చూచి మనం ఆశ్చర్యపడనక్కరలేదు.

ఇంతకంటె నాకు చిత్రంగా, విపరీతంగా తోచే విషయం : ఉన్నత విద్యను అభ్యసించినవారు – బి. ఏ; ఎం. ఏ డిగ్రీలు పొందినవారు, డాక్టరేటు కూడా పొందినటువంటి వారు – స్త్రీ లలో ఈనాడు చాల మంది ముఖ్యంగా మధ్య తరగతిలో నుంచి పైకి వస్తున్నారు; వీళ్ళలో కూడా పాత ఆచారాలపట్ల, విశ్వాసాలపట్ల ఎందుకు అంత అభిమానం వుంటున్నదో నామట్టుకు నాకు పాలుపోవటం లేదు. మరి చదువు దారి చదువు అవుతుంటే, నమ్మకాల దారి నమ్మకాలు అవుతున్నవి. విజ్ఞానం ఒక దారిన పోతుంటే, ప్రవర్తన మరో దారిన వెళ్తున్నది విశ్వాసాల దారి ఇంకొకటి అవుతున్నది. మరి ఈ విద్యకూ, విజ్ఞానానికి, విశ్వాసాలకూ పొంతన లేకుండా ఎందుకు పోతున్నదో నేను చెప్పలేకుండా ఉన్నాను. అది విద్యావిధానంలో లోపమా లేక సంస్కృతిలో లోపమా ఆలోచించి నిర్ణయించు కోవలసిన విషయం. ఈనాడు –40, 50 ఏండ్ల నాటికంటే – కేవలమూ కట్నాలపైనా, కానుకల పైనా ఆధారపడి ఉన్నదేమోనని అనిపిస్తున్నది. ప్రేమించి వివాహం చేసుకొంటున్నవారు బహు అరుదుగా కన్పడుతున్నారు. కేవలం తమకు వస్తు వాహనాల రూపంలో, ఇతరకట్నాల కానుకల రూపంలో ఎంత ఎక్కువ వస్తే అందుకోసం [illegible]

పోయినట్లయితే-నూతన వధువును దారుణంగా హత్యచేయటం జరుగుతూ ఉన్నది. ఈ విధమైన వివాహ వ్యవస్థ మన దేశంలో ఈ విధంగా కొనసాగి నట్లయితే అసలు వివాహ వ్యవస్థ రద్దయి పోవడమే మంచిదేమోనని అనిపిస్తూ వుంటుంది.

ఈనాడు సంఘంలో చెలరేగుతున్న దురాచారాలు తొలగాలంటే కనీసం విద్యాధికులైన యువతులు కట్నం కోరిన వారిని ఏమైనా సరే మేము వివాహం చేసుకోమని పట్టుదల చూపిస్తే తప్ప మార్గం లేదేమోనని తోస్తున్నది.

మరొకటి ఏమిటంటే నేను ముందే చెప్పినట్లు పురుషుడు స్త్రీ పట్ల కంటే స్త్రీ స్త్రీపట్ల ఎక్కువ క్రూరంగా, ఘోరంగా ప్రవర్తించడం ఈనాడు జరుగుతున్నది. అత్త తానుకూడా ఒకనాడు కోడలేననే సంగతి ఎలా మరిచి పోతున్నదో, ఎందుకు మరిచిపోతున్నదో తెలియటం లేదు. పైగా మన దేశంలో విద్య ఎతంగా వ్యాప్తి చెందినా, విజ్ఞానం ఎంతగా వృద్ధి చెందినా పూర్వాచారాలు సడలక పోవటానికి, మూఢ విశ్వాసాలు తొలగక పోవటానికి ప్రధాన కారణము స్త్రీయే నేమోనని అనిపిస్తున్నది. ఒక వేళ పురుషుడు ఒక అడుగు ముందుకు వేద్దామని సంకల్పించినా స్త్రీ వెనక్కు లాగడం సర్వ సాధారణంగా మనం చూస్తున్నాము. ముఖ్యంగా నేను ఈ మాటలు చెప్పడంలో నా మనస్సులో పెట్టుకుంటున్నది మధ్యతరగతి వాళ్ళను. ఈ మధ్యతరగతికి ప్రత్యేక ప్రాధాన్యం ఉన్నది మన దేశంలోనే కాదు ఏ దేశంలో నయినా, ఏ కాలంలో నయినా. ఎందువల్లనంటే మధ్య తరగతికి చెందినవాళ్ళే తక్కిన వారికి ఆదర్శాన్ని నిర్ణయించే వారవుతారు. ఇంగ్లీషులో (TREND SETTERS) అవుతారు, అందువల్ల వీళ్ళే కనుక అనుచితంగా, అన్యాయంగా, అజ్ఞానంగా ప్రవర్తిస్తున్నపుడు తక్కిన వారిలో ఈ దుర్గుణాలు ప్రతిఫలించడంలో ఆశ్చర్యం లేదు.

ప్రస్తుత వివాహ వ్యవస్థ మారాలన్నట్లయితే

1. కట్నాల దురాచారాన్ని పూర్తిగా తొలగించడం అవసరం.
2. అది తేలికగా తొలగదు కాబటి కనీసం

3. తమరిని కట్నం కనక అధికంగా తీసుకురమ్మని వేధిస్తుంటే తల్లిదండ్రులవద్ద ఏడుపులు మొత్తుకోళ్ళు చెయ్యడంకంటే వెంటనే పోలీసులకు రిపోర్టిచ్చి వేధిస్తున్నవారిని కోర్టుకు ఈడ్వడమో, రచ్చకు లాగడమో అవసరము.

4. కేవలం వివాహం తమకులంలోనే, శాఖలోనే జరగాలని కోరుకోకూడదు. అర్హుడైన యువకుడు ఏ కులానికిచెందిన వాడయినా, ఏ శాఖకు చెందిన వాడయినా, ఏ మతానికి చెందిన వాడయినా అతడిని వివాహం చేసుకోవడానికి సన్నద్ధత ప్రదర్శించాలి.

5. స్త్రీకి తక్కువ ప్రతిపత్తిని నిర్దేశిస్తున్నటువంటి ఈ పురాణాలనూ, ధర్మశాస్త్రాలనూ, గృహ్య సూత్రాలనూ, ఇతర మత గ్రంథాలను తుంగలో తొక్కాలి. వాటిని పవిత్ర గ్రంథాలుగా భావించరాదు; అంతేకాదు అవి అంటే ఈసడించుకోవాలి. అవి ఈ కాలానికి పనికిరావని త్రోసిపుచ్చాలి. ఒక విధంగా రామస్వామి నాయకరు వెళ్ళినంతవరకు వెళ్ళి వీటిని బాహాటంగా తగలబెట్టినప్పటికీ నేను సంతోషిస్తాను.

6. భర్త బాధలు పెట్టున్నట్లయితే, లేదా అత్తమామలు బాధలు పెట్టున్నట్లయితే విడాకులు కోరడానికి ఏ మాత్రమూ సంకోచించ నక్కర లేదు. వయస్సులో ఉన్న యువతి ధైర్యంగా ప్రవర్తించి, అన్యాయాలను ఎదుర్కొని, అవసరమైతే విడాకులనుకోరి, తిరిగి రెండో వివాహం చేసుకోవడానికి సన్నద్ధత చూపించాలి. పురుషుడు రెండవ వివాహం చేసుకోవడానికి ఏమి అభ్యంతరం లేనప్పుడు స్త్రీ అదేవిధంగా చేయడానికి ఎందుకు అభ్యంతరం ఉండాలో నామటుకు నాకు అర్థంకాదు. విడాకుల విషయంలో ఇప్పుడెందుకో కొంత సంకోచం కన్పడుతున్నది ముఖ్యంగా యువతులలో. ఈ విధమైన సంకోచానికి నిజంగా ఆస్కారంలేదు. నా మటుకు నేను కనీసం అయిదారు సందర్భాలలో భర్త చాలా క్రూరంగా ప్రవర్తించినపుడు, అన్యాయంగా ప్రవర్తించినపుడు, కట్నాన్ని దిగమింగి గొంతు కోయడానికి సిద్ధపడినప్పుడు భర్తకు విడాకులిచ్చి వివాహం చేసుకోమని యువతులను ప్రోత్సహించాను. నైతిక మయిన సమర్థన పూర్తిగా చేశాను. అలా వివాహం చేసుకున్నవారు చాల సుఖజీవనం చేస్తున్నారు కూడా. చిన్నదానికి పెద్దదానికి చిల్లితగాదా

భర్తతో జీవితం భారమయినపుడు తప్పకుండా విడాకులు తీసుకోవలసిందే, వివాహం చేసుకోవలసిందే. అందులో ఎంతమాత్రమూ తప్పులేదు. అది దూష్యం కానేకాదు. ఈ విషయంలో పురుషునికి ఒక నియమమూ, స్త్రీకి మరొక నియమమూ ఉండటం కంటే – నిజానికి – విపరీతమేమీలేదు. ఈ విషయంలో స్త్రీలూ పురుషులూ అందరికీ సమానమయినటువంటి స్వాతంత్ర్యం ఉండాలి; సమానమయినటువంటి అవకాశాలు ఉండాలి. ఒకరు చేస్తే తప్పుకానిది, మరొకరు చేస్తే తప్పు కానక్కరలేదు.

అన్నింటికంటే నొక్కిచెప్పవలసింది ఇదే. వివాహవ్యవస్థ కానివ్వండి, ఇతర సామాజిక సమస్యలు కానివ్వండి, సాంస్కృతికంగా మన దేశాభివృద్ధి కానీయండి వీటన్నింటిలోనూ ముందడుగు వేయవలసినది స్త్రీ. ఆవిడ కనుక ముందడుగు వేసినప్పుడు ఆవిడ బిడ్డలుకూడా ముందడుగు వేస్తారు. తరువాత ఆవిడ మనవళ్ళు, మనవరాండ్రుకూడా ముందడుగు వేస్తారు. ఈ విధంగా జాతే పురోగమిస్తుంది. ఇందుకు మారుగా స్త్రీ కనుక వెనకడుగు వేస్తూఉంటే మొత్తం సంఘమే వెనుకబడిపోతుంది. స్త్రీలు ఈ విషయంలో చూపించ వలసినంతటి చొరవ, నాయకత్వపు లక్షణాలు చూపించక పోవడం నిజంగా శోచనీయం. ఏ దృష్టితో చూచినప్పటికి కూడా ముఖ్యంగా ఈ విషయంలో ఈనాడు నిందించవలసినది ఉన్నత విద్యను అభ్యసిస్తున్న యువతులనేమో అని నేను అన్నందుకు వారు నన్ను మన్నిస్తారని నేను భావిస్తున్నాను. ఎందువల్లనంటే సాంఘిక విషయాలలో, వైవాహిక వ్యవస్థ విషయంలో, ఇతరంగాను ఉండవలసిన చొరవ వీరిలో కన్పడటంలేదు. స్వతంత్ర బుద్ధి కనపడటంలేదు. ధైర్య సాహసాలు, విజ్ఞత, వివేకం కన్పడటంలేదు. అందువలన ఏ బి.ఏ. నో, ఎం.ఏ. నో చదువుకున్న యువతి వివాహం అయిన వెంటనే వరలక్ష్మి వ్రతమనో, శ్రావణ శుక్ర వారమనో, మరొకటనో, చేస్తూంటే నాకేదో జుగుప్సాకరంగా ఉంటుంది. ఇంత చదువుకున్న తరువాతకూడా వ్రతాలు ఈ విధమైన మూఢ విశ్వాసాలలో కూడా లేక ఎవరో ముసలమ్మ చెప్పిందనో, తాతమ్మ చెప్పిందనో — ఈ పాడుపనులు చెయ్యడానికి వీరు అంగీకరించవచ్చునా?

ఏనాడో చేసిన స్పెషల్ మేరేజి ఆక్టు (SPECIAL MARRIAGE ACT) ఉన్నది. ఆ శాసనం ప్రకారం వివాహం చేసుకున్నట్లయితే ఈనాడు గృహిణికి – భార్యకు లేనటువంటి హక్కులు – ప్రత్యేకమైనహక్కులు – కొన్ని సిద్ధిస్తవి. అయినప్పటికి కూడా తనకు అర్థంకాని మంత్రాలతో, తమకు గౌరవంలేని పురోహితుడు పెండ్లి చేయిస్తుంటే ఆ తతంగానికి వీరు అంగీకరిస్తారూ ? ఆ తతంగం జరగకపోతే ఏదో లోపం జరిగిందని భావిస్తారు. "అయినప్పుడు ఈ బి.ఏ. డిగ్రీ ఎందుకు తగలెయ్యనా ? ఈ ఎం.ఏ. డిగ్రీ ఎందుకు మంటకలపనా ? ఈ డాక్టరేటు ఎందుకు గోతిలో పెట్టనా ?" అని నాకు అనిపిస్తుంది.

ఇంతకూ నేను చెప్పకోరిందేమిటంటే — ప్రత్యేకించి నొక్కి చెప్ప కోరుతున్నదేమంటే వివాహవ్యవస్థలో కానివ్వండి, లేక ఇతర సామాజిక సంస్కరణలో కానివ్వండి, సాంస్కృతిక రంగంలో పురోగతి కానివ్వండి నాయకత్వం వహించవలసింది స్త్రీ. అలాంటి స్త్రీయే ఈనాడు వెనుకపడి ఉన్నది. ఈ పరిస్థితిలో మార్పురానంత వరకు మనం ఎక్కడ వేసిన గొంగళి అక్కడనే పద్ధతిలోనే ఉండిపోతాము ; మనం ఏ విధమైన ప్రగతిని సాధించలేము.

తరువాత, వస్త్రాలంకరణలో నూతనత్వం కనపడుతున్నది. 'మేకప్' లో నూతనత్వం కనపడుతున్నది. మనస్సులో మాత్రం ఏ విధమైన నూతనత్వం కనపడటం లేదు. నడవడికలో, విశ్వాసాలలో నూతనత్వం కనపడటంలేదు. కేవలం బాహ్యాలంకరణ, వస్త్రాలంకరణలో కనపడే నవ్యత్వం పైపై మెరుగు మాత్రమే. అందువల్ల అయ్యేది, పొయ్యేది ఏ మాత్రమూలేదు. అది మార్పుకాదు. మార్పు జరగవలసింది మనస్సులో, విశ్వాసాలలో, మార్పు జరగవలసింది జీవిత విధానంలో. అది రానంతవరకు మనదేశంలో ఈ వరకట్నాలు తప్పవు ; వరకట్నాలకోసం హత్యలు తప్పవు ; స్త్రీకి హీనస్థితీ, హేయస్థితీ తప్పదు ; పురుషుని దురహంకార ప్రవర్తన తప్పదు ; సంఘం ఈనాటివలె తక్కిన ప్రపంచం కంటే ఏడడుగులు వెనకకుపడి ఉండడం తప్పదు.

# విభిన్న వివాహరీతులు

— వంల్లాది సుబ్బమ్మ

మానవ జీవితంలో వివాహం చాలా ముఖ్యమైనది. మధురమైనది. మహత్తరమైనది. శాశ్వతమైనది, అనిర్వచనీయ అనుభూతిని కలిగించేది. ఎక్కడోపుట్టి మరెక్కడో పెరిగిన ఇద్దరు వ్యక్తులు స్వయం సంపూర్ణమైన ఒక ఏకత్వాన్ని ఆశించి చేసే మహాప్రయాణం ఈ వివాహంతో ఆరంభ మవుతుంది. ఆ క్షణంనుండి వారిది ఒకేమాట; ఒకేబాట, ఒకే భావన. అది వారి ఇచ్ఛాసంకల్పం కూడాను. అది ప్రాచ్యదేశం కాని, పాశ్చాత్య దేశంకాని వివాహం ఒక నూతన జీవితాన్ని ప్రసాదిస్తుంది. వధూవరుల వ్యక్తిగత జీవితంలో ప్రాధాన్యత వహిస్తుంది. ఈ అద్వైతసిద్ధి విశేషమే వివాహం. అచ్చగా ప్రేమానురాగాలకే కాక కొన్ని సాధనలకు, బాధ్యతలకు అంకురార్పణ అవుతుంది. ఆ కర్తవ్యనిర్వహణలో వారు ధర్మబద్ధులై అకుంఠిత దీక్షాస్వీకారంచేసే అద్వైతమూర్తులవుతారు. జీవితాన్ని ఒక శాంతి నిలయంగా లోకధర్మప్రాయంగా మలుస్తుంది ఈ వివాహ ఘట్టం. హెచ్చు తగ్గులులేని స్వేచ్ఛా సమానత్వాలు వెల్లివిరిసే సాంఘిక సహజీవన వ్యవస్థే వివాహం. "ఎవరు నిర్మించినా అది ఇల్లే, కాని దంపతులు ఆ ఇంట్లో ప్రవేశించగానే దాన్ని గృహం అంటాం" అన్నాడు రస్కిన్. అలాంటి వైవాహిక జీవితాన్ని ఎలా సుఖవంతం చేసుకోవాలి? అసలు సనాతన సంప్రదాయ వివాహాలకు, ఆధునిక వివాహాలకు తేడాలేమిటి? పాత అంతా పనికిమాలినదేనా? సంస్కరణ వివాహాలు, ఆవర్ణ వివాహాలు, విప్లవాత్మక వివాహాల ప్రత్యేకత ఏమిటి? అనే విషయాలు మన ముందుకొచ్చాయి. ఈ వివాహాల గురించి తర్జన భర్జనలు జరుగుతున్నాయి. కనుక చర్చించాల్సిన అవసరం కలిగింది.

సనాతన హిందూ వివాహ విధానంలో కన్యాదానం, పాణిగ్రహణం, సప్తపదివుంటాయి. వధువును ఆమె తల్లిదండ్రులు వరునికి దానంచెయ్యటమే కన్యాదానం. చేతిలో చెయ్యివేసి బాసచెయ్యటమే పాణిగ్రహణం. వరుడు

జీవయాత్రకు చిహ్నం. వాటికి బలం, ఆహారం, ధనం, సఖ్యత, దాంపత్యం, సంతానం, సౌఖ్యం అనే వాటిని సంకేతాలుగా నిర్వచిస్తారు. వీటికోసం తనతో ఏడు అడుగులు వెయ్యమంటాడు వరుడు. ఇలా జరుగుతుంది సప్తపది తంతు. ఈ సనాతన పద్ధతిని ఆధునికులు నిరసిస్తారు. దానికి కారణాలనేకం: ఒకే కులంవారు అంటే బ్రాహ్మణులే పౌరోహిత్యం చేయడం, ప్రజలకు అర్థంకాని సంస్కృత భాషలో మంత్రాలు చదవడం, వధువు వరుని చేపట్టటం కాక వధువును దానం చేయడం అవి. సప్తపది మంత్రం విష్ణుమూర్తి పరంగా చెప్పడంలాంటి పద్ధతులన్నీ మతపరమైనవే. ఈ సనాతన వివాహం వ్యక్తిగత మనోభావాలను చంపుతుంది; వ్యక్తిత్వాన్ని కించపరుస్తుంది. ఇది మానవాభ్యుదయానికి గొడ్డలిపెట్టు. కనుక సామాజిక మార్పు, శాస్త్రీయవిజ్ఞానం పెరుగుతున్న ఈ రోజుల్లో వెనుకబాటు తనాన్ని గౌరవించే సనాతన వివాహాలు ఆదర్శంకావు. కనుక సభ్యప్రపంచం ఆలోచించాలి.

ఇస్లాం శాస్త్రప్రకారం మహమ్మదీయ వరుడు ఇస్లాం యువతిని, లేక క్రైస్తవ స్త్రీని వివాహమాడవచ్చు. కాని తదితర మతాల వారిని వివాహమాడరాదు. ముస్లింల పెళ్ళి కంట్రాక్టుమీద జరుగుతుంది. ఇది వధూవరుల మధ్య ఒప్పందంక్రింద లెక్క. "ఇంత మహర్‌తో ఫలాని ఆయన నిన్ను పెళ్ళాడుతానంటున్నాడు. నీకు ఇష్టమేనా?" అని వధువును అడుగుతారు. వధువు తరఫున వ్యవహరించే వ్యక్తి — అన్న, పినతండ్రి, మేనమామలాంటివారు సారధ్యం వహిస్తారు — 'వలి' ఇద్దరు సాక్షుల ఎదుట వధువును ఆమె అంగీకారాన్ని గురించి అడిగితే ఆమె ఇష్టపూర్వకంగా తలూపినా, లేక మౌనంగావున్నా ఆమె ఆ పెళ్ళికి ఒప్పుకున్నట్లే. ఈ విషయాన్ని 'వలి' సభాముఖంగా నాయబ్ (పురోహితుడు) కు చెప్తాడు. సాక్షులు తల ఊపుతారు. నికా రిజిష్టరులో వ డు, వధువు తరఫున 'వలి' దస్కతు చేస్తారు. దాంతో పెళ్ళి అయినట్లే. పరదా పద్ధతి వున్నందున వధువు వరుని, వరుడు వధువును ముందుగా చూడటానికి వీలులేదు. తరువాత ముస్లిం వివాహవ్యవస్థ ఏకపక్షంగా వుండి పురుషాధిపత్యానికి అనుకూలంగా ఉన్నందున ఇది స్త్రీలకు నష్టదాయకం. ముస్లింస్త్రీ బాగంగా

భర్త అజ్ఞానుసారంగా జీవితం సాగించాలి. ముస్లిం స్త్రీల ఈ దుర్భర పరిస్థితిని మేధావులు హర్షించరు.

**క్రైస్తవ వివాహం :-** క్రైస్తవ వివాహం చర్చిలో జరగాలి. దేవుని సాక్షిగా మతగురువు ఆధ్వర్యంలో ఈ పెళ్ళి జరుగుతుంది. ఇందులో వధువు వరునికి విధేయతగా వుంటానని ప్రమాణం చేయాలి. క్రైస్తవ వివాహం వల్ల క్రైస్తవ శాసనాలు ఆ దంపతులకు వర్తిస్తాయి. ఆస్తి వారసత్వం దగ్గరనుండి విడాకుల వరకు వారి ప్రత్యేక శాసనాలు వారిని బద్ధపరుస్తాయి. అవి స్త్రీలకు వ్యతిరేకంగా ఉన్నాయి. స్వేచ్ఛా సమానత్వ సూత్రాలకు ఈ వివాహపద్ధతి వ్యతిరేకం. "దేవుడు జతపరచిన వారిని మనుష్యులు వేరుపరచకూడదు." (మత్తయి - అ. 19) ఏవైనా విషమ పరిస్థితులు ఏర్పడినప్పుడు భార్యా భర్తలు విడివిడిగా జీవించవచ్చు గాని విడాకులు తీసుకోరాదు అని క్రైస్తవ మతం ఆంక్షలు విధించింది. 1869 లోని చట్టం ప్రకారం కొన్ని పరిస్థితులలో మాత్రమే విడాకులు పుచ్చుకొనే అవకాశం క్రైస్తవ స్త్రీలకు వచ్చింది. ఆ చట్టంలోకూడా స్త్రీలపట్ల కఠోరమైన నిబంధనలున్నాయి. పురుషుడికి లభించినంత తేలికగా స్త్రీకి విడాకులు లభించవు. ఈ వివక్షను ఆధునిక స్త్రీలు అవమానంగా భావిస్తున్నారు.

**రిజిష్టరు పెళ్ళి :-** ప్రత్యేక వివాహశాసనం (SPECIAL MARRIAGE ACT) క్రింద జరిగే పెళ్ళి కొంతగా ఆమోదకరమైనదని గుర్తించాలి. ఈ వివాహానికి వధువుకు 18, వరునికి 21 సంవత్సరాలు విధిగా నిండి వుండాలి. వివాహానంతరం రిజిష్టరు చేసుకుంటే వారిద్దరి వయస్సు 21 ఏళ్ళు తప్పనిసరిగా నిండాలి. ఈ ప్రత్యేక వివాహం విభిన్న జాతులు, కులాలు, మతాలు, దేశాలభాషలు, తెగలు వీటికిచెందిన వారిమధ్య జరగవచ్చు. రిజిష్ట్రారుకు 30 రోజులు ముందుగా నోటీసు ఇవ్వాలి.

ముగురు సాక్షులతో [illegible]

(Indian Succession Act) వర్తిస్తుంది. విడాకుల నిబంధనలు ప్రత్యేక వివాహ శాసనంలో పొందుపరచబడినాయి 30 రోజులు ముందుగా నోటీసు ఇవ్వవలసి ఉండడం, కారణాలు చెప్పకుండా విడిగా వుండవలసిన పరిస్థితి ఏర్పడిందనిచెప్పి విడాకులుపొందే అవకాశం దంపతులలో ఏ ఒక్కరికో లేకపోవడం, వారసత్వ శాసనంలో లోపాలు, ఇవన్నీ ఈ వివాహంలో అసౌకర్యాలుగా పరిణమించాయి. కాగా మత వివాహాలకన్నా ఇది మెరుగయినది.

**సంస్కరణ వివాహం:-** సంస్కరణ వివాహాల్లో పెండ్లి తంతు సందర్భంగా కాని, పెండ్లి షరతుల విషయంలో కాని, పెండ్లి జరిపించే వారి పరంగా కాని, పెండ్లి ప్రమాణాలవిషయంలో కాని మార్పువుంటుంది. అన్నింటా విధిగా మార్పువుండవలసిన అవసరంలేదు. ఏ ఒక్క అంశంలో మార్పువున్నా చాలు. ఉ॥ పెండ్లి మంత్రాలు సంస్కృతంలో కాక తెలుగులో చదివితే అది సంస్కరణ క్రిందే లెక్క. మహమ్మదీయులలో, వధువుకు ఆ సందర్భంవస్తే విడాకులిచ్చే హక్కును, ఆమెపుట్టింట వరుడు నివసించాలనే నిబంధనకు, ఆమె తన సంతానానికి సంరక్షకురాలుగా ఉండే పద్ధతిని ఇలాంటివాటిని పొందుపరచి నికా రిజిష్టరులో వ్రాసుకుంటే అది మార్పే. హిందూ వివాహంలో ఇంతవరకు బ్రాహ్మణులే పౌరోహిత్యం చేస్తున్నారు. అలాకాక కులప్రసక్తిలేకుండా, స్త్రీ పురుష లింగవిభేదం లేకుండా ఎవరు ప్రమాణాలు చేయించినా అది మామూలు పద్ధతికి భిన్నమే. హిందూ వివాహంలో 'నా వెంట ఏడు అడుగులు వేయవలసినది' అని వరుడు వధువును కోరకుండా వధూవరులు ఇద్దరూ ఏడడుగులు వేయడం క్రొత్త విధానమే. పెండ్లి తంతును సర్వులకు అర్థమయ్యేలాగున చెయ్యటం, సనాతనాచారాలను మార్చటం, నేటికాలానికి అనుగుణంగా సరిదిద్దటం ఈ సంస్కరణ వివాహంయొక్క లక్షణాలు.

**ఆదర్శ వివాహ :-** ఇక ఆదర్శ వివాహంయొక్క విశిష్టతను గురించి చర్చిద్దాం. ఇందులో కన్యాదానంలేదు. ఈ నూతన వివాహం వల్ల కిన్నో

ప్రకటించుకోవచ్చు. వధువు, వరుడు ఒకరినొకరు ఎన్నుకొనుట జరుగుతుంది. దండలుమార్పిడి దానికి గుర్తు. ఆ మార్పిడి ఒకరినొకరు వరించారనడానికి నిదర్శనం. ఈ పెళ్ళి ప్రమాణాలు వధూవరులకు అర్థమయ్యే భాషలో జరుగుతాయి. మామూలుగా ప్రమాణం ఇలావుంటుంది. "కలిమి లేములలో, కష్టసుఖాలలో పాలు పంచుకుంటూ నీకు చేదోడు వాదోడుగా వుంటూ, నీ ప్రేయసిగా, స్నేహితురాలిగా, సహచారిగా, ఆలిగా ఉంటాను." అని వధువు ప్రమాణం చేస్తుంది. పదాలమార్పుతో అలాగే వరుడు ప్రమాణం చేస్తాడు. ఇలాంటి వివాహంలో కుల మత ప్రసక్తివుండదు. దేవుని ఊసే వుండదు. మంత్రాలు, తలంబ్రాలు, తాళిబొట్టు అసలేవుండవు. తిథి, వారం, వర్జ్యాల ప్రసక్తేరాదు. తమకు అనుకూలమైనప్రదేశంలో, అవకాశాన్నిబట్టి తగిన సమయంలో ఈ పెళ్ళిళ్ళు జరుగుతాయి. కాని ముహూర్తబలాన్ని బట్టికాదు. ఇందులో కట్నకానుకలకై తర్జనభర్జన లుండవు. విందులు వినోదాలకై తలకుమించిన ఖర్చులుండవు. ఆడంబరాలకై అర్రులుచాచరు. మూఢవిశ్వాసాల స్వైరవిహారం వుండదు. వధూవరులు, వారి తల్లిదండ్రులు, బంధువర్గం, స్నేహబృందం అరమరికలు లేకుండా తమ సంపూర్ణ సహకారాన్ని అందిస్తారు. ఈ ఆధునిక వివాహాలు పురుషులే కాక స్త్రీల ఆధ్వర్యంలో కూడా జరగవచ్చు. అందులో వధూవరులచేత స్త్రీయే ప్రమాణ స్వీకారాన్ని చేయిస్తుంది. ఈ రోజునుండి "జీవితాంతం కలిసివుంటాం" అని ప్రమాణం చేయించదు. ఇద్దరిచేత దండమార్పిడి జరిపించి కార్యక్రమాన్ని నిర్వహిస్తుంది. అన్ని విషయాలలో పరస్పరం గౌరవించుకొంటూ ఇతరుల ప్రమేయం లేకుండా సంప్రదించుకొంటూ సాహచర్య జీవితం గడపమని దంపతులను హెచ్చరిస్తూ వివాహవిధిని పూర్తిచేస్తుంది.

ఈ ఆదర్శ వివాహాలు ఒకరి ఆధ్వర్యంలో జరగాలనే నియమంలేదు. వధూవరులే ప్రమాణాలు చేయవచ్చు. కాగా వివాహం సామాజిక వ్యవస్థగా చలామణీ అవుతున్నది కనుక పెద్దలయెదుట ప్రమాణాలు చేస్తారు. నిజానికి వివాహం ఇద్దరు వ్యక్తుల జీవితాలకు సంబంధించింది. కాగా సంతానం, ఆస్తిపాస్తులు వగైరా విషయ సందర్భంగా సామాజిక గుర్తింపు అవసర మవుతుంది. [illegible]

పద్ధతి పూర్తిగా మత తంతును వ్యతిరేకిస్తుంది. మతగురువు ఆధ్వర్యంలో పెళ్లికాని, న్యాయాధికారిఎదుట పెళ్ళికాని ఆధునికుల్ని అసంతృప్తిపరుస్తుంది. ఆ దంపతులు ఆజన్మాంతం దంపతులుగా వుంటామని ప్రమాణం చెయ్యటానికి ఇష్టపడరు. వ్యక్తికీ ప్రకృతికి వున్న సంబంధాన్ని వెలికితెచ్చే నిమిత్తం వారు సముద్ర తీరాన్నో, పర్వత ప్రాంతాన్నో, తోటలనో తమ వివాహ వేదికలగా ఎంచుకుంటారు.

**విప్లవ వివాహం :-** విప్లవ వివాహం పై రెంటికీ భిన్నమయింది. దీంట్లో ఏ తంతూ ఉండదు. పెద్దల సమావేశం ఉండదు. వేదిక ప్రమాణాలు ఉండవు. ప్రేయసీ ప్రియులు ఇద్దరూ కూడబలుక్కుని కాపురం చేస్తుంటారు. అంతే కాని భార్యాభర్తలు కారు. ఒకరు భరించేవారు రెండోవారు భరింపబడేవారు కాదు. ఒకరిపై రెండవ వారికి హక్కులూ, బాధ్యతలూ లేవు. పరస్పర ప్రేమానురాగాలు, గౌరవభావం, సదవగాహన, సానుభూతితోకూడిన స్పందన ఇవి ఆ కలయికకు ఆలంబనాలు. నిజానికి ఈ రకపు కాపురం పరిణతమనస్కులకే పరిమితం. సామాన్యులకు ఇది అదుబాటులో ఉండదు. ఇది సంస్కారులైన స్త్రీ పురుషులకు అనువైన పద్ధతి. ఇది ప్రస్తుతానికి జనసామాన్యానికి అపర్శప్రాయం. ఈ రకపు కలయిక వివాహవ్యవస్థ యొక్క మౌలికోద్దేశ్యానికి ప్రాధాన్యతను ఇచ్చి బాహ్య రూపాలను, వాటిలో ఏర్పడ్డ వికారాలను త్రోసిరాజంటున్నది. మానసిక స్వేచ్ఛకు, నికార్సయిన ప్రణయానికి పట్టంకట్టుంది. ప్రేమ లోపించిననాడు వారిరువురూ రభసలేకుండా, సామాజిక దౌష్ట్యంవల్ల బాధపడకుండా విడిగా కాపురముంటారు. ఆ ఏర్పాటుకు వారికి కోర్టులు అవసరంలేదు. తగాదా తీర్చటానికి పెద్దల ప్రమేయం పనిలేదు. ఇంత తేలికగా విడిపోవడానికి ఆస్కారమిచ్చే పద్ధతి మరొకటిలేదు. కొంతమంది ఈ పద్ధతిని 'వివాహం' అని పిలవడానికి అభ్యంతరం చెప్తారు. కాని నిజానికి ఆ అభ్యంతరం నిలవదు. పెండ్లితంతు దేశకాల ప్రాంతాలనుబట్టి ఉంటుంది.

ఈనాడు వివాహాలలో కూడా విప్లవాత్మకమైన మార్పు

కొన్నిదేశాలలో; కన్యనే వివాహమాడతామంటారు మరికొన్ని దేశాలలో; విధవావివాహం అమలులో వుంటుంది కొన్నిచోట్ల; అది నిషేధం మరికొన్ని ప్రాంతాలలో; ముసుగులో దూరడమే పెండ్లి తంతుగా ఒక తెగలోవుంటే సూత్రధారణ మరొకజాతిలో వుంటుంది. ఓలికి ఒకజాతి ప్రాధాన్యతఇస్తే మరొకజాతి వరకట్నానికి పెద్దపీట వేస్తుంది. ఆలుమగలుగా కొంతకాలం కాపురముంటే వారిని దంపతులుగా గుర్తిస్తుంది మరో సమాజం. కనుక ఫలానా తంతు ఉండాలని నిర్దేశించ వీలులేదు. ఆ తంతుకు వేరే సాక్ష్యం అవసరంలేదు. ఇద్దరు స్త్రీ పురుషులు ఒకఇంట్లో సహచరులుగా ప్రేయసీ ప్రియులుగా కాపురముండటమే వివాహానికి నిదర్శనం. దానినే అవసరమైతే 'తంతు' గా ఎంచుకోవచ్చు. స్త్రీ పురుషులు ఆలుమగలుగా బహుకాలంగా కాపురం చేస్తుంటే ఇరుగు పొరుగువారు వారిని భార్యాభర్తలుగా గుర్తిస్తే, వారి సంతానాన్ని తన సంతానంగా పురుషుడు ప్రకటిస్తే ఆ స్త్రీ పురుషులిరువురూ వివాహితులనే భావనను అంగీకరిస్తుంది హిందూ ధర్మశాస్త్రం. కాగా హిందూవివాహం శాస్త్ర నిబంధనలకు వ్యతిరేకంగా వుండరాదు. అంటే ఒకస్త్రీ, ఆమె పినతల్లి కుమారుడు ఇరువురూ ఆలుమగలుగా చాలా సంవత్సరాలుగా కాపురం చేస్తున్నారనుకోండి, అయినా వారిని భార్యా భర్తలుగా పరిగణించ వీలులేదు. కనుక తనతో కాపురమున్నటువంటి స్త్రీని పురుషుడు తన భార్యగా పేర్కొంటేనో, లేక చాలా ఏండ్లుగా కలిసి వారిరువురు కాపురం చేస్తేనో వారిద్దరిమధ్య వివాహం అయివుంటుందని ముస్లింలా ప్రాతిపదికగా అంగీకరిస్తుంది. కాగా ఆ వివాహం జరుగలేదని ఇతరత్రా రుజువు చేయవచ్చును. అలాగే బహుకాలం కలిసి కాపురం చేస్తున్న స్త్రీ పురుషులను భార్యా భర్తలుగా ఎంచవచ్చని సాక్ష్య సంబంధమైన శాసనం ( Indian Evidence Act) 114 వ సెక్షన్ చెప్తుంది. అయితే వారికి వర్తించే శాసనం ప్రకారం వారు వి వా హ మా డి ఉండటానికి ప్రతిబంధకాలు ఉండరాదు. మత వివాహంలో సూచించబడిన పైన ఉదహరింపబడిన ఆంక్షలు విప్లవ వివాహంలో, ఉండవు. అయితే విప్లవ వివాహం ఇంతవరకు శాసనబద్ధం కాలేదు.

ఇద్దరూ స్వయం సంపూర్ణమైన వ్యక్తులుగా విశాల పరిధిగల అభ్యుదయంలోకి అడుగుపెడతారు. ఇద్దరూ ప్రేమతో సమష్టిగా వ్యక్తిత్వాలను పెంచుకుంటారు. కాని రెండో వ్యక్తిని తమ స్వార్థానికి వాడుకోరు. అవతలి వ్యక్తియొక్క శ్రేయస్సుకై పాటుపడతారు. కాని, వారిని విధేయులుగా స్వీకరించరు. ఆ వివాహాలలో దాంపత్య సాహచర్యం నిర్బంధంగా వుండదు. పరస్పరానుభూతులతో సమ్మిశ్రితమై హృదయాలను ఉల్లాసపరుస్తుంది. వధూవరులలో హెచ్చు తగ్గులను, తేడాలను నిరసిస్తుంది. వివాహం వధూవరులిద్దరికీ కావలసిన విషయం. ఇరువురి సౌకర్యం, సంతోషం, సుఖం, ఆనందం ఇమిడిఉన్నాయి అందులో. అంతేకాని పురుషుని సౌకర్యం కోసం మాత్రమే సృష్టించబడిన వ్యవస్థకాదు. ఆమాటకు వస్తే స్త్రీ భద్రత కోసం, పోషణ కోసం ఉద్దేశింపబడినది కూడాకాదు. అంతేకాదు. ఇటీవల ప్రేమ, సెక్సుల గురించి భావాలు మారుతున్నాయి. సెక్సు సంబంధంగా స్త్రీకి పరిగణన లభిస్తున్నది. ప్రేమ అంటే పాతివ్రత్యం మాత్రమే అనేభావన తొలగిపోతున్నది. ప్రేమభావన పురుషుడుకూడా ప్రదర్శించవలసి వస్తున్నది. పెంపుడు జంతువులపైచూపే శ్రద్ధాశక్తులు, అభిమానాలుకాదు. ఆలిపై చూపవలసిన ప్రేమ అంటే పరస్పర గౌరవంపై ఆధారపడిన ఆర్ద్రభావన అని. ఆ భావనకు ఆవిర్భావం, వృద్ధి, వికాసం ఆదర్శ విప్లవ వివాహాలలోనే కలుగుతుంది.

ఒక్క విషయం నొక్కి వక్కాణించవలసి ఉన్నది. విప్లవ వివాహం సర్వులకూ పనికిరాకపోవచ్చును. సర్వులకూ వర్తించకపోవచ్చును. పరిణత మనస్కులకు, స్వేచ్ఛా జీవులకు, మానవ విలువలను వంటపట్టించుకున్న వారికి మాత్రమే అది ఆచరణయోగ్యం కావచ్చును. కాగా ఆదర్శవివాహం అందరికీ అందుబాటులోనిది. అందరికీ ఆచరణ సాధ్యమైనది. మానవ విలువలను మానవ సమాజంలోని వ్యత్యాసాలను సమన్వయించేసేది. ఆదర్శ వివాహాలను ప్రోత్సహించడం విజ్ఞుల, సహృదయుల కర్తవ్యం.



# వివాహము - ఎంపిక

— డా॥ రావి భారతి

వివాహం ఒక నూరేళ్ల పంట. ఆ పంటని ఫలవంతంగా మార్చడంలో భార్యా భర్తలిద్దరూ భాగస్వాములే. ఒక బండికి రెండు చక్రాల్లాగా, పక్షికి రెండు రెక్కల్లాగా సామరస్యం ఉంటేనే ఆ దాంపత్యం సమంగా ఒడుదుడుకులు లేకుండా సాగిపోతుంది, కనుక ఒక వివాహఘట్టానికి పూర్వరంగం ఎంత పటిష్టంగావుంటే వివాహవ్యవస్థ అంత బలంగానూ, ఆరోగ్యదాయకంగానూ ఉంటుంది. ఆ పూర్వరంగానికి పునాది "వధూ వరుల ఎంపిక".

ఈ ఎంపిక కొన్ని సందర్భాల్లో పరస్పర ప్రేమ ప్రాతిపదికగా జరుగుతుంది. ఇలాంటి వివాహాలు అయిదుశాతం మాత్రం జరుగుతాయి. కొన్ని విఫలమైపోవడంకద్దు. ప్రేమ వివాహాల్లో కుల మత వర్గ వివక్షకు తావుండదు. కేవలం ప్రేమే వారి వివాహానికి ఒకవరం కనుక వరకట్నంయొక్క ప్రమేయం ఇందులో ఉండదు. ఏ వివాహమైతే ప్రేమ సూత్రంతో బంధింపబడుతుందో, ఏ బంధమైతే 'అనుబంధమే' ఆధారంగా నిలదొక్కు కుంటుందో అక్కడ ధన ప్రలోభానికవకాశముండదు. కనుక ఇలాంటి ప్రేమ వివాహాల్ని ప్రోత్సహించే స్వచ్ఛంద సంస్థలు ఆ ప్రేమను వివాహరూపంలో ఫలింపజేస్తే ఆ వివాహవృక్షం పుష్పించి, ఫలించి మూడుపూలు ఆరుకాయలుగా విలసిల్లుతుంది. నీరుపోసే నాధుడే కరువైనప్పుడు; శుష్కించి ఎండిపోతుంది.

ఇక్కడ యువత ఒక్కవిషయం గుర్తుంచుకోవాలి. ప్రేమ అనేది ఒకవరంలాంటిది. సాంఘిక బంధాలన్నింటికంటే అతి పవిత్రమైంది. నవ నాగరికత వెర్రితలలువేస్తున్న ఈ రోజుల్లో ప్రేమ ఒక 'మైకంగా', ఒక 'ఫ్యాషన్' గా మారి కాలక్షేపంకోసం, సరదాకోసం కలిసి తిరిగే తాత్కాలిక ఒప్పందంగా భావింపబడుతున్నది. ...

మనస్ఫూర్తిగా ప్రేమించుకొన్నామంటే సరిపోదు. వాస్తవిక దృక్పథంతో ఆ ప్రేమఫలించడంలో ఎన్ని అడ్డంకులుకలిగినా వాటినిదాటే ధైర్యం, నైతిక స్థైర్యం ఉంటేనే ముందడుగు వేయాలి. వివాహానంతరంకూడా సమాజం నుండి ఎన్నో సవాళ్లు సహించవలసి ఉంటుంది. ప్రతిఘటన అనే పెనుతుఫానుకు తట్టుకొని నిలబడగలమన్న దృఢవిశ్వాసం, నమ్మకం ఇద్దరికీ ఉన్నప్పుడే వివాహఘట్టాన్ని చేరుకోవాలి. లేకపోతే ఆ ప్రేమకు స్వస్తి చెప్పడం సమాజానికి అన్నివిధాలా ఆరోగ్యదాయకం.

ఒక శోచనీయమైన విషయమేమిటంటే విద్యార్థినులుగ ఉన్న యువతులకు జీవితంపట్ల ఒక ధ్యేయంగానీ, లక్ష్యంగాని లేదు. "కాలేజీ చదువు" అనేది పెండ్లి అనే పొగబండి కోసం నిరీక్షించడానికి అనువైన 'ప్లాట్ ఫారమ్' గా భావించబడుతున్నది. సిగ్నల్ పడడమే ఆలస్యం, మూడుముళ్లు వేయించుకోవడానికి సిద్ధంగావుంటారు. ఈ విధంగా తన స్వంత అభిప్రాయాన్ని ఉట్టికెక్కించి, పెద్దవాళ్లు చదవమంటే చదవటం, వద్దంటే వెనకముందాడకుండా మానేయడం, ఇలాంటి గమ్యరహితమైన జీవితనౌక ఏ గాలివాటుకెటు పోతుందో ఎవరికెరుక ?

మరికొందరు ఆడపిల్లల మనస్తత్వాలు అతివిచిత్రమైన స్వప్నస్థితిలో తేలిపోతూఉంటాయి. తమ చుట్టూవున్న డబ్బు ప్రపంచం, సినిమాలు, నవలలు — ఇవి వాస్తవ ప్రపంచానికి దూరంగా తీసుకొనివెళ్ళి పంచరంగుల స్వప్నలోకంలో తేలేటట్లుగా చేస్తున్నాయి. రాబోయే వరుడు అందంగా, ఆరడుగుల పొడుగుండాలి, ధనవంతుడై ఉండాలి. విద్యావంతుడు, మంచి సంస్కారవంతుడై ఉండాలి. అన్నిటినిమించి అతడు తనను అమితంగా ప్రేమించాలి. వాస్తవ విరుద్ధమైన ఈ కోరికల కలలు చెదిరిపోయి, తమ తాహతుకు తగిన సగటు ఉద్యోగితో జీవితం ముడిపడితే, ఊహల్లో ఉండలేక, వాస్తవాన్ని అంగీకరించలేక మానసికవ్యధకు గురౌతూ జీవితాల్నే నాశనం చేసుకునేవారు లేకపోలేదు. కనుక యువతులు వాస్తవికతలో జీవించడం నేర్చుకోవాలి. సమస్యల్ని ఎదుర్కొంటూ, వాటి పరిష్కారం కోసం

తమ కుమార్తెల వివాహవిషయంలో వరుని ఎంపికలో తల్లిదండ్రుల మనస్తత్వాలుకూడా మారాలి. అయిదేండ్ల వయసు ఆడపిల్లను ముద్దుచేస్తూ "నా బంగారుతల్లికి డాక్టర్ని భర్తగా తెస్తాననో, నా చిట్టి తల్లిని ఇంజనీయరుకు ఇల్లాలిని చేస్తాననో" తాము కలలుకంటూ, వయసు పెరిగినకొద్దీ తమబిడ్డ కలలు కనడానికి అవకాశం కల్పిస్తూ, కోరిక నెరవేరక పోతే కృంగిపోయే తల్లిదండ్రులు కొందరుంటారు. కనుక ఆడపిల్లల ఆనందాన్నికోరే తల్లిదండ్రులే అయితే, తాము వాస్తవంలో జీవిస్తూ తమ సంతానాన్ని వాస్తవంలోనే ఊపిరి పీల్చేటట్లుచేయాలి. తమ ఆర్థిక స్థితి గతుల్ని, సమస్యల్ని తమ సంతానానికి మభ్యపెట్టకుండా ఎప్పటికప్పుడు విప్పిచెపుతూ ఉండాలి. అలాంటప్పుడు వారిలో ఎలాంటి మిథ్యా గౌరవానికి చోటుండదు. వరుని ఎంపికలో ఆతడు గొప్ప విద్యావంతుడు కాకపోయినా సంస్కారవంతుడయితే చాలు తమ కూతుర్ని ఈయడానికి వెనుకాడకూడదు. డిగ్రీల సంపాదన సంస్కారానికి గీటురాయి కాదన్న సత్యాన్ని తాము తెలిసికొని తమ సంతానానికి తెలియజెప్పాలి.

సంప్రదాయ వివాహాల్లో వధువుయొక్క ఎంపికలో ప్రథమఘట్టం 'పెళ్ళిచూపుల' తంతు. మనం సాంఘికంగా, వైజ్ఞానికంగా ఎంత పురోగమిస్తున్నామో, అంతకంటే పదింతలు తిరోగమన మార్గంలో పయనిస్తున్నాము. తరాలు మారుతున్నా ఈ తంతులో మార్పులేదు. ఒక సంతలో పశువుల శ్రేష్ఠతను పరీక్షించవచ్చు. లేదా మార్కెట్టులో ఒక వస్తువుయొక్క నాణ్యతను నిర్ణయించవచ్చు. కాని వివాహ విపణివీధిలో చైతన్యం మూర్తీభవించిన ఒక వధువు వ్యక్తిత్వాన్నే పణంగాపెట్టే ఈ పెళ్ళిచూపుల తంతు ప్రగతిశీలమైన మనజాతికే సిగ్గుచేటు. వధువు ఈ పెళ్ళిచూపుల తంతును ప్రతిఘటించడమే కాదు, ఈ తంతులో ఏకపక్ష నిర్ణయాధికారాన్ని, ఎంపికను సవాల్ చేయాలి. తానుకూడా వ్యక్తిననీ, తనకూ ఇష్టాయిష్టాలు, అభిరుచులు, జీవితంపట్ల కొన్ని విలువలు ఉన్నాయని తెలియజెప్పాలి.

ఒక్కొక్కచోట వధూవరులకు ఈడూజోడూ కుదురుతుంది. కట్నానికి లోటులేదు. పెట్టిపోతలకు కొదువలేదు. వధూవరులు ఒకరినొకరు అంగీక

వీల్లేదు. ఆడపిల్ల ఆశ్లేషంలో పుట్టింది కనుక అత్తగారికి గండం, మూలలో పుట్టింది కనుక మామగారు మంచమెక్కుతారు, జ్యేష్టలో పుడితే పెద బావ గారికి పరలోక ప్రయాణం ఖాయం. కుజ దోషంఉంటే కట్టుకున్నవాడు గుటుక్కుమంటాడు. ఇది వధువుకే వర్తిస్తుంది. వరుడికి కుజదోషం ఉంటే వధువుకు ఎలాంటి ప్రమాదంలేదు. అంటే నక్షత్రాలుకూడా పక్షపాతబుద్ధి పోనిచ్చుకోలేదన్నమాట. దేవగణం; మానవ గణం; రాక్షస గణం - వీటికి సంబంధిచిన 27 అంశాలు వధూవరులకు సరిపోవాలి. ఏ ఒక్కటి సరిపోక పోయినా ఆసంబంధం రద్దవుతుంది. ఇదీ జాతకాల భాగోతం; జాతకాలు సమగ్రంగాకలిసి శాస్త్రోక్తంగా జరిగిన వివాహాలు విచ్ఛిన్నం కావడంలేదా? అని ప్రశ్నిస్తే "ఆ దోషం జాతకానిదికాదు, జాతక రచనకేయబడిన సమయంలో వ్యత్యాసముందని" తప్పుకుంటారు. ఏ పాదంలో పుట్టినా ఏదో ఒక దోషం ఉండితీరుతుంది. ఆ దోషానికి 'శాంతి' సిద్ధంగా ఉంటుంది. మొత్తంమీద ఈ దోషాలనుండి తప్పుకోవాలంటే గర్భవతియైనతల్లి తిథి, వార, నక్షత్రాలుచూచి మరీ బిడ్డల్ని కనాలన్నమాట! ఈ విధంగా ప్రకృతి సిద్ధమైన పుట్టుకకీ, అశాస్త్రీయమైన జాతకానికి ముడిపెట్టి, 'శాంతి' పేరిట 'ముడుపు' వదిలించుకొనే మూర్ఖత్వం ఈ వైజ్ఞానిక యుగంలోకూడా మనల్ని వదలలేదు. పంచాగం రెండు భాగాలు. ఒకటి ఖగోళస్కంధం. రెండవది జాతకస్కంధం. గణితస్కంధం ఒక శాస్త్రం. జాతకస్కంధం ఊహాజనితం. కనుక దాని ఫలితాలు కాకతాళీయం. కనుక కాతరు చేయువలసిన అవసరంలేదు.

వధువు ఎంపికలో కొందరు మగపిల్లల మనస్తత్వాలు పరిశీలిద్దాం. తాతల కాలంనాటి బూజుపట్టిన దుస్సాంప్రదాయాలకూ, ఫ్యూడల్ భావాలకూ వీరు అవశేషరూపాలంటే అతిశయోక్తి కాదు. వీరు పుట్టుకచేతనే "బంగారు కడ్డీ" లుగా పరిగణింపబడుతూ ఉన్నత విద్యావంతులై భవిష్యత్తుకు బంగారు బాటల్ని నిర్మించుకుంటారు. వీరికి ఉన్నత విద్యావంతురాలైన భార్యగాని, ఉద్యోగంచేసే భార్యగాని అక్కరలేదు, భార్యకూడా ఉద్యోగం

లోకపరిజ్ఞానం ఉంటేచాలు, ఇంటిని, పిల్లల్ని చక్కదిద్దుకుంటుంది. మరొక్క విశేషం! చదువు లేకపోయినా చాలినంత కట్నంతేవాలి. అంత అందంగా లేకపోయినా అణకువగా ఉంటేచాలు. విదేశాలకు పంపిస్తే మరీ మంచిది. అక్కడి ఉన్నత విద్యకవసరమైన ఆర్థికభారం వహిస్తేచాలు, కానీ కట్నం అక్కరలేదు! విదేశాల్లో చదివించడమంటే ఆర్థికంగా వీధిన పడడమే!

ఈ ధనవ్యామోహం యువకుల్లో అంటు జాడ్యం లాగా వ్యాపిస్తున్నది. దీనికి కారణం మనం సులభంగా ఊహించవచ్చు. ఈ పెట్టుబడిదారీ సమాజంలో ఈనాడు వేలంవెర్రిగా చెలామణిఔతున్న అక్రమ సంపద, నల్లడబ్బు, యువతలకు వెర్రెక్కించి వ్యామోహంలో ముంచుతున్నాయి. అగ్నికి వాయువు తోడైనట్లు నవనాగరిక జీవనంపట్ల ఆసక్తి, విదేశీవ్యామోహం దానికి తోడవుతున్నాయి. కనుక ఏనాడయితే అక్రమ సంపాదన సాంఘిక నేరాల్లో ఒకటిగా పరిగణింపబడుతుందో, అవసరానికంటే ఎక్కువ డబ్బు కూడబెట్టడం సంఘువ్యతిరేక కార్యకలాపంగా ఎంచబడుతుందో, ఆనాడే ఈ 'డబ్బు' పట్ల ఏర్పడ్డ 'జబ్బు' మాయమౌతుంది.

వధువుయొక్క ఎంపికలో వరుని తల్లిదండ్రుల పాత్రకూడా చాలా ఉంది. వివాహం అన్ని వ్యాపారాల్లాగే ఒక వ్యాపారం. తమ కుమారునిపై శాము పెట్టిన పెట్టుబడి చక్రవడ్డీతోసహా రాబట్టాలి. కనుక వధువుకన్నా, వధువు తేబోయే కట్నం మొదట నచ్చాలి. ఈ 'డబ్బు' అనే పాదరసం తగిలితేచాలు అనాకారివధువైనా అందంగా మారుతుంది. బంగారు బొమ్మలా కనిపిస్తుంది. 'మనీ' మహత్యం మరి!

గత చరిత్ర అనుభవం ఎప్పుడూ మనల్ని ఆశావాదులుగానే ఉంచుతుంది. పరిశీలించిచూస్తే గతంలో ఏ సాంఘిక సంస్కరణోద్యమం కూడా విఫలం కాలేదు. ఆనాటి సతీ సహగమనం మొదలు మొన్నమొన్నటి అస్పృశ్యతా నివారణవరకు ప్రతీ సాంఘిక సంస్కరణవెనుక ఒక వీరోచిత పోరాటం నడిచింది. ఈనాటి వరకట్నం ఒక సాంఘిక ఆర్థిక సమస్య. మూఢనమ్మకాలు, మూఢాచారాలు ఒక సాంఘిక జాడ్యం. మనసులేని మనువులు జాతకాల జాడ్యాలు వరకట్న హత్యలు ... ఆశీస్సులు కట్నంలోని

సమాజాన్ని ఈనాడు పట్టి పీడిస్తున్న ఈ జాడ్యాన్ని జయించడానికి కొన్ని సూత్రాల్ని నేటి యువత పాటించాలి.

1) ప్రాంత కుల మత పరిధుల్ని వదలి విశాల సమాజ సముదాయంలో వరాన్వేషణ జరగాలి.

2) కేవలం విద్యాధిక్యత సంస్కారానికి గీటురాయికాదని ప్రతి యువతీ, యువకుడూ గుర్తుంచుకోవాలి.

3) వరకట్నంకోరే వరుల్ని వధువులు తిరస్కరించాలి.

4) పెళ్లిచూపుల తంతును ప్రతిఘటించాలి.

5) వివాహ సందర్భంలో వధువుకు స్థిరాస్తిరూపానగానీ, చరాస్తి రూపానగానీ సహోదరులతో సమానభాగం హక్కుగా చెందాలి. దానితో వరునకు గాని వరుని బంధువులకు గాని ఎలాంటి ప్రమేయముండరాదు.

6) యువత నిరాడంబర జీవన విధానాన్ని అలవర్చుకోవాలి.

7) వివాహాలలో ఆడంబరాల్ని తగ్గించి వ్యయంపై పరిమితుల్ని విధించాలి.

8) లాంఛనాలకు, సాంప్రదాయాలకు, మామూళ్లకు తిలోదకాలు వదలాలి.

ఇవేకాక సమాజం ఆర్థిక, సాంఘిక పరమైన మరికొన్ని మౌలికమైన మార్పులకు లోనైతే తప్ప ఈ వ్యవస్థకు అంటుకున్న అనేక జాడ్యాలు వదలిపోవు.



"తన భార్యను దాస్యంలో ఉంచే భర్తను నేను మరింతగా అసహ్యించుకుంటాను"

—ఇంగర్ సాల్

కుటుంబంలో ప్రజాస్వామ్యం ఉండాలని నా నమ్మకం.
కుటుంబంలో రాచరికం సాగరాదని నా అభిమతం.
స్వేచ్ఛ, సమానత్వం, ప్రేమలో నాకు విశ్వాసం ఉన్నది.

# ప్రేమ వివాహాలు సఫలం కావాలంటే

- వాసిరెడ్డి సీతాదేవి

ఒకనాడు స్త్రీకి భర్త భగవంతుడు. భగవంతుడుచేసే పనుల్ని ప్రశ్నించేహక్కు భక్తులకు ఉండదు. కొబట్టి ఆ సంసారాలు విచ్ఛిన్నం అయ్యే అవకాశం ఉండేదికాదు. భర్త తన్నినా, అవమానించినా, ఆ పాదాలలో ఇంత చోటుచేసుకొని పడిఉండేది.

కాని ఈనాడు చదువుకున్న యువతీ యువకులు వివాహం అనేది భగవంతుని నిర్ణయం ప్రకారం జరుగుతుందనే విషయాన్ని నమ్మడంలేదు. స్త్రీలుకూడా వరుణ్ణి ఎన్నుకొనే విషయంలో తమ ఇష్టాయిష్టాలను తెలియజేస్తున్నారు. ఆధునిక నారికి కావలసింది "స్వామి" కాదు "సహచరుడు". అందువల్లనే స్త్రీ తన వ్యక్తిత్వాన్ని చంపుకోలేక ఒకోసారి తిరగబడుతూంది. డైవర్సు వరకూ వెళుతూంది కథ.

ఒక అమ్మాయి ఎం. ఏ. చదివింది. స్వతంత్రభావాలుకల పిల్ల. ఒక మిలటరీ ఆఫీసరుతో వివాహం జరిగింది. పెళ్ళిచూపుల్లో ఒకరిని ఒకరు ఇష్టపడిన తరువాతనే ఈ వివాహం జరిగింది. కాని వివాహం అయిన నెల తరువాత ఆ పిల్ల పుట్టింటికి వచ్చింది. మళ్ళీ భర్తదగ్గరకు వెళ్ళనని మొండికేసింది. అతని అభిప్రాయాలూ, అలవాట్లూ ఆ అమ్మాయికి నచ్చలేదు.

ఒక లేడీ డాక్టరు ప్రేమించినవాడినే పెళ్ళిచేసుకుంది. ఇద్దరూ అమెరికా వెళ్ళారు

కెనడాలో చదువుతున్న మరో అమ్మాయి ఇండియాకు వచ్చింది. మళ్ళీ వెళ్ళిపోవాలి. పేపర్లో వరుడు కావాలని అనౌన్సు చేశారు. కులమింటి కుర్రాడితోనే వివాహం జరిగింది. భర్తతో కెనడా వెళ్ళింది. ఆరు నెలలు తిరక్కుండానే విడిపోయారు. అతను మరో వివాహం చేసుకున్నాడు. ఆ అమ్మాయి మనస్సు విరిగిపోయింది. అలాగే ఉండిపోయింది.

మన అభిప్రాయాల్లో కొంతవరకు మార్పువచ్చింది. వివాహపద్ధతులలో పెద్దగా మార్పురాలేదు. పెళ్ళిచూపుల్లో ఒకరినొకరు చూచుకున్నంత మాత్రంచేత ఆ వివాహం సఫలం అవుతుందనే నమ్మకం ఉండదు. ఒకసారి చూడగానే ఒకరి అభిప్రాయాలు ఒకరికి అర్థంకావు. ఆలోచనలూ, అలవాట్లూ, తెలియవు. అందుకే పెళ్ళిచూపులకూ, వివాహానికీ మధ్య కొంత వ్యవధి కావాలి. ఆ వ్యవధిలో వారు సన్నిహితంగా మెలిగి ఒకర్ని ఒకరు అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాలి.

మనిషి సమాజజీవి. ఒంటరిగా ఉండలేడు. జీవన సహచరి లేక సహచరుడు కావాలి. వారి అభిప్రాయాలు కలిసినప్పుడే వారి జీవితం సాఫీగా సాగుతుంది.

'ప్రేమ వివాహాలు' ఎందుకు ఫెయిల్ అవుతున్నాయో చూద్దాం. వయస్సులోని ఆకర్షణనే ప్రేమని భావిస్తున్నారు. హృదయాలు కలవడం, డ్యూయెట్లు పాడుకోవడం సినిమాల్లోనూ, కథలలోనూ బాగానేవుంటుంది. కాని వాస్తవ జీవితంలో అడుగుపెట్టగానే, కేవలం శారీరక ఆకర్షణలోపడి అదే ప్రేమగా భావించిన వారి ప్రేమ పటాపంచలు అవుతుంది. "ప్రేమ గుడ్డిది", "లౌ ఎట్ ఫస్టుసైట్", "ప్యార్ హోతా హై మగర్ కియా నహి జాతా" అనే మాటలు వాస్తవ జీవితంలో ప్రవేశించాక అర్థరహితంగా కనిపిస్తాయి. ఒకర్ని ఒకరు అర్థంచేసుకొని, ఒకరి లోపాలను ఒకరు సహించగల మానసికబంధన ఉన్నప్పుడే వారిమధ్య ఉన్నది నిజమైన ప్రేమ అనుకోవాలి. ఇలాంటి వివాహాలు సఫలం అవుతాయి.

కొందరు భార్యల్ని కేవలం తమ కోర్కెలుతీర్చే యంత్రంగా మాత్రమే భావిస్తారు. పాతకాలపు భావాలుగల ఆడదయితే పాదదాసిగా పడివుంటుంది.

వివాహమనేది జీవితంలో చాలా ప్రధానమయిన విషయం. వివాహానికి పూర్వమే యువతీ యువకులు మనసువిప్పి మాట్లాడుకోవాలి. ఇంటి పరిస్థితుల్ని గురించికూడా మాట్లాడుకోవడం అవసరం. ఒకోసారి యువకుడు ఇంటికి పెద్దవాడై ఉంటాడు; బాధ్యత వహించవలసిన వాడుగా ఉంటాడు. భార్యకు అది ఇష్టంఉండదు. వివాహం కాగానే వేరు కాపురం పెట్టాలనే కోరిక ఆమెకు ఉండడం సహజం. అటువంటప్పుడు అతను తన ఉద్దేశ్యాలను భార్యకు వివాహంముందే ఖచ్చితంగాచెప్పి ఆలోచించుకొనే దానికి అవకాశం ఇవ్వాలి.

దాంపత్య జీవితం అంటే ఏమిటి? సుఖమయమైన దాంపత్య జీవితం గురించి వారి అభిప్రాయాలు ఏమిటి? వారి కోరికలు ఏమిటి? భవిష్యత్తు గురించి వారి కలలు ఏమిటి? మొదలైన అన్ని విషయాలమీద మనసులు విప్పి చర్చించుకోవాలి.

ముఖ్యంగా వారి ఆర్థిక స్థితిగతుల్ని గురించి చర్చించుకోవాలి. ప్రేమతో పొట్టనిండదు. పెళ్ళయి ఆర్థిక ఇబ్బందులకు లోనైన మరుక్షణంలోనే ప్రేమజ్వరం సబ్‌నార్మల్‌కు వచ్చేస్తుంది.

ఇది పురుష ప్రపంచం. వివాహం విషయంలో చదువుకున్న స్త్రీ బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రావాలి. సంఘర్షణ వక్తులమధ్య జరగదు; వారి భావాలమధ్య, అభిరుచులమధ్య జరుగుతుంది. అవసరం అయితే ఇద్దరూ తమ అభిప్రాయాల విషయంలో కొంతవరకు రాజీపడటానికి ప్రయత్నించాలి. ప్రేమ వివాహాలు విఫలం అవుతున్నాయి అనే అపవాదును తొలగించాలి. పాత పద్ధతుల వివాహాలే సుఖవంతంగా ఉన్నాయనే నమ్మకాలనుకూడా తొలగించి, కాలంతోపాటు ఆలోచించు కోవడం నేర్చుకోవాలి.



# ఆదర్శ దాంపత్యం

తురగా
జానకీరాణి

వివాహం అనే అంశం గురించి చెప్పాలంటే, లోకంలో ఎంతమంది దంపతులున్నారో అన్ని చోట్ల నిర్వచనాలు చేసుకోవలసివస్తుంది. ఒక మనిషిని ముమ్మూర్తులా పోలిన మనుషులేవిధంగానైతే వుండరో, ఒక దాంపత్యానికి నమూనా అనదగిన దాంపత్యం మరొకటి వుండదు.

ఐనప్పటికీ స్థూలంగా కొన్ని అంశాలు సుఖజీవితానికి దోహదం చేసేవిగాను, మరికొన్ని అశాంతిని పురికొల్పేవిగానూ విభజన చేసుకునే అవకాశమున్నది. వివాహానికి సంబంధించిన ఏ సిద్ధాంతీకరణైనా, యీ అంశాలలోనే యిముడుతుంది. దేశకాల పరిస్థితులలో ఎటువంటి ముప్పులు వచ్చినా, సంసారంలో శాంతికీ, అశాంతికికూడా ప్రధానకారణం మాత్రం ఎప్పటికీ మనుష్య ప్రవృత్తే. ఇది అనుభవజ్ఞులందరికీ తెలుసు.

సుఖశాంతినిలయమై, గృహమే స్వర్గసీమ అనిపించేది ఆదర్శ దాంపత్యం. ఇది సృష్టిలోగానీ, ముల్లోకాల్లోగానీ లేదనడానికి తార్కాణం మన దైవాలు సైతం అస్తమానం కీచులాడుకోవడమే. ఇలా చెప్పుకొంటే మానవమాత్రులకు కూడా కొంత ఊరటగా ఉంటుంది. ఒక స్త్రీకి, ఒక పురుషుడికి మధ్య ఆకర్షణ, ఆరాధన, పెదవి విప్పి చెప్పకుండానే యింగితం గ్రహించుకునే అవగాహన, కంటికి రెప్పలా, గుండెలోని చప్పుడులా కలిసి పోవడం — ఇవన్నీ ఆదర్శ దాంపత్యం లక్షణాలు. దీని ప్రాతిపదిక ప్రేమ. సాంఘిక, ఆర్థిక, నైతిక విషయాలన్నిటికీ అతీతమై పెనవేసుకొని పోయిన ఒక స్నేహబంధం. ఈ బంధంలోని ప్రగాఢత, మైత్రిలోని తీపి జంటలు తమ జీవితంలోని కొన్నికొన్ని సందర్భాలలో చవిచూచి తరించి వుండ వచ్చును. కాని మన దేశంలో కొన్ని దశాబ్దాలపాటు సాగే సంసారాల్లో ఆ మైత్రి చెక్కుచెదరక అలాగే ఉంటుందనుకోవడం ఆత్మవంచన.

విద్య, వివేకం కలిగి, వయోజనులైన భార్యాభర్తలు స్వప్రయత్నం ద్వారా ఆదర్శ దాంపత్యాన్ని సాధించవచ్చును. ప్రతి రంగంలోను కృషి, పట్టుదల, చిత్తశుద్ధి, ఆత్మత్యాగం ఎంత అవసరమో ఈ విషయంలోనూ అంతే అవసరమవి. మనస్ఫూర్తిగా ప్రయత్నించి ఒక ఆచరణ సాధ్యమైన పద్ధతి ఎవరికివారు రూపొందించుకోవచ్చును.

ఇల్లా చెబితే, వివాహమనేది ప్రధానంగా ఒక సర్దుబాటు విషయం అని స్పష్టమవుతుంది. దైనందిన జీవితానికి సంబంధించిన చిన్న విషయాలనుంచి, బ్రతుకుకి అవసరమైన దీర్ఘకాల ప్రణాళిక వరకు ప్రతి అంశంలో తన జీవిత భాగస్వామి అభిప్రాయాలను మన్నించడం, చేతనైతే తనకు అనువుగా ఎదుటి వ్యక్తిని మార్చుకోవడం, తన సంసారధ్యేయం ఏమిటి, వ్యక్తిగత అభివృద్ధిని సాధిస్తానా, సంసారంలో ఒడిదుడుకులు లేకుండా జాగ్రత్త పడడం ఎల్లా అనేవి యోచించుకోవడం — ఇవన్నీ అవసరం. ఈ విషయాలు ఒక సమావేశంగా కూర్చొని చర్చిస్తారని కాదుగాని, సంసారం ఆరంభించిన తొలిరోజులలోనే ఎవరికి వారికి ఈ ధ్యేయాలు స్ఫురిస్తాయి. వాటిని గుర్తించి ఆ దిశగా జీవితాన్ని మళ్ళించవలసివుంటుంది. ఇష్టంతో చేయిచేయి కలుపుకొని ప్రయత్నించాలి. ఎడాపెడా లాక్కుండా, అసలు దారిలో కనిపించనంత గందరగోళంలో పడండాకునే ఈ సర్దుబాటు.

ఏజంట కాజంట ఈ సర్దుబాటు సాధించుకొన్నప్పటికీ, ఇరువురి కుటుంబాలకు సంబంధించిన ఇతరులు దాన్ని సాగనివ్వక పోవచ్చును. కనుక, ఆకాశం విరిగి నెత్తినపడినాసరే మనమిద్దరం ఒకటి అనే ఐక్యత దంపతుల్లో ప్రస్ఫుటమైతే, ఇతరులు ప్రక్కకు తప్పుకుంటారు. తల్లులకీ, తండ్రులకీ, ఇతర పెద్దలకీ తరచు గుర్తుచేస్తుండవలసిన సంగతిఇదే. వాళ్ళిద్దరిదీ ఒకే జీవితం, మనమంతా పరాయివాళ్ళం అనే సంగతి.

సంసారంలో అత్త, ఆడబిడ్డలు, తోడుకోడళ్ళు మొదలైన స్త్రీ జనం, మామ, మరదులు, బావలు మొదలైన పురుష జనం ఉంటారుకదా! ప్రతి దంపతులకి వీరందరిపట్ల కొద్దోగొప్పో బాధ్యతవుంటుంది. వివిధ దశలలో ఏ బాధ్యత ఎంతవరకు వహించాలి, ఎక్కడ నిష్కర్షగా వదిలించుకోవాలి అనే విషయాల్లో భేధాభిప్రాయాలు తరచుగా వస్తుంటాయి. 'నీ వాళ్ళు',

'నావాళ్ళు' అనే విద్వేషం అంకురిస్తుంది. కాపురం చేయువలసిన ఆలుమగల మధ్యనే, ఈ మధ్యవారి జీవితాదర్శాలు చొచ్చుకొనివస్తాయి. మారుతున్న ఆర్థిక వ్యవస్థలో, ఉమ్మడి ఆస్తులుతగ్గి, ఎవరి సంపాదన, వ్యక్తిగతసంపద వారికుంటున్న తరుణంలో, భార్య, భర్త, వారి సంతానం మాత్రమే ఒక 'యూనిట్' అని భావించాలి. అల్లాటి సందర్భంలో ఇతరులంతాకూడా తమ పరిధిని గ్రహించి, తమ కనీసావసరాలను మాత్రమే అన్న, వదినలు తీర్చారని అనుకోవాలి. తమపట్ల కొడుకులకుగాని, అన్నదమ్ములకుగాని పరిమితమయిన బాధ్యతవుందన్న సంగతి గ్రహించనివారు ఆలుమలమధ్య కలతలకు కారణమవుతారు. ఈ వత్తిడులను తట్టుకునే సహనం, వివేచన దంపతులలో ఉండాలి.

నాగరికత మనకిచ్చిన గొప్పశక్తి 'డబ్బు' అంటే అతిశయోక్తికాదు. ధనము, యితర సంపదలు విరాట్ స్వరూప-దాల్చి, భార్యాభర్తలను అవహించి ఆటలాడిస్తున్నవి. కోరికలు ఎప్పుడూ గుర్రాలే. సంసారంలోని భార్య భర్త, వారిపైన ఆధారపడిన యితరులుకూడా గుర్రపుపందేల ధోరణిలో కోరికలను పరుగులెత్తిస్తే ఆ సంసార రథం బోల్తాపడక తప్పదు. కాళ్ళ క్రిందవున్న భూమి గట్టితనం ఎంత, వడగాలికి, జడివానకు తట్టుకోవడానికి సంసారం ఎల్లా పటిష్టంచేసుకోవాలి అనే విషయాల్లో అందరికీ జాగ్రత్త అవసరం. పెద్దలు, ఆస్తులు, అప్పులు వాటన్నింటికీ సమాధానం చెప్పుకో గలిగిన గట్టితనం, పట్టువిడుపులు చాకచక్యం దంపతులకి వుండాలి. 'నీది', 'నాది' అనే ధోరణికంటే, మనది అనే ఉమ్మడి సమైక్యతావాక్కు అవసరం. లేకపోతే, అంపరిలో లోకువకావడం, ఎడాపెడా సంసారాన్ని నలుగురూ పట్టిలాగటం తధ్యం.

సంసారవృక్షానికి తియ్యని ఫలాలు బిడ్డలు. ఆ బిడ్డల సమగ్ర సంక్షేమంకోసం ఓర్పుతో కృషిచేయడం భార్యా భర్తలిద్దరి కర్తవ్యం. ఈ విషయంలో వంతులు, అభిప్రాయభేదాలు వచ్చినప్పుడు పిల్లలు నలిగి పోతారు. వారి వక్తిత్వం భయంకరంగా దెబ్బతింటుంది, స్వసుఖం త్యాగంచేసి, పిల్లలకోసం నిజమైన సమస్యలను కూడా ప్రక్కకునెట్టి, యిల్లంటే నందనవనమని, అందులో అమ్మా, నాన్న దేవతలనీ వారికి భ్రమయినా కలగచేయగలిగిన వారు ధన్యులు.

స్త్రీ పురుషుల సహజీవనం, సాహచర్యం వివాహలక్ష్యాలు. శారీరకమైన ఆకర్షణ, పరస్పర స్పర్శానందం సహజంగానే తరుణవయస్కుల్లో ఉన్నప్పటికీ, వాటిని పరిపోషించుకోవటంకూడా అవసరం. జీవితకాలం కలిసివుందామని నిశ్చయించుకున్నారు కనుక, ఒకరి సాహచర్యాల్ని ఒకరు ఆక్షేపించడం, ఇతరులెవ్వరూ ప్రవేశించలేని ఏకాంత మాధుర్యం కోసం లపించడంకూడా అవసరం. వర్ణనాతీతం, అనుభవైకవేద్యం అయిన ఒక బంధం వారిని పెనవేసినప్పుడు సృష్టిలో భర్త ఒక్కడే ఆమెకు పురుషుడు, ప్రకృతిలో భార్య ఒక్కతే అతనికి స్త్రీ. ఇతరులంతా భాతృసమానులే, మాతృసదృశలే.

పురుషుడికీ, స్త్రీకికూడా సంసారంతోపాటుగా అతిముఖ్యమైన అంశం తమతమ ఉద్యోగాలు, వ్యాపకాలు. ధర్మనిర్వహణకు, ఇటు గృహకర్తవ్య నిర్వహణకు సమానమైన తూకం ఇవ్వగలగాలి స్త్రీ, పురుషుడు. నాకంటే మీకు ఆఫీసుమిన్న అనిగాని, నాకంటే నీకు ఉద్యోగం ఎక్కువ అనిగాని సాధించుకునే సందర్భాలు అతి కొద్ది మోతాదులో వుండాలి. పెద్దచదువులు చదివి, సాహిత్య, కళారంగాల్లో పెద్ద పేరుతెచ్చుకున్న సందర్భాల్లో కూడా వృత్తివేరు, దాంపత్యంవేరు — రెంటికీ సమానంగా అంకితం కావాలనే తపనవుండాలి. అది లోపించిన నాడు దాంపత్యం విచ్ఛిన్నమవుతుంది.

ఆదర్శమైన, వాంఛనీయమైన దాంపత్యానికి ఎన్ని అత్యవసర అంశాలున్నాయో అవన్నీ చెప్పుకున్నాము. ఎన్ని బాహ్య విషయాలు దీనికి అవరోధాలు కలిగిస్తాయోకూడా ప్రస్తావించుకున్నాము. ఇవికాక, కులగోత్రాలు, మతం, అంతస్తు, భాష మొదలైన విభేదాలతోనే ఆరంభమైన సంసారం మరింత కంటక మార్గంలో ప్రయాణం చెయ్యాలి. అది ఓటిపడవే ఆయినా గట్టిపరచే అదనపు బాధ్యత భార్యాభర్తల మీదవుంది.

సంసారం ఎటులాగినా, ఎటుసర్దినా సాగదనే నిశ్చయానికి వస్తారు మొదట దంపతులు. వివాహం వ్యక్తిగత విషయం, నిజమే. కానీ అది సామాజిక విషయం. సమాజంలోని యితరుల జీవితాలను ప్రభావితం చెయ్యగల విషయం. పిల్లలు కలిగిన తర్వాత బాధ్యతకు సంబంధించిన విషయం. ఎవరెటుపోయినా ఫరవాలేదు నా సుఖం ముఖ్యం అనుకోవడం

పరమ క్షుద్రమైన స్వార్థం క్రిందకు వస్తుంది. దుర్భర పరిస్థితులలో వివాహ జీవితం కొనసాగదని తెలిసినప్పుడు చట్టరీత్యా తెగతెంపులు చేసుకోవడం తప్పనిసరే. కానీ భార్యకు పునర్వివాహం, పిల్లలకు సుఖమైన భవిష్యత్తు ఎంతవరకు సమకూడుతాయన్నది యిప్పటికి పెద్దప్రశ్న. నాగరికత పెరిగినా యీ సమస్యకు పరిష్కారంలేదు. బిడ్డల్ని కడుపులో పెట్టుకొని దాచుకోవలసింది తల్లేనని అనేక వందల జీవితాలు నిరూపిస్తున్నాయి ప్రత్యక్షంగా.

కళాశాల విద్యలో వైవాహిక జీవితానికి సంబంధించిన ప్రాథమిక లక్ష్యాలు నేర్పడంకూడా అవసరం. యువతీ యువకులు యీ విషయాలు చర్చించే సాహసం వుండాలి. ఇది సెక్సు విద్యకాదు. సంసార సమస్యల పరిశీలన, చర్చ, భావిజీవితంలో ఎదుర్కొనవలసిన పరిస్థితులతో పరిచయం అని గ్రహించాలి.

పెద్దలుకూడా తమ తరం, తమ జీవితం పూర్తయిపని, పిన్నలు అనుభవాలను ఎదుర్కొనేందుకు తరుణం వచ్చింది కనుక, వారి విషయాల్లో కలగజేసుకోకూడదని గుర్తించాలి.

---

"మానవులు చేసుకోగల ఒప్పందాలన్నింటిలో వివాహం చాలా ప్రాముఖ్యత కలది"

— ఇంగర్ సాల్

"ప్రేమ కళకు తల్లి; కవులనూ, దేశభక్తులనూ, తత్వవేత్తలను ఉత్తేజపరిచేది."

— ఇంగర్ సాల్

"సంకుచిత మనస్కులూ, ఇంకా ఆ బాపతు జనం ప్రేమను ఉదాత్తమైన ఉద్రేకవిషయంగా పరిగణించక విధ్యుక్త ధర్మంగా చిత్రించుకొని 'స్వార్థత్యాగానికి' ఒడిగడుతున్నారు; సర్వోత్కృష్టమైన ఆనందాన్ని కాలదన్నుకుంటున్నారు."

— ఇంగర్ సాల్

# వరకట్నం – సామాజిక పరిశీలన

— డా॥ కె. మురళీ మనోహర్
ఎ. శోభ

వివాహమనేది ఒక సామాజిక క్రియ. వివాహానికి సంబంధించి జీవిత భాగస్వామిని ఎంచుకోవడంలో పురుషునికున్న స్వేచ్ఛ స్త్రీకిలేదు. పైగా వరకట్నమనే సాంఘిక దురాచారంలో సంతలో పశువులనుకొన్నట్లు యువకులను కొనడం, కొనలేని ఆడవాళ్ళు ఏళ్ళ తరబడి అవివాహితలుగా మిగిలిపోవడం సర్వసాధారణమైంది.

వరకట్నమంటే ఏమిటి ? అసలు ఈ వరకట్న సమస్యకు మూలం ఏమిటి ? అది ఎప్పుడు మొదలయింది ? ఏ విధంగా పునాదులు వేసుకొని జీవితాలకు సమాధి కడుతొంది అని ఆలోచిస్తే ఈ సమస్యకు తరిష్కారం లభ్యమవుతుంది.

వరకట్నమనగా వివాహ సమయమందు నగదు రూపంలో గాని, వస్తురూపంలోదాని లేదా రెండూగాని వరుడికి వధువు తల్లిదండ్రులు అందించే 'కట్నం' లేదా బహుమానం లేదా లాంఛనం.

వరకట్నమనేది తల్లిదండ్రుల శక్త్యానుసారం ఇచ్చేటట్లయితే అది వరుడికి వాళ్ళతరఫు బంధువులకు ఆమోదయోగ్య మవుతుందా, అసలు ఆడపిల్లలను బరువుగా భావించడంవల్ల తల్లిదండ్రుల దగ్గరనుంచి అమ్మాయిని స్వీకరించినప్పుడు కట్నం అవసరమవుతుందా — అనేది ఆలోచించవలసిన అంశం. కాని ఈ రకమైన ఆలోచన కొనసాగినంతకాలం వరకట్న నిషేధానికిచేసే ప్రయత్నాలన్నీ కూడా నిష్ప్రయోజన మవుతాయి. 'స్త్రీని పనికిరానిదిగా' పరిగణించడం ఆమె వివాహానంతరం పుట్టింటినుండి తనతో తీసుకువచ్చే సామగ్రినే విలువైనదిగా భావించడం — అలా తేలేని వారు, ఒప్పుకొన్న వస్తువులను సకాలంలో చెల్లింపలేని స్త్రీలు వరకట్న దురంతాల కోరలలో నలిగి నశించిపోతున్నారు.

వరకట్న దురాచారం కొనసాగటానికి అనేక కారణాలున్నాయి. అందులో ఆర్థిక కారణంతోపాటు ప్రధానంగా సాంస్కృతిక కారణం కూడా ముడివడియుంది. ఒక అబ్బాయి వరకట్న వ్యతిరేకి అయినప్పటికీకూడా అమ్మాయి తల్లిదండ్రుల ప్రోత్సాహం వలన, బలవంతం వలన 'కన్యాదాన' సమయంలో అబ్బాయికి ఏదో రూపంలో కొంత ముట్టచెప్పడం జరుగుతుంది. దీనికి కారణం వరకట్నం ఇవ్వకుండా పెళ్ళిచేస్తే వారి హోదా తరిగిపోతుందేమోననే భయం, సమాజంలో చిన్నచూపు చూడబడతామోనన్న అనుమానం వరకట్నం దురాచారంగా ప్రబలడానికి కారణమైంది. ప్రేమ పూర్వకంగా ఇచ్చిన బహుమానం క్రమేణా శక్తికిమించి ఇస్తే తప్ప అమ్మాయి వివాహంకాదు అనేంతవరకు సాగి, అతిముఖ్యమైన సామాజిక సమస్యగా పరిణమించింది. పైగా వరుడి తల్లిదండ్రులు తమ కొడుకు 'పనికిరానివాడు కాడు' కాబట్టి ఎక్కువ వరకట్నాన్ని కోరడంకూడా వరకట్న సమస్యను మరింత తీవ్రతరం చేసింది. పురుషుడి ఉద్యోగ హోదానుబట్టి, సంపాదననుబట్టి వరకట్నపు రేట్లు పెరిగిపోతున్నాయి. వరకట్నం ఇలా కొనసాగడానికి కొంతవరకు ఆడపిల్లలుకూడా బాధ్యులవుతారు. మధ్యతరగతి లేదా క్రింది మధ్యతరగతి కుటుంబంలోకి భార్యగా వెళ్ళిన స్త్రీ అత్తవారి పేదరికాన్ని భరించలేక అలాంటి సంబంధంచేసిన తల్లిదండ్రులను తూలనాడటం వల్లకూడా తల తాకట్టుపెట్టయినా తల్లిదండ్రులు కూతురికి ఘనంగా కట్నమిచ్చి అయినింటి సంబంధాలు చూస్తున్నారు. అటువంటప్పుడు కట్నం తీసుకొన్న భర్త అంతరంగాన్ని అర్థంచేసుకోలేక, అతడిని అసమర్థుడుగా పరిగణిస్తూ, తల్లిదండ్రుల నిందిస్తూ మరికొందరు స్త్రీలు జీవితాలను చేజేతులా నరకప్రాయం చేసుకోవటం వల్లకూడా ఈ వరకట్నం ఒక సమస్య అయింది. కాగా ఇంకోరకపు పెళ్ళి కొడుకులు వివాహసమయమందు 'అతి మంచివాడ' ని పించుకొని వివాహానంతరం కోరే గొంతెమ్మ కోరికలను తీర్చలేక ఆడపిల్లలను కన్న తల్లిదండ్రులు నలిగిపోతున్నారు. ఆడపడుచుల లాంఛనాలను చెల్లించలేక, భర్తల, కోరికలను తీర్చలేక, అత్తగారి వాగ్బాణాలను ఎదుర్కోలేకనే ఎంతోమంది ఆడపిల్లలు తమ జీవితాలను అంతం చేసుకోవడం, అత్త, భర్తలచే హత్యగావింపబడటం మనం నిత్యజీవితంలో చూస్తూనే ఉన్నాము.

సాంప్రదాయికమయిన మన సమాజంలో వేళ్ళూనుకుపోయిన ఈ సమస్య అనేక క్రొత్త సమస్యలకుకూడా దారితీస్తుంది. వరుడు, వరుడి తల్లిదండ్రులు వివాహ సమయమందు కోరే విపరీతమయిన కోరికలకు అసలు కారణం స్త్రీలపట్ల వారికిగల చులకనభావం, వారు నిర్వహించే గృహ కృత్యాలకు విలువకట్టకపోవడం వలన అనేది సుస్పష్టం. సాంప్రదాయికంగా కూడా చూచినట్లయితే వివాహ సమయమందు కుమార్తెకిచ్చే లాంఛనాలు ఏదో రూపంలో, ఎంతోకొంత చెల్లించవలసి రావడం వలన ఆడపిల్లలు తల్లిదండ్రులకు గుండెలమీద కుంపటి అయినారు. దానివల్ల అమ్మాయి కుటుంబసభ్యులంతాకూడా తమ చిన్నచిన్న కోర్కెలను సైతం త్యాగంచేసి ఎదిగిన తోబుట్టువు పెళ్ళికి శక్త్యానుసారం తోడ్పడటం అనేదికూడా చాలా మామూలయింది.

ఈ రకంగా వరకట్నం కొనసాగటానికి మూలకారణం స్త్రీలు నిర్వహించే గృహ కార్యకలాపాలకు ఎటువంటి ఆర్థికవిలువ లేకపోవడం — వివాహం వలన కుటుంబంలోకి క్రొత్తగా అడుగుపెట్టిన కోడలిని అదనపు బరువుగా, ఏం పనిలేక ఊరికే తినికూర్చునేదిగా భావించడం వలన స్త్రీల పుట్టుక భారమైంది. పైగా తమపట్ల కనీస గౌరవాదరాలు కలిగి యుండటానికి అసలు కారణం ఆమె "వంశోద్ధారకుడి" ని కనిఇస్తుందనే భావమే. అలా ఇవ్వలేని స్త్రీ, కూతుళ్ళనుకన్న స్త్రీ బాధలు చెప్పనలవికావు. దానికంతకూ ఆమే కారణమయినట్లు అందరూ ఆమెను నిందించడంకూడా అతి మామూలయిపోయింది ఈ సమాజంలో. అలాంటి సందర్భాల్లో 'వంశోద్ధారకుడి' ని కనడం కోసం కొడుకులను మళ్ళీ మార్కెట్లో పెట్టి మరో కన్నెపిల్ల మెడలో ఉరిత్రాడువేసి ఆమె అలా కనలేనినాడు ఆమె జీవితంకూడా నరకప్రాయం చేయటానికి వెనుకాడని వ్యక్తులున్న సంఘమిది.

అందువల్ల ఎంతో అనర్థదాయకమై, ఆనందాన్ని, జీవితాలను హరిస్తున్న ఈ దురాచారం "కన్యాశుల్కం", "వరకట్నం" రూపంలో ఎప్పుడు వచ్చాయో తెలుసుకోవడం ఎంతైనా అవసరం. అందుకు గత చరిత్రయే మనకు ఆధారమవుతుంది. ప్రాచీన కాలంనాటి కుటుంబ చరిత్ర

పరిశీలిస్తే వివాహబంధం పరిధి అంతకంతకూ సంకుచిత మవుతూవచ్చింది. రక్తసంబంధీకుల కుటుంబం[1]లోను, పునాలువీన్ కుటుంబం[2]లోను అమలులో ఉన్న కుటుంబ పద్ధతులలో మగవాడికి ఆడవాళ్ళ కొరత ఎన్నడూలేదు. పైపెచ్చు చాలా ఎక్కువగా లభిస్తుండేవారు. జంటపెళ్ళి కుటుంబవ్యవస్థ అమలులో కొచ్చేనాటికి ఆడవాళ్ళు కరువయ్యారు. వాళ్ళకోసం వెతుకులాడ వలసి వచ్చింది. ఫలితంగా జంటపెళ్ళి[3] తో పాటు ఆడపిల్లల్ని ఎత్తుకొచ్చి పెళ్ళిచేసుకోవడం. డబ్బుఇచ్చి కొనుక్కోవడంవంటిపద్ధతులు వ్యాప్తిలోకి వచ్చాయి.ఇప్పటి వరకట్నం దురాచారం వంటివి ఆ వ్యవస్థ గుర్తులేకాని మరేమికావు. భార్యల్ని సంపాదించడంలో అవలంబించిన పద్ధతుల్ని మాక్ లెన్నాన్ ప్రత్యేకతరగతి వివాహపద్ధతులని ఊహించాడు — "రాక్షస వివాహం", "కన్యాశుల్కం" వివాహం వాటి ప్రకారం ప్రత్యేక కుటుంబ తరగతులయ్యాయి.

---

1. రక్తసంబంధీకులు :- ఇది కుటుంబవ్యవస్థ ప్రప్రథమదశ. ఇందులో వివాహబంధంలో కలిగే గుంపులు వారివారి తరాల్నిబట్టి విభజితం అవుతాయి. ఒక కుటుంబంలోని తాతలు, అవ్వలు ఒకరికొకరు భార్యాభర్తలు. వీరి సంతానం అయిన స్త్రీ పురుషులు ఒకరికొకరు భార్యాభర్తలు. అలాగే వీరిబిడ్డలు అంటే మొదటితరం వారి మనుమలూ, మనుమరాండ్రు (మూడోతరం) ఒకరికొకరు భార్యాభర్తలు — అలాగే మునిమనుమలూ మనుమరాండ్రూ నాలుగవ బృందం. ఈ మాదిరి వివాహాలలో ఒకటి రెండు తరాలవారు, రెండూ మూడు తరాలవారు వివాహ సంబంధం కలిగియుండ కూడదు.

2. పునాలువీన్ కుటుంబం :- తల్లిదండ్రులకి సంతానానికి మధ్య లైంగిక సంబంధాల నిషేధం కుటుంబనిర్మాణంలో వచ్చిన మొదటి మెట్టుకాగా, తర్వాత వచ్చిన సోదరీమణులమధ్య లైంగిక సంబంధాల నిషేధం రెండో మెట్టు.

3. జంటపెళ్ళి :- జంటపెళ్ళి రూపంలో యే ఇద్దరు వ్యక్తులమధ్యనో దాంపత్య సంబంధంవుండే స్థితి ఏర్పడుతుంది. ఈ దశలో మగవాడు ఒకే ఆడదానితో జీవిస్తాడు. బహు భార్యాత్వము — ఇతర స్త్రీలతో పొందు మగవాళ్ళ ప్రత్యేకహక్కు అయినప్పటికీ అసంఖ్యాకంగా వుండే భార్యలలో ఒకామె మగవానికి ముఖ్యభార్యగా వుండేది.

మధ్యయుగాల ఆఖరువరకు వివాహానికి సంబంధించి వధూవరుల సమ్మతికి ప్రాముఖ్యంలేదు. ప్రారంభంలో మనుష్యుడు వివాహితుడుగానే పుట్టేవాడు పుట్టుకతోనే పురుషుల గుంపుకంతకూ ప్రతి స్త్రీ భార్య — అలాగే స్త్రీల గుంపుకంతకూ ప్రతి పురుషుడూ భర్త. ఈ విధమైన గుంపు పెళ్ళిలో అనేక మార్పులువచ్చి కొత్తరూపాలు ఏర్పడ్డాయి. గుంపులు పరిమిత మవుతూ వచ్చాయి. జంటపెళ్ళిళ్ళలో మామూలుగా తల్లులు తమ బిడ్డలకు సంబంధాలు కుదిర్చేవారు. ఆ దంపతులకు గుణంలోను, తెగలోను బలీయ మైన స్థానం ఏర్పడేటట్లుచూసి సంబంధాలు కుదిర్చేవారు. క్రమంగా ఉమ్మడి ఆస్తికన్నా సొంతఆస్తికి ప్రాముఖ్యత లభించింది. తన బిడ్డలకే ఆస్తి సంక్రమింప జేయాలన్న ఆమర్దా ఏర్పడింది. తండ్రిహక్కు, దాంపత్య వివాహం ప్రాముఖ్యానికి వచ్చాయి. దానితో అంతకు ముందెప్పటికన్నా ఇంకా ఎక్కువగా ఆర్థిక విషయాలమీదనే ఆధారపడి వివాహం జరిగేది 'శుల్కం' ఇచ్చి కన్యను కొనుక్కొనే పద్ధతి అంతరించింది. ఆడదానికి కాక మగవాడికికూడా విలువకట్టడం అమల్లోకి వచ్చింది. విలువ అతని గుణగణాలకు, వ్యక్తిత్వానికి కాక అతనికున్న ఆస్తినిబట్టి వచ్చింది. వధూ వరులమధ్య పరస్పరప్రేమే వివాహానికి మూలంకావాలని పాలకవర్గీయులు ఎన్నడూ వూహించి యుండరు.

పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో వ్యాపారం, వస్తూత్పత్తులద్వారా ప్రపంచాధిపత్యం సంపాదించేటందుకు ప్రయత్నాలు ఆరంభించిన నాటి పరిస్థితులవి. ఉత్పత్తి విధానం ప్రతి ఒక్కదాన్ని మారకపు సరుకుగా మార్చేసింది. అనుశ్రితంగా వస్తున్న ఆచారాలను — చారిత్రకంగా లభించిన హక్కులు తుడిచేశాయి. స్వేచ్ఛాయుత ఒప్పందాన్ని తెచ్చి పెట్టాయి. వివాహంకూడా ఇలాంటి ఒక ఒప్పందమయింది. దాంపత్య సంబంధాలు, మగవాని పెత్తనం, వివాహం రద్దుచేయు వీలులేనటువంటి పరిస్థితులేర్పడ్డాయి.

వీణాదాసు పాశ్చాత్య సమాజంలో అధికారం ప్రధానంగా తండ్రి చేతుల్లో ఉంటుందని తెలియజేసింది. ఆ సమాజంలో తండ్రి సాంఘిక అధికారాన్ని కలిగియుంటాడు. భార్యగా, గృహిణిగా స్త్రీకి అధిక ప్రాధాన్యం

ఇస్తారు అక్కడ. కుటుంబం కేవలం వినియోగదారు స్థాయికి దిగజారి పోవడంలో తండ్రి సంపాదన అతని అధికార చిహ్నంగా మారుతుంది. ఎందుకంటే కుటుంబపు జీవనస్థాయి డబ్బుపై ఆధారపడియుంటుంది. కనుక అలాంటి వ్యవస్థలో పిల్లలపైన, తమపైన కుటుంబ యజమాని అధికారాన్ని బలపరచడంలో స్త్రీలు సహకరిస్తారు.

కాని సుధీర్ కక్కర్, ఆషిస్‌నంది వంటి మనస్తత్వ శాస్త్రవేత్తలు తమ పరిశోధనల ఆధారంగా భారతీయ కుటుంబాలలో అధికారం తండ్రి చేతుల్లోకాక తల్లిచేతుల్లో ఉంటుందని సూచించారు. భారతీయ కుటుంబంలో ప్రముఖపాత్ర వహించేది భార్యాభర్తలు కాదు — తల్లీ బిడ్డలే. వివాహం బంధంతో సంతృప్తి చెందని స్త్రీ కుమారునిపై విపరీతమైన అభిమానం, మమకారం పెంచుకోవడం ద్వారా ఆ కొరత తీర్చుకుంటుంది. పైగా ఎదిగిన కుమారులపై ఆ పెత్తనం వదులుకోలేక కోడళ్ళపై కూడా అధికారం చెలాయిస్తూ వరకట్నం సరిగా చెల్లించని స్త్రీలను నానా బాధలకు గురి చేయడంకూడా చాలా సాధారణమైంది. పైగా వరకట్నంవల్ల సంభవించే మరణాల వార్తలను పరిశీలిస్తే తల్లి కుమారుడు కలిసి కొత్త పెళ్ళికూతురిపై కుట్రపన్నినట్లు స్పష్టమవుతుంది. పెద్దలదురాశ ఈ మరణాలకు కారణమనేది బాహ్య దృష్టికాగా భార్యాభర్తల వివాహబంధానికి, తల్లీబిడ్డల అనుబంధానికి మధ్య జరిగే ఘర్షణలో తల్లీ బిడ్డల అనుబంధం ప్రాబల్యం వహించి, ఆ ప్రాబల్యం నవవధువుల దారుణ హత్యలకు దారితీస్తుంది.

వరకట్నపు దురాచారానికి బలి చేయబడుతున్న నిర్భాగ్యురాళ్ళ సంఖ్య రోజురోజుకి పెరిగిపోతుంది. తెచ్చిన కట్నం చాలలేదనో, ఇచ్చిన లాంఛనాలు సరిపోలేదనో వేధించి, పుట్టింటి దగ్గరినుండి మరింతడబ్బు తెమ్మంటూ మానసికంగా, శారీరకంగా స్త్రీలను చిత్రహింసలు పెట్టడం, అలా తేలేని స్త్రీని హత్యచేయడం — ఆ హత్యను ఆత్మహత్యగా తీర్చిదిద్దడం ఆ విధంగా ఒక స్త్రీని అంతంచేసి మరో స్త్రీని కట్టుకోవడం ఈ పురుషాధిక్య సమాజంలో దాదాపు మామూలయిపోయింది. ఈ దురాచారంవలన భార్యాభర్తల సంబంధాలు సైతం 'వ్యాపారమయమై' భార్యలను కొట్టడం, వదలివేయడం, విడాకులు తీసుకోవడం వంటి విషయాలు ప్రధానంగా మధ్య, క్రింది మధ్యతరగతి కుటుంబాలలో చాలా మామూలయిపోయాయి.

స్త్రీలకు సరియైన రక్షణ లేకపోవడం వలన స్త్రీలపై అత్యాచారాలు విపరీతంగా పెరిగిపోతున్నాయి. 1981 లో మొదటి 3 నెలల్లో లక్నోలో 32 మంది వరకట్నానికి ఆహుతి అయినారు. ఢిల్లీలో 1980 లో వరకట్నానికి ఆహుతైన కేసులు 394 కాగా దేశంలో 500 కాగా, కట్నాలు తీసుకురానందుకు భర్తలు భార్యలను చంపివేసిన ఉదంతాలు మరిన్నో ఉన్నాయి. 1975 లో అటువంటివి 670 కేసులుంటే 1979 లో 1676 కు పెరిగినట్లు అధికార లెక్కలు సూచిస్తున్నాయి. కొత్తగా పెళ్ళయిన యువతులు, వరకట్న సమస్య వలన ఆహుతైన వారిసంఖ్య 1977 లో 12 మంది ఉంటే 1980 లో 22 మంది ఉన్నారు. ఈ కేసులన్నికూడా ఎవరో రిపోర్టుచేయుగా వచ్చినటువంటివే. ఇందులో 1676 కేసుల్లోను 744 ఉత్తర ప్రదేశ్‌లోను 562 మహారాష్ట్ర నుండి రిపోర్టుచేయబడినది. 249 ఆంధ్రనుండి 148 ఢిల్లీ నుండి, 98 రాజస్థాన్ నుండి 48 పశ్చిమ బెంగాల్ నుండి, 2 తమిళనాడు నుండి, 2 కర్నాటక నుండి రిపోర్టు చేయబడినవి. కేరళ నుండి ఒక్కటి కూడా రిపోర్టు చేయబడలేదు.

మహిళా దశాబ్దాలుతున్న రోజుల్లోకూడా ఆడకూతుళ్ళ జీవితాలకు ఏ మాత్రం భరోసాలేదు. స్త్రీలపై జరిగే అత్యాచారాలు అంతకంతకూ పెరిగిపోతున్నాయి. వాటిని రిపోర్టుచేయుని పత్రికలంటూలేవు.

ఆంధ్రప్రదేశ్‌ను కదిలించిన పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వూరుకు 13 కిలోమీటర్ల దూరంలో ధర్మవరం గ్రామంలో ఒళ్ళు కాలిన ఫలితంగా మరణించినకేసు కందుల కోటి నాగమణి. ఈ కేసు సందర్భంగా మహారాష్ట్రకు చెందిన సంఘసేవిక సీమానజారే ఈ కేసును స్వయంగా పరిశీలించి కందుల నాగమణిని ఆమె అత్త, భర్త కలిసి కిరోసిన్‌పోసి హత్యచేశారు అని నిర్ధారించారు. కట్నానికి సంబంధించి నాగమణిని వేధించి, వేధించి చివరకు ఈ హత్యకు ఒడిగట్టారు అని ఆమె తీర్మానించారు. హైదరాబాదుకు చెందిన మేఘమాల టాంక్ బండ్‌పై నుండి హుస్సేన్ సాగర్‌లోకిదూకి ఆత్మహత్య చేసుకోవటానికి కారణం ఆమెభర్త అత్తగార్ల వేధింపు చర్యలే. పుట్టింటి నుండి వస్తువులు తీసుకురమ్మని వేధించిన కారణంగానే నానా బాధలుపడ్డ మేఘమాల విధిలేక చివరకు ఆత్మాహుతి చేసుకుంది. తిరుపతిలో సైకాలజి లెక్చరర్ అయిన భారతి ఆత్మహత్యకు కారణం భర్త మరో అమ్మాయితో

కులుకుతూ భార్యను చిత్రహింసలు పెట్టడమే. కట్నంచాలని కారణంగానే రావిపాడు గ్రామానికి చెందిన లక్ష్మి, భీమవరంలో వెంకట ధనలక్ష్మి, మార్కాపురంలో సూర్యలక్ష్మి, సికిందాబాదులో శాంతకుమారి, విజయ, భాగ్యలక్ష్మి, విజయవాడకు చెందిన సువర్ణమేరి, హేమలత భర్త, లేదా అత్తగార్లచేత హత్య గావింపబడ్డారు. బెంగుళూరుకు చెందిన ఫిల్లిస్, కౌసల్య, శంషాద్ బేగం, కోకిల కూడా ఆ కోవకు చెందినవారే. ఇలా చెప్పుకుపోతుంటే సగటుగా రోజూ ఎక్కడో ఈ సమయానికి మరో మహిళ అఘాయిత్యానికి గురవుతుంది.

నేరస్థులను గట్టిగా శిక్షించడంద్వారా స్త్రీల మాన ప్రాణాలను దోచే వారిని కొంతవరకు శిక్షించవచ్చునేమో కాని, పురుషులు బాధ్యతాయుతమైన జీవితంలో భార్యలపట్ల అనురాగవంతులై వైవాహిక జీవితంలో ఉన్న ఆనందాన్ని గుర్తించడంద్వారా, తల్లులు ఎదిగిన తమ మగబిడ్డలపై అధికారాన్ని వదులుకొని కుమారులను స్నేహితులుగా గౌరవించడం ద్వారాను, తమ వైవాహిక బంధాన్ని దృఢతరం చేసుకోవడం ద్వారా మాత్రమే కొంతవరకు జీవితాన్ని సుఖమయంచేసుకొని, వరకట్న సమస్యను కొంతవరకు అరికట్టవచ్చు.

కాని వివాహంలో పూర్తి స్వేచ్ఛ వుండాలంటే పెట్టుబడిదారి ఉత్పత్తి విధానమూ, దాని ఫలితంగా ఏర్పడిన ఆస్తి సంబంధాలు రద్దయిపోవాలి. అప్పుడే భార్యాభర్తల ఎన్నికల విషయంలో ఆర్థిక విషయాలకు ప్రాముఖ్యత ఇవ్వడం తొలగుతుంది — అప్పుడు పరస్పర ఆకర్షణతప్ప వివాహనికి మరేమి కారణం కాదు. అంతేకాని తాత్కాలికంగాచేసే చట్టాలద్వారా, సమస్యకు పూర్తి పరిష్కారం లభించదు. చట్టాలలోఉండే లొసుగులు ఈ సమస్యను తీవ్రతరం చేస్తాయేతప్ప పరిష్కారానికి ఉపయోగపడవు.

అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా కేంద్ర ప్రభుత్వంచే ఏర్పాటయిన స్త్రీల హోదాకు సంబంధించిన కమిటి తన నివేదికలో వరకట్న నిషేధచట్టం విజయవంతం కాలేకపోవడానికి తగు కారణాలను వివరించింది.

1) వరకట్నం ఇవ్వడం పుచ్చుకోవడం విషయంలో కోర్టు స్వయంగా జోక్యం కలిగించుకోలేదు కనుక బాధితుడుగాని, అమ్మాయిగాని లేదా ఆమె

సన్నిహిత బంధువులుగాని కోర్టుకు వెళ్ళాలి. కాని అలా చేయడానికి కట్నం ఇవ్వడానికి సిద్ధంగా ఉన్న వాళ్ళెవరూ కోర్టుకు వెళ్ళడానికి ఇష్టపడరు.

2) పైగా ఈ చట్టము తల్లిదండ్రులు, అత్తమామలు వధూవరులకిచ్చే "బహుమానాల" ను వస్తు రూపంలో అంగీకరిస్తుంది.

అందువల్లనే ఈ నివేదిక వరకట్నమివ్వటమనేదే నేరంగా కోర్టు గుర్తించాలని, బహుమానాలు 500 రూపాయల పరిధిలో మాత్రమే ఉండాలనిన్నీ సిఫారసు చేసింది.

ఏది ఏమయినప్పటికి సంయుక్త సంఘమేమో ఈ క్రింది సిఫారసులను సూచించింది.

1) వరకట్న మివ్వటమే కోర్టు గుర్తించాలి, కాని కావాలని తీసుకోవటం మాత్రమే తప్పు కాకూడదు.

2) వరకట్నం తీసుకున్నా లేక డిమాండు చేసినా 6 నెలల నుండి 2 సంవత్సరాల వరకు శిక్ష విధించాలి.

3) వరకట్నానికి సంబంధించిన ఫిర్యాదులు చేయడానికి ఎటువంటి నియమ నిబంధనలు ఉండనవసరంలేదు.

4) వరకట్న నిషేధ చట్టమును గురించి మాట్లాడుతూ కమిటీ బహుమానాలకు సంబంధించి చేసిన సీలింగు వార్షిక ఆదాయములో 20 శాతము గాని లేదా 15,000 రూపాయలు గాని ఏది తక్కువైతే దానిని పరిగణించాలని సూచించింది. అదే విధంగా వరునకుఇచ్చే బహుమానాల విలువ 3 శాతం ఆదాయంగాని, 2,000 రూపాయలకు మించిగాని లేదా ఏది తక్కువైతే దానిని దాటరాదని, వివాహానికి అయ్యే ఖర్చు 7 శాతము ఆదాయంగాని, 3,000 రూపాయలుగాని మించకూడదని లేదా అందులో ఏది తక్కువైతే దానిని పాటించాలని సూచించింది. పైగా అనుమానాస్పద పరిస్థితులలో కమక అమ్మాయి మరణించినట్లయితే వరునకు ఇచ్చిన బహుమానాలను వధువు తల్లిదండ్రులకు తిరిగి పంపించవలసి యుంటుంది అనికూడా తెలియజేసింది.

వరకట్న నిషేధచట్టము రూపొందించిన నియమ నిబంధనలకన్నా, నిషేధాలకన్నా, సంయుక్త కమిటీ సూచించిన సిఫారసులు ఎక్కువ ఉదారంగా ఉండటానికి కారణాన్ని వివరిస్తూ ఈ కమిటీ ఇవి తల్లిదండ్రుల శక్తికి మించకుండా, సమాజానికికూడా ఆమోదయోగ్యమైనవన్న విషయాన్ని తెలియపరిచింది.

కాని మన సమాజంలో అనేక కుటుంబాలు కేవలం వారి ఆదాయం పైననే చాలీచాలని జీతాలతో జీవచ్ఛవాలలా బ్రతుకుతున్నప్పుడు వాళ్ళ ఆదాయంలో 30 శాతాన్ని కుమార్తె వివాహంపై ఖర్చు పెట్టడమనేది చాలా కష్టసాధ్యమైనపని. పైగా ఒకరికంటే ఎక్కువమంది కూతుళ్ళను కన్న తల్లిదండ్రులకు ఇది తలకు మించిన భారమవుతుంది. పైగా మరో కోణంలో నుండి పరిశీలించినా సమాజంలో కొన్ని కుటుంబాల 30 శాతం ఆదాయం కొన్నివేలు, లక్షలూ దాటవచ్చుకూడా. అలాంటప్పుడు ఉన్నవాళ్ళు ఇస్తూపోతే, లేనివాళ్ళు ఇవ్వలేకపోతారు. వారి కుమార్తెలు అవివాహితలు గానే మిగిలిపోవడమో, లేదా వారి తల్లిదండ్రులు శక్తికిమించి కట్నాలిచ్చి కుమార్తెల వివాహాలుచేసి అప్పుల్లో మునిగిపోవడమో జరుగుతుంది. అందువల్లనే వరకట్నమనేది ఉండాలా వద్దా అనేది మౌలికమైన సమస్యే వరకట్న నిషేధచట్టాలెన్ని చేసినా సమస్య ఎప్పటిలాగానే అపరిష్కృతంగా మిగిలిపోయిందే తప్ప పరిష్కారం సాధించలేకపోయింది. పురుషుడు స్త్రీని 'పనికిరానిదిగా', 'భారమైనది' గా భావించి నంతకాలం, ఆమె సమాజంలో అత్యాచారాలను, అవమానాలను ఎదుర్కొంటూనే ఉంటుంది. పైన పేర్కొన్న కమిటీల సిఫారసులను ఆమోదించినా ఇది బలహీనంగానే ఉంటుంది తప్ప ఫలితమేమి సాధించడమంటూ ఉండదు.

వరకట్నం సాంఘిక దురాచారంగాను, ఘోరమైన అనాచారంగాను పరిగణింపబడటం వలన అందుకు సంబంధించి, వధువు హత్యలకు, దుర్మారణాలకు సంబంధించి వేలుగులోకివచ్చి హంతకులు మరణశిక్షకు గురి కావలవియుంటుందనేది ఇటీవలనే సుప్రీం కోర్టు స్పష్టంచేసింది. మూడు సంవత్సరాల క్రితం ఏర్పాటయిన సుప్రీం కోర్టు రాజ్యాంగ ధర్మాసనం

ఏరకమైన నేరాలకు మరణశిక్ష విధించవచ్చో నిర్ధారించక వదిలివేసింది. కాని ఈ మధ్యనే వరకట్న మరణాలకు కారకులైన వారికి మరణశిక్ష సక్రమైన శిక్షగా ధృవీకరించింది.

వేలకువేలు వరకట్నాలిచ్చినా, అల్లుళ్ళ అలకలను, కోర్కెలను తీరుస్తున్నా వారి కుమార్తెలు మాత్రం అత్తామామలు, భర్తలచే ఇంకా అఘాయిత్యాలకు గురవుతూనే ఉన్నారు, హింసింపబడుతూనే ఉన్నారు. ఎన్ని ఘోరాలుజరుగుతున్నా, ఎంత అపహాస్యం పాలవుతున్నా, జీవితాలు అథాసవుతున్నా స్త్రీలు కష్టాలను సహించడం, భరించడం నేర్చుకొన్నారే గాని ఎదిరించడం నేర్చుకోలేదు. చలం అన్నట్లు తిరుగుబాటు ఆదర్శం. అందుకే స్త్రీలు పురుషులు పోరాటాలు సలిపి సామాజిక లోపాలను సరిదిద్దుకొని స్త్రీ పురుషులు ఒకరినొకరు దోపిడీ చేసుకోనట్టి సామాజిక వ్యవస్థను పునర్నించుకోవలసిన అవసరముంది. అందుకు ఈ మహత్తర కార్య సాధనకు ఎవరోవస్తారని, తోడు నిలుస్తారని ఎదురుచూడటం కన్నా తామే ఉద్యుక్తులై, ఉత్తేజితులై అన్ని రంగాలలో తమతు జరుగుతున్న అన్యాయాలను, అక్రమాలను ఎదుర్కోవడానికి స్త్రీలు సంసిద్ధులు కావాలి. ముందుకు రావాలి. ఈ అసమ సమాజాన్ని నిర్మూలించి, సమసమాజానికి కొత్తబాటలు వేయాలి.



ప్రేమ ప్రతి హృదయానికి మలయ మారుతం ; ప్రతి హృదయానికి కాంతి పుంజం."

— ఇంగర్ సాల్

" వివాహం చాలా గొప్ప వ్యవస్థ ; మరీ ప్రత్యేకంగా పిల్లలకు "

— మార్క్ ట్వెయిను

" నిష్కళంక ప్రేమ అనంతం. దాన్ని మించింది మరొకటిలేదు. వృద్ధుల్లో కనపడినా హృదయాల్లో అది నిత్య నూతనం "

— బాల్‌జాక్

" ప్రేమలేని వివాహమున్నంత కాలమూ
వివాహంలేని ప్రేమ ఉంటుంది "

— ఫ్రాంక్లిన్ (1934)

# వైవాహిక జీవితం: సఖ్యత, సామరస్యం

— మల్లాది సుబ్బమ్మ

వివాహం సామాజిక సహజీవన వ్యవస్థ. అందులో హెచ్చుతగ్గులు లేవు. విల్లూ బాణమూ ఎలాంటి పరస్పరాధేయాలో అలాంటిదే దాంపత్య జీవితం. అలాగే ఎవరిని ఎవరు అధిగమించినా ప్రయోజనం శూన్యం. వ్యక్తిత్వాలను పెంచుకోగల ఇద్దరు ప్రేమతో సమష్టి జీవితం గడపాలంటే ముందుగా ఒకర్ని ఒకరు అర్థం చేసుకోవాలి. ఆ పైన ఆలుమగలుగా అనురాగ బాటలు వేసుకొని ఆ బాటలలో పయనించిన నాడే చక్కని సంసారాన్ని చేరుకోగలరు. "వివాహం అనేది దంపతుల జీవితసమరంలో చివరి అంశం కాదు. జీవన యాత్రకు నాంది ఈ పెళ్ళితోనే ప్రారంభమవుతుంది." కనుక ఈ అలల తాకిడిని తట్టుకోగల విజ్ఞానం, ధైర్యస్థయిర్యాలు ప్రతి వ్యక్తికి చాలా అవసరం.

కష్టసుఖాల కలయికే వివాహ జీవితం. కష్టాలకు అదిరి, సమస్యలకు బెదిరితే వ్యక్తి పిరికివాడవుతాడు. బంధాలలోనే బాధలూ, సౌఖ్యాలూ వుంటాయి. అయితే ఆ భవబంధాన్ని తనకు బానిసగా చేసుకొనే నేర్పు ఓర్పు విజ్ఞులకు వుంటుంది. అజ్ఞానికి అవి నరకతుల్యమయి అతన్ని బంధిస్తాయి. కనుక వైవాహిక జీవితాన్ని ఆనందమయం చేసుకోగల సమర్థత వధూవరులదేనని విశ్వసించాలి,

పెళ్ళి కాగానే తమ సంసారం స్వర్గతుల్య మవుతుందనుకోవడం భ్రమ. దానికై సర్వశక్తులూ వినియోగించి పాటుపడాలి. త్యాగాలు చెయ్యాలి. ఒండొరులు వారి వారి మనస్తత్వాల నర్థంచేసుకోవాలి. సహనం, సామరస్యం,

ఓర్పు, నేర్పు వారిలో చోటుచేసుకోవాలి. ముందుగా తమ తమ పరిస్థితుల నర్థం చేసుకోవాలి. అలాంటి విషయజ్ఞానంకల విజ్ఞత ఇద్దరిలో కలగాలంటే ప్రపంచ జ్ఞానాన్వేషణ జరగాలి.

వివాహం జరిగేవరకూ జరిగినదంతా, ఊహించినదంతా ఒక కల. ఆ కలలో వారి జీవితం అంతా సుఖమయమే కాని ఇప్పుడు ఆ కల కరిగిపోయి కొన్ని బాధ్యతలు ఏర్పడతాయి. ఇంతవరకూ వారు నడిపించబడతారు. ఇప్పుడు ఎవరినీ ఎవరూ నడిపించేది లేదు. ఇద్దరూ నడవగలగాలి. అంటే కొంత నదవగాహన కావాలి. అది అలవరచుకున్నప్పుడు వారి హృదయాలు విడిపోవు. పగిలిన హృదయాలు అతకవు, అతుకులులేని జీవితాలకు అంతా అమృతమయమే. అందినదాన్నే అందంగా మార్చుకొని ఆనందించగల శక్తి ముందుగా దంపతులలో రావాలి. లేకపోతే జీవితంలో ప్రగతి వుండదు. అంతా శూన్యమవుతుంది.

జీవిత భాగస్వాములైన ఒండొరులయెడ కొన్ని నైతిక బాధ్యతలు వుంటాయి. స్నేహరూపంలో నిర్వర్తించాల్సిన జీవితలక్ష్యాలు కూడా లేక పోలేదు. మంచివారు, చెడ్డవారు అనే రెండు రకాల వ్యక్తులు వుంటారు సమాజంలో. స్వతహాగా మంచితనం అందరిలో వుంటుంది. భాగస్వామిలోని మంచిని ప్రోత్సహిస్తే అది ప్రస్ఫుటిస్తుంది. అందుకు ఓర్పు, నేర్పు, స్వార్థత్యాగమూ కావాలి. ఒకరు మనసారా రెండోవారి బాగుకోరితే వారూ వీరి శ్రేయస్సు కోరతారు. అలాంటి ఇచ్చి పుచ్చుకోగల సౌశీల్యం భార్యాభర్తల ఇద్దరిలోనూ వుండాలి. ప్రియులయెడ దూషణరహిత సంభాషణ చాలా ఉత్తమం; అవసరం కూడాను. అలాంటి నాగరికుణ్ణిచూచి అనాగరికుడు సిగ్గుపడతాడు కాని తానెన్నటికీ గర్వపడడు. తన ప్రియుని మేలుకోరిచెప్పే నిజం అప్రియమైనా చెప్పే విధం ప్రియంగావుండాలి. ఒండొరులు ప్రేమించుకోవడం, ప్రేమలో వుండటం ఒకటికాదు. ప్రేమలో వుండటమనేది ఒకస్థితి. ప్రేమించడమనేది ఒక క్రియ. అదే అసలైన ప్రేమ స్వరూపం. ఒండొరులపై సానుభూతి కేవలం మానసికమే కాకుండా నిత్యజీవితంలోకూడా రాణించాలి. ముఖ్యంగా ప్రేయసీ ప్రియులలో అంతరంగాలను అతిక్రమించగల అపూర్వకారణం అన్యోన్య ప్రేమకుంది.

అది నిజమైన అనురాగం గల దంపతులలో మాత్రమే గోచరిస్తుంది. జీవిత భాగస్వామిని తన్నుగా చూడగల ధీశక్తి వున్న సంసారంలో అన్యోన్యతా ఆప్యాయతలకు కొరవవుండదు. ఒకరు రెండోవారి చర్యను అర్థం చేసుకోటానికి ప్రయత్నించాలి. అలాంటి ప్రయత్నమే లేకపోతే జీవితమే వ్యర్థమవుతుంది.

మంచి స్నేహితులుగా భార్యాభర్తలు మనగలగడం జీవిత పరమావధి కావాలి. ఒక్కో సమయంలో స్నేహానికి త్యాగంకూడా గీటురాయి కావచ్చు. అప్పుడు వారు రెండోవారికి త్యాగం చేస్తున్నట్లు భావించరు. నిజమైన స్నేహానికి బాహ్య ప్రకటన అవసరం. అది క్రియారూపంలో మిళితమై వుంటుంది. మిత్రుడు ఏడిపిస్తాడు, శత్రువు నవ్విస్తాడు అనేది ఒక లోకోక్తి. అందువల్లే ప్రియులకు చేదునిజాలు చెప్పక తప్పదు. ఇద్దరు విభిన్న వ్యక్తులమధ్య సంబంధం వారి వ్యక్తిత్వాలను కలిపివేయలేదు. వారివారి ప్రత్యేకతను పెంచుతుంది. అలాంటి స్నేహసంపదను భార్యాభర్తలలో చూచి ప్రజలు గర్వించాలి.

తొలిచూపులోనే ప్రేమపుడుతుంది అని అంటారు కాని అది ప్రేమకాదు, ఆకర్షణ. అది నిత్యం జరిగే సంఘటనే. తొలిచూపులోనే ప్రేమ పుట్టదు. తాత్కాలిక ఆకర్షణ ప్రేమక్రిందికి రాదు. మోహానికి ప్రేమకూ తేడావుంది. ఒక వ్యక్తియొక్క నడకను చూచి, సంభాషణను విని, హాస్యధోరణిని తిలకించి, శారీరక సౌందర్యాన్ని గమనించి మరోవ్యక్తి ఆకర్షణకు లోను కావచ్చు. అది అంతా ప్రేమ అని భావిస్తే జీవితంలో ఎదురుదెబ్బ తినవచ్చు.

ఇద్దరు వ్యక్తులను సన్నిహితం చేసేది ప్రేమ. పరస్పర గౌరవం, అభిమానం, సహనం, సర్దుకుపోవడం, ఒకరికొరకొకరు త్యాగం చెయ్యడం, ఒకరి సంతృప్తికొరకొకరు ప్రయత్నించడం ప్రేమ లక్షణాలు. అది స్త్రీ పురుషుల సన్నిహితత్వాన్ని కోరుతుంది. అది సహజం. ఒకరికి మరొకరు చేరువయ్యాక సెక్సు వారి సంబంధాలలో ప్రవేశిస్తుంది. దాంతో ప్రేమ ఫలిస్తుంది. పుష్పిస్తుంది. సంతృప్తినిస్తుంది.

ప్రేమంటే అవతలి వ్యక్తిని సొంతం చేసుకోవటం కాదు. అవతలి వ్యక్తిలోని మానవతను గ్రహించడమే ప్రేమ లక్షణం. మృదుభాషణాన్ని, నడతను, చిరునవ్వునూ, చూపులను ప్రేమించేది నిజమైన ప్రేమకాదు. పరిస్థితులలో మార్పువస్తే మారేది ప్రేమకాదు. కొన్ని లక్షణాలుపోతే పోయేది ప్రేమ కాదు. అది కాలంతోపాటు మారదు. చిరకాలం వుంటుంది. తుఫానులను తట్టుకుంటుంది. దానికి చలనం లేదు, ప్రేమ వున్నచోట విశ్వాసంకూడా వుంటుంది. ప్రేమ మోహం కంటే ఉన్నతమైనది; శృంగారం కంటే విలువైనది ప్రేమ. దానికి హద్దులు, అవధులు లేవు. శృంగారాన్ని కొలవడానికి సాధనాలుండవచ్చు. కాని ఇది ప్రేమ అని నిర్వచించటానికి ఏ కొలమానమూ లేదు. ప్రేమ అంటే సంతోషంతో జీవించడం, భాగస్వామ్యం గలిగివుండడం. ప్రతి వైవాహిక నౌకకు అది ధృవ నక్షత్రం లాంటిది.

జీవిత భాగస్వామి అభ్యున్నతినికోరే సహృదయమే దాంపత్య జీవితానికి గీటురాయి. ఒకరి పొరపాట్లను ఒకరు సహనంతో సానుభూతితో చూడాలి కాని తొందరపాటువల్ల పరిస్థితులు విషమించవచ్చు. మానవజీవితం అలల లాంటిది. ధైర్యంగా స్థిరచిత్తంతో, దృఢసంకల్పంతో అధిగమిస్తే ఆనందదాయకం అవుతుంది. ఆటుపోట్లకు అదిరిపడితే అవి మనలను తుడిచి పెడతాయి. సంసార నౌకకు ఇద్దరూ చుక్కాని కావాలి కాని, భర్త మాత్రమే కారాదు. అనురాగ సమ్మిశ్రితమైన సాహచర్యం ఒక కళ. అది పరస్పరానుభూతులతో పరిమళించు జీవన గమనం. దంపతుల సంబంధమన్నది ఆలుమగలలోని మానవత్వాన్ని పరిపుష్టం చేస్తుంది. సంకల్ప వికల్ప సమన్వయ సాధనకు ప్రేమా, పట్టుదల, అభిమానం అవసరమవుతాయి. దానికి త్యాగం చాలా అవసరం. అలా అర్థంచేసుకున్న జీవితాలు ఆనందమయ తరంగాలవుతాయి.

ఒకరి గుణాలు మరొకరికి తెలియాలి. ఒకరి జీవితలక్ష్యం, ఆదర్శం ఏమిటో రెండోవారికి తెలియాలి. ఆ లక్ష్యం ఇద్దరికీ ఆసక్తిదాయకమై వుండాలి. ఇద్దరిమధ్య పరస్పర అభిమానం, గౌరవం ఏర్పడాలి. పరస్పర సమ్మతితో ఇద్దరి అభ్యుదయం కోసం కాపురం చేయటానికి ఇష్టపడితేనే అది

వివాహంగా పరిణమిస్తుంది. ప్రతివ్యక్తికీ ఒక ఆలోచనాసరళి, ఒక జీవిత తత్వం వుంటాయి. తమకు అలాంటి భావాలున్నాయని వారి, తెలియక పోవచ్చు. కాని పూసలపేరులోని దారంలాగా ఏదో ఒక జీవిత తత్వం వుంటుంది. ఒక్కొక్కప్పుడు దృక్పథాలు వేరుగా వుండవచ్చు. అలా వున్నప్పటికీ ఒకరు మరొకరిని గౌరవించుకుంటూ కాపురం చెయ్యాలి. జీవితం సుఖంగా నడవటానికి సహనం, సర్దుకుపోవటం మూల సూత్రాలు. అయితే వాటిని పాటించేది స్త్రీ మాత్రమే కారాదు. ఏ ఇద్దరి లక్ష్యాలు, ఆదర్శాలు ఒకే మూసనుండి దిగిరావు. అయితే ద్వేషంతో, ఈర్ష్యా అసూయలతో కలిసివుండేకంటే విడిపోవడమే మేలు. పూర్తిగా విరుద్ధ తత్వాలున్న దంపతులు ఎవరి మార్గంలో వారు పయనించడం శ్రేయస్కరం. సమాజంకోసం, పరువు ప్రతిష్టలకోసం చేసే కాపురంలో అద్వితీయానందం లేకపోగా అది నరకతుల్యంగా వుంటుంది. జీవిత లక్ష్యం, జీవనరీతి, ఆదర్శం వీటిని పరిగణలోకి తీసుకోవాలి. బాహ్య సౌందర్యంకంటే మానసిక సౌందర్యం మిన్నగా భావించాలి. నిత్య జీవితంలో హృదయ సౌందర్యాన్ని నిలుపుకోటానికి ఒండొరులు ప్రయత్నం చెయ్యాలి. దానికి సాధన, శ్రమశిక్షణ అవసరం. అదొక కళ. ఆ కళనాస్వాదించగల కళాతపస్వులు కావాలి నూతన దంపతులు.

స్త్రీ పురుష వాంఛ వారి వ్యక్తిత్వాలకు సంబంధించినది. ఇతరులతో అనుభవాలద్వారా వారు దానిని వమ్ము చేసుకోవడానికి ఇష్టపడరు. అవతలి మనిషి తనకు అవశ్యం కావాల్సిన మనిషి. మరోమనిషి ఆ స్థానాన్ని ఆక్రమించరాదు. అందువల్ల పరస్పర విశ్వాసం అవసరం. లైంగిక సంబంధంలో ఆనందం పొందాలంటే ప్రేమలో కాని, కోరిక సందర్భంగా కాని రెండో మనిషి ఇష్టాయిష్టాలను పరిగణిస్తేనే అది సాధ్యమవుతుంది. ఒకరిని మరొకరు వాడుకోరాదు. ఒకరి వ్యక్తిత్వాన్ని రెండోవారి వ్యక్తిత్వంలో కలిపి వేయకుండా ఎవరి వ్యక్తిత్వాన్ని వారు పెంచుకుంటూ నూతన దాంపత్య జీవిత సౌధానికి పునాదులు వేసుకోవాలి.

ఒక స్త్రీకి ఒక పురుషుడు, ఒక పురుషుడికి ఒకే స్త్రీ అన్న భావం కలిగిన నాడే దాంపత్య జీవితం పరిపూర్ణమై ఫలిస్తుంది. అది విడదీయలేని ప్రేమ, మానసిక సంస్కారమున్న వారికే చెల్లుతుంది. చిత్తశుద్ధి, పరిపక్వదశ,

స్వచ్ఛమైన ప్రేమ లేని వారికి యావజ్జీవం ఒకే భార్య ఒకే భర్త అనేది బంధమేకాక బానిసత్వమవుతుంది; అంతేకాదు ఆ దాంపత్యాన్ని వ్యభిచార మని నిర్వచించినా తప్పులేదు. రోజూ తిట్టుకుంటూ, కొట్టుకుంటూ, మరణాన్ని కోరుకుంటూ రాత్రివేళకు రాజీపడే దంపతులు మనకు ఆదర్శం కాదు. ఈ ప్రపంచంలోని అనంత సౌందర్యాన్ని, విశాల పరిధిగల ఆకాశమంత ప్రేమను, సాటిలేని సద్గుణాలను తన భాగస్వామిలో చూడగల్గిన దంపతులే మనకాదర్శం. అలా మనసారా ప్రేమించుకున్న వారి హృదయాలలో వేరొకరికి స్థానం వుండదు. ప్రేమ, స్పందన, సౌందర్యాలతో పరిపూర్ణత్వంచెంది రససిద్ధినిపొందే అనురాగ దాంపత్య జీవితమే వివాహానికి లక్ష్యం.

పరస్పరప్రేమ, తపన, ఆకర్షణలేని శూన్య జీవితానికి బలవంతంగా తమ శరీరాలప్పజెప్పడం కంటే ధైర్యంగా విడిపోగల స్థిరచిత్తం ఆధునిక వివాహవ్యవస్థలో వుంటుంది. అందుకే ఆ వివాహాలు కావాలని పోరాటం సాగుతుంది. ఎక్కడ పరస్పర ప్రేమ, గౌరవం వుంటాయో ఎక్కడ పరిపూర్ణ స్వేచ్ఛాసమానత్వాలు వుంటాయో అక్కడ ఆనందానుభూతులు వెల్లివిరుస్తాయి. కనుక ఆ స్థితి వివాహంలోనికి వచ్చిన నాడే దాంపత్య జీవితం సార్థకమవుతుంది; ఆ జీవితాలకు లక్ష్యసిద్ధి కలుగుతుంది.

ఈనాటి వివాహాలు రెండు రకాలుగా ఉన్నాయి — పెద్దలు ఏర్పాటు చేసిన పెండ్లిండ్లు, వధూవరులు ప్రేమించుకొని నిర్ణయించుకున్నవి. మొదటి దానిలో కలిసిఉందామనే సంకల్పం ముందు, తదుపరి తద్వారా ప్రేమాభిమానాలు; రెండవదానిలో ముందు ప్రేమ, తరువాత కలిసి కాపురం చేద్దామనే సంకల్పం. ఏదైనా, కలిసి కాపురం చేయుటం రెండింటిలోనూ ఉంటుంది. దాంపత్య జీవితం సుసంపన్నం కావాలంటే ఏయే అంశాలు తోడ్పడతాయో పైన చర్చించటం జరిగింది. ప్రేమ నశించిన వైవాహిక జీవితం ఎంత నిస్సారమో, కేవలం ప్రేమ భావన మాత్రంఉండి తదితర అవసర గుణాల సతీపతులలో లోపిస్తే ఆ కాపురం దుఃఖభాజనమవుతుంది. కలుక సమతుల్య భావనతో ఈ దశలోకి యువతీ యువకులు అడుగిడడం అవశ్య కర్తవ్యం. అలా జరగని నాడు వారు అనవసరంగా ప్రమాదాలను కొని తెచ్చుకున్న వారవుతారు. సఖ్యత, సామరస్యం వెల్లివిరిసే దాంపత్య జీవితం సుఖప్రదం అవుతుందనడంలో అతిశయోక్తిలేదు.



# కులాంతర, మతాంతర వివాహాలు అవసరమా?

## —శ్రీ రాజ్యం సిన్హా

ఎన్నో రంగాలలో అభివృద్ధిచెంది' ఆధునిక యుగంగా పరిగణింప బడుతున్న యీ రోజుల్లో, ఒక కులంవారు మరోకులంలోని వారిని, అలాగే ఒక మతానికి చెందిన వారు, ఇంకొక మతానికి చెందినవారిని వివాహం చేసుకోవడాన్ని ఎంతవరకు స మా జ ం హర్షిస్తోంది? వరకట్నంలాంటి దురాచారాలకు గురి అయిన ఎన్నో విషాదగాధలవలె యిలాంటి వివాహాల విషయమై మనం వినకపోవచ్చును. కాని అక్కడక్కడ 'కులాంతర వివాహం' చేసుకున్న వారిని యింట్లోని బంధువులు, సమాజంలో పెద్దలుగా పరిగణింప బడే కొందరు వ్యక్తులు కూడా సరిగా ఆదరించక పోవడం జరుగుతుంది.

ఇందుకు కారణం యీనాటి సాంఘిక పరిస్థితులు, ఆర్థిక పరిస్థితులు అని చెప్పవచ్చును. కరుడుగట్టిన అనేక సాంప్రదాయాలు సామాజిక అన్యాయాలకు దారితీస్తున్నాయి. ఒకవైపు రాళ్ళు, రప్పలకు పూజలు చేస్తుంటారు. కాని తమతోటి మానవులను కొందరను ముట్టుకుంటేనే మైల పడతాం అనే తత్వంతో జీవితం గడిపేవారిని ఏమని పిలవాలి? పైగా 'అస్పృశ్యులు' అనే మాటలు ప్రభుత్వము హరిజనులు లేక నమోదైన కులాలు అంటూ ప్రత్యేక సౌకర్యాలు ఇస్తున్నాం అని చెపుతున్నారు.

ఒక ప్రక్క శాస్త్రీయ విజ్ఞానాన్ని గురించి, అభివృద్ధి గురించి మాట్లాడుతున్న సంఘంలో, కుల, మతభేదాలు, ముఖ్యంగా 'అస్పృశ్యులు' అనే మాటలు మనం ఎంత అనాగరిక సమాజంలో నివసిస్తున్నామో తెలియచేస్తాయి.

కులవ్యవస్థ సమూలంగా పోవాలి. కులం పేరుతో మనిషిని వెనుకకు తోసే పరిస్థితులు మారాలి. కేవలం ఆర్థిక సంబంధాలుకూడా పోవాలి. ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో నిజమైన అభివృద్ధి

జరిగితేనే వ్యక్తికి స్వేచ్ఛగా ఆలోచించగలిగిన చైతన్యం వస్తుంది. ఆ చైతన్యం వున్నరోజున కులం, మతభేదాలు పాటించని విశాలదృక్పథం వస్తుంది. వర్ణాంతర, మతాంతర వివాహాలు సులభంగా, హెచ్చుగా జరుగుతాయి.

ప్రస్తుత సమాజ పరిస్థితులలో అసలు స్త్రీలే సమాన వ్యక్తులుగా చూడ బడడం లేదు. ఇంకా ఆమె భర్త యిష్టాయిష్టాలకు నడుచుకునే ఆస్తిగానే పరిగణింపబడుతుంది. ఈ పరిస్థితి పోవాలంటే స్త్రీల హోదా పెరగాలి. హోదా అంటే ముఖ్యంగా ఆర్థిక స్వాతంత్ర్యం చాలా వరకు అవసరం అని చెప్పక తప్పదు. ఆర్థిక స్వాతంత్ర్యంవున్నా, అవసరం వచ్చినప్పుడు పురుషుణ్ణి ధిక్కరించి స్వతంత్రంగా, నిర్భయంగా, నిశ్చింతగా, జీవించడం మనదేశంలో స్త్రీ జాతికి సాధ్యమవుతుందా? అని మనం కొంత సూక్ష్మదృష్టితో పరిశీలించినప్పుడు, సాంఘిక పరిస్థితులుకూడా స్త్రీలకు వ్యతిరేకంగావున్నాయి అని కనిపిస్తుంది.

ఇందుకు కారణాలు ఏమిటి? స్త్రీల పరిస్థితులకు, కులాంతర, మతాంతర వివాహాలకు సంబంధం వుందా ? ఇలాంటి వివాహాలు జరగాలంటే, స్త్రీల దుస్థితికి మూలకారణాలు గ్రహించి దానిని కూకటివ్రేళ్లతో సహా నిర్మూలించాలి.

మానవ విలువలలో, ప్రవర్తనలో మార్పు రావడానికి ఇలాంటి వివాహాలు దోహదం చేస్తాయి. అభ్యుదయంవైపు ఒక అడుగు ముందుకు వేస్తున్నాం అని రుజువు చేయడానికి యిలాంటి వివాహాలను ప్రోత్సహించడంకూడా చాలా అవసరం.

సామాజిక చైతన్యం పెరుగుతూంటే శాస్త్రీయ దృక్పథంకూడా వికసిస్తుంది. ఇలాంటి చైతన్యం కొరకు పోరాడటం అభ్యుదయం కోసం పోరాడుతున్నాం అని మాట్లాడే వాళ్ళందరూ దీక్షతో సాగించాల్సిన కృషి.

అసలు వివాహం అంటే ఏమిటి ? భార్యకు, భర్తకువుండే సంబంధం ఎలాంటిది ? జీవితాంతం కలిసివుంటూ సుఖదుఃఖాలను పంచుకుంటూ ఒక కుటుంబాన్ని ఏర్పరచుకోవడం. ఈ కుటుంబం అంటే కేవలం పిల్లలను

కనడం, పెంచడం మాత్రమే కాదు. మానసిక సుఖాన్ని, ఆనందాన్ని కలుగచేసే యిద్దరు వ్యక్తుల సహజీవనం. ఈ యిద్దరూ జీవితాంతం కలిసి వుండాలంటే కొన్ని సమాన అభిరుచులు, స్వభావంతోపాటు సామరస్యం, సహనంకూడా కావాలి. పరస్పర గౌరవం వుండాలి. ఈ గౌరవం, హోదా, అంతస్థు, ఆర్థిక సమానతలకు అతీతంగా వుండాలి.

ప్రస్తుతం మన సమాజంలో అలాంటి అవకాశాలు వున్నాయా? ఇద్దరు వివాహం చేసుకునే ముందు, ఒకరిని గురించి మరొకరు అవగాహన చేసుకునే అవకాశం కావాలి. ఒకరిని గురించి ఒకరు అర్థం చేసుకోవడానికి కొంత సమయం కావాలి. వివాహానికి ముందు స్వేచ్ఛగా మాట్లాడుకునే పరిస్థితులు వుండాలి. లేకపోతే తాత్కాలిక వ్యామోహాలకులోనై, ప్రేమ నిజంగానే వుందనుకుని భ్రమపడి వివాహాలు చేసుకుంటే, అలాంటి వివాహాలు విఫలం కావచ్చు. విచ్ఛిత్తికి దారితీయవచ్చు. కాని ఇలాంటి భయాలతో అసలు అవకాశాలు లేకుండా చేయడం ఎంతవరకు సమంజసం?, సాధ్యం? ఇలాంటి విషయాలు మన సమాజంలో యింకా చర్చనీయాంశాలుగానే వున్నాయి. పరిపక్వ దశకు రాలేదు.

కాని, ఏ సమస్య అయినా ఒకటి ముందుకు వచ్చినప్పుడు పట్టుదలతో పోరాటాలకు దిగాలి. కార్యక్రమాలు చేపట్టాలి. సమయం ఎప్పుడో వస్తుంది అని చూస్తూకూచుంటే, ఆదర్శాలు మాటలలోనే వుంటాయి. కేవలం కులం కారణంగానో, వేరువేరు మతాలు కారణంగానో ఇద్దరు వ్యక్తులు, మేము కలిసి జీవితాంతం సుఖంగా కాలక్షేపం చేయగలం, అనుకుని ముందుకువచ్చినా సాంప్రదాయాల కారణంగా తల్లిదండ్రులు ఒప్పుకోవడంలేదు. కారణం, సామాజికంగా తమ అంతస్థుకు దెబ్బతగులుతుందని భయం. ఒకేరకమైన అభిరుచులు, స్వభావాలు, ఆదర్శాలుగల ఇద్దరు వ్యక్తుల సుఖమయ జీవితాలు కొన్ని యీ పరిస్థితుల ప్రాబల్యంలో నలిగి పోతున్నాయి.

ఇప్పటికీ సహజంగా సనాతన కుటుంబాలలో వివాహాలు నిశ్చయించేది తండ్రే. వివాహాలు స్వర్గంలో జరుగుతాయి, మనచేతిలో ఏముంది? అనే వేదాంతంతో సాంప్రదాయపు ముసుగుతుంచి బయటపడలేక అలా మాట్లాడు

తుంటారు. మన భారతదేశంలో వివాహాలు — స్వర్గంలో కాదు గదా — భూమి మీదనే, పైగా చాలా ఆడంబరాలతో, ఖర్చుతో కూడిన వ్యవహారంగా తయారయ్యాయి.

ఒకవైపున సమాజంలో స్త్రీలకు అన్యాయాలు జరుగుతున్నాయి. ఒకప్పుడు భారతదేశ స్త్రీ అంటే నిజమైన సంస్కృతికి ప్రతిరూపం అనిపేరు. స్త్రీ అంతఃసౌందర్యాన్ని భర్తకు మాత్రమే అంకితం అనేది మంచి సాంప్రదాయం అని గర్వించాము. ఇప్పుడు కాబరే డాన్సుల పేరుతో పెద్ద పెద్ద హోటళ్లలో జరుగుతున్న నాట్యాలు స్త్రీలను ఎంత అధోగతికి తీసుకు వెడుతున్నాయో చూస్తున్నాం. మంచి సాంప్రదాయాలను మంటగలిపి కేవలం డబ్బుకోసం ఎంత నీచానికైనా స్త్రీలను పతనం చేస్తోంది ఒకవైపు యిదే సమాజం.

మరొకవైపు, ఆడంబరంతో జీవితాలు గడపాలనే కోర్కెలు, అంతస్థులను పెంచుకోవాలనే కాంక్షలతో ముక్కుపచ్చలారని స్త్రీలు హత్యలు, ఆత్మహత్యలకు దిగేటట్లు చేసింది సమాజం. కట్నంపై ఆధారపడే వివాహాలు, ముఖ్యంగా ఆర్థిక కారణాలుగా, భర్తపై ఆధారపడడం సహజం. స్త్రీని బజారువస్తువుగా నీచంగా చిత్రించడంలో అశ్లీల సాహిత్యం, కొన్ని సినిమాలకుకూడా బాధ్యతవుంది. కేవలం దరిద్రం కారణంగానే పొట్టకూటి కోసం వ్యభిచారం నిస్సహాయ స్థితిలో చేస్తున్నారనేది అనేక పరిశీలనలలో రుజువయింది.

వేలాది సంవత్సరాలుగా వస్తున్న సాంప్రదాయాలు, సిద్ధాంతాలు, స్త్రీలను దాస్యంలో వుంచడానికే ఉపయోగంగా వున్న వాటిని సంఘ సంస్కర్తలు తమ కృషి ఫలితంగా నిర్మూలించినట్లు చరిత్ర రుజువుచేసింది. అలాగే యీ రోజున స్త్రీలు చైతన్య వంతులవుతున్నారు. వారిని అడ్డుకునే పరిస్థితులకూ వారికీ పోరాటాలు జరుగుతాయి. స్వతంత్రంగా, వివాహాలు, ఏ కులానికి చెందినా, ఏ మతానికిచెందినా తన జీవితం సుఖమయం కాగల దనుకుంటే చేసుకోవడానికి ఆసక్తిని చూపించే స్త్రీలు, పురుషులు లేకపోలేదు. ఇలాంటి వివాహాలు కేవలం కులం, మతమేకాదు, భాష జాతి వేరైనా సరే,

ప్రపంచంలో, అనేక దేశాలలో జరుగుతున్నాయి. సుఖప్రదమైన కుటుం[బ] జీవితానికి ఆటంకాలు లేనందువల్లనే, అలా వివాహాలు చేసుకునే వారిసంఖ్య ప్రపంచంలో హెచ్చుతుంది.

మన దేశంలో కూడా సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితుల అభివృద్ధి చెందుతూ ముందుకు సాగిపోతుంటే, ఇలాంట వివాహాలు — కులం, మతం, భాష, దేశం — లాంటి అంశాలకు అతీతంగా జరగడం అవసరం. అలా జరగడం అభ్యుదయానికి ఒక మెట్టు ముందుకు వేసినట్లుగా ఆశించడం సహజం.

---

"ప్రేమ అనేది ఇతరులను గురించి ఆలోచించేది. ఇతరుల శ్రేయస్సుకు ప్రేరణ కలిగించేది. ఒక లక్ష్యంతో తనకు భిన్నమైన, ప్రత్యేకమైన, విలక్షణమైన వ్యక్తియొక్క జీవితానికి సంబంధించినది"

— సైమాన్ డి బొవా

వివాహం ప్రసాదించే వరాలను గురించి, పెండ్లి ప్రమాణాల స్థిరత్వాన్ని గురించి ప్రసంగించేవారే, వివాహబంధంలోని వారి సంకెళ్ళను విడదీస్తే, వారికి స్వేచ్ఛనిస్తే సామాజిక వ్యవస్థ మొత్తం బదాబదలవు తుందని చెప్తారు. ఇలా విభిన్న వాదాలు చేయుటం కుదరదు. బంధితుడు ఆనందాన్ని అనుభవిస్తుంటే అతనిని కటకటాలలో బంధించడం ఎందుకు? అతడు ఆనందానికి దూరమైతే అతడు సంతోషంగా ఉన్నాడనే నటన ఎందుకు?"

— బెర్నార్డ్షా

"మన చర్యల పరమోద్దేశ్యాన్ని గురించిన జ్ఞానమూ, తద్భిన్నంగా సంచరించదలచే వారియెడల సహనభావమూ, ఈ రెండూ వ్యక్తిగత ఆనందానికి సామాజిక సామరస్యానికి కీలక మార్గాలు"

('పెండ్లిలో అ అలు' అనే గ్రంథంలో)

— బ్లాక్‌హేం

# కుల భేదాల తొలగింపుకం కులాంతర వివాహాలు

ఎ. గంగాధరరావు

కులం అనేది భారతదేశాన్ని పట్టి పీడిస్తున్న విలక్షణ సాంఘిక జాడ్యం. కులం ఎలా పుట్టింది, ఎవరు దీనికి కారకులు, కాలక్రమేణా కులం చిలవలు పలవలుగా ఎలా పరిణమించింది వివరించడం ప్రస్తుతం అనవసరం. కులం అనే భావన ఒక వాస్తవికంగా మారిందని గ్రహిస్తే చాలు లోగడ దీనిపై చాలా చర్చ జరిగింది. స్థూలంగా చూస్తే ఎవరి కులాన్ని వారు సమర్థించడం కనిపిస్తుంది. పైకిమాత్రం కులం పోవాలని అందరూ అంటూ వుంటారు. ఆచరణలో మాత్రం కులం ఒక రుగ్మతగా మారి, అన్ని రంగాలకు విస్తరించింది. కుల సంఘాలు వెలిశాయి. కుల మహాసభలు జరుగుతున్నవి. కులం పోవాలంటేనే, ఎవరి కులాన్ని వారు ఉద్ధరించే ప్రయత్నం చేస్తున్నారు. ప్రతిభకు ప్రాముఖ్యత ఇవ్వటంలేదు. అది చాలా శోచనీయం. ఇలాంటి వైరుధ్యంలో బ్రతుకుతున్నాం.

వైజ్ఞానికంగా విడమరచి పరిశీలిస్తే కులం నిలబడదు. అయినా సైన్సు చదువుకున్న వాళ్ళుసైతం కుల పరిధినుండి ఒక పట్టాన బయట పడలేక పోతున్నారు. రానురాను వైజ్ఞానిక, సాంకేతిక అభివృద్ధి విపరీతంగా జరుగుతుండగా కులం హరించక తప్పదు. ఎటువచ్చీ ఎంతకాలం అనేది ప్రశ్న. 'కులం' అనేది అశాస్త్రీయం, అజ్ఞానం నుండి పుట్టిన ఒక దోషగుణం అని గ్రహిస్తే, తొలగించడానికి మనం ఏమి చేయగలం అనేది చూసుకోవాలి.

జీవితంలో భిన్న దశల్లో అనేక రంగాలలో, కులాన్ని పాటించకుండా ఉండగలుగుతున్న వారు సైతం వివాహ విషయం వచ్చేసరికి కులాన్ని పట్టించుకుంటున్నారు. కనుక వ్యక్తి జీవితంలో కులం అనేది పెళ్ళి సమయంలో కీలక పాత్ర నిర్వహిస్తున్నదనవచ్చు. సాధారణంగా పెళ్ళి

దగ్గరకు వచ్చేసరికి అమ్మమ్మ బాధపడుతుందనో, నాన్న పట్టుబట్టాడనో, అమ్మ మాట ఇచ్చిందనో, ఇలాంటి వంకలు, కుంటి సాకులు పెట్టడం పరిపాటి. వీటన్నింటినీ అధిగమించి కులాంతర వివాహాలు చేసుకుంటున్న వారు కొద్ది మంది లేకపోలేదు. అయితే అందులోనూ కొందరు "ఏ కులం అయినా ఫరవాలేదు గానీ, ఫలానా కులం మాత్రం కాగూడదు" అంటుంటారు. అంటే అంటరాని తనాన్ని మానసికంగా తొలగించుకోలేక పోతున్నారని అర్థం. కులం పోగొట్టడానికి కులాంతర వివాహాలు ఉత్తమ మార్గం అని నా నమ్మకం. ఇప్పుడు కొందరు కులాంతర వివాహాలు చేసుకున్నారు. అయినా కులం పోవడానికి అది నాంది కావడంలేదు. ఎందుకని ? ఇందులో ఒక ప్రధాన దోషంవుంది. అది బహుశః చట్టపరంగా సవరించవచ్చు. రెండు కులాలవారు పెళ్ళి చేసుకున్న తరువాత వారికీ, వారి పిల్లలకు కులం అనే గుర్తింపు ఉండరాదు. కాని ఉంటున్నది. మన సమాజంలో చట్టాలు పురుషుల ఆధికత్యతో ఏర్పరచారనడానికి యిదొక నిదర్శనం. పెళ్ళి అయిన తరువాత భార్య కులంపోయి, భర్త కులం వస్తుంది. వారి పిల్లలుకూడా తండ్రి కులం అవలంబిస్తారు. రిజర్వేషన్ల అవకాశాల కోసం యిలాంటివి దుర్వినియోగం చేసేవారి విషయం అలా వుంచుదాం.

మన చట్టంలో రావలసిన మార్పు ఏమంటే, కులాంతర వివాహం జరగగానే భార్యకు భర్తకు కులం ఎక్కడా ఉండరాదు. కులం పేరిట లోగడ ప్రభుత్వం యిస్తున్న అవకాశాల్ని కూడా వీరు వినియోగించరాదు. ఇక వారి పిల్లలకు కులం అనేది చట్టరీత్యా ఉండకూడదు. అప్పుడు గానీ కులాంతర వివాహాలకు అర్థం, సార్థకం వుండదు. అలాంటివారు మానవ కులం అనే ఉన్నత స్థాయికి ఎదగాలి. అంతకు తక్కువ స్థాయికి దిగజారరాదు.

మార్గాంతరంగా ప్రభుత్వం కొన్ని విధానాలు అవలంబించాలి. కులాంతర వివాహాలు చేసుకున్న వారికీ, వారి పిల్లలుకూ ఉద్యోగాల్లో, స్కూళ్ళలో ప్రత్యేక రిజర్వేషన్లు చూపాలి. ఇవి శాసన బద్ధంగా అమలు పరచాలి. ఇవిగాక, కుల ప్రసక్తి వచ్చే పేర్లను తొలగించడం, పాఠ్య గ్రంథాలలో కులాన్ని ప్రోత్సహించే పాఠాలు, పద్యాలు లేకుండా చేయడం, రేడియో, టి.వి.లలో కూడా కుల ప్రసక్తి తొలగించడం ఎంతైనా అవసరం.

ఇంతవరకు మనం చర్చించిన విషయం ఏమంత కొత్తదికాదు. ఏదో ఒక సందర్భంలో పెద్దలు యిలాంటి సూచనలు చేసారు.

ఇతర రంగాలలో జరుగుతున్న వేగాన్ని మన సమాజం అందు కోవాలంటే కులజాడ్యాన్ని అంతవేగంగా తొలగించుకోవాలి. దీనికి ఒక పరిష్కారమార్గం కనిపిస్తున్నది. చిత్తశుద్ధితో కులం పోవాలనే వారంతా యీ విషయాన్ని దీక్షగా ఆలోచించాలి.

కులంలో పెళ్ళిళ్ళు నిషేధిస్తూ కులాంతర వివాహాలను బాగా ప్రోత్స హించాలి. కులాన్నికూడా అంటరాని తనంతో సమానంగా చూడాలి. దీని వలన ఒక ప్రశ్న ఉద్భవిస్తుంది. పెళ్ళి అనేది వ్యక్తి స్వేచ్ఛగా నిర్ణయించు కోవలసిన విషయం గనుక, ఇలాంటి నిర్బంధాలు, నిషేధాలు మంచిది కాదనవచ్చు. అలాంటి స్వేచ్ఛాప్రియులకు సమాధానం సులభమే. ఇప్పుడుకూడా నూటికి 99 శాతం పెళ్ళిళ్ళు స్వేచ్ఛగా, ప్రేమించుకొని జరగడంలేదు. తల్లిదండ్రులు, సంరక్షకులు ఏర్పాటు చేస్తున్నవే యివన్నీ. నిజానికి కుల పరిధి దాటిపోయిన తరువాత, ఫలానా కులంలో, మతంలో, జాతిలో పెళ్ళిచేసుకోవాలనే నియమం లేదు. కనుక వ్యక్తి స్వేచ్ఛ విస్తరిస్తున్నది. ప్రపంచమంతటా ఎక్కడైనా పెళ్ళి చేసుకోవచ్చు. అందువలన స్వేచ్ఛా ప్రియులు కులంలో పెళ్ళిళ్ళు నిషేధాన్ని సమర్థించాలి. అంటే ఈ ప్రయత్నంవల్ల రెండు లక్ష్యాలు సాధించవచ్చు. అటు కులం రూపుమాసి పోతుంది. ఇటు స్వేచ్ఛ పెరుగుతుంది. అంతేకాదు. కులం పోవాలంటే ఆచరణకు దిగనివారి బండారం బయట పడుతుంది.

మనం లోగడ అనేక ఆచారాలను, దోషాలను నిషేధం ద్వారా బలవంతంగా పోగొట్టుకోవలసి వచ్చింది. సతీ సహగమనం, దేవతలకు నరబలులు లాంటివి మచ్చుతునకలు. అలాగే బాల్య వివాహాలు. వితంతు వివాహం అభ్యంతరంలేకుండా పోయింది.

అలాగే కులం అనేది మంచిదికాదు, పోగొట్టాలి అనుకున్న తరువాత, తీవ్రచర్య తీసుకోక తప్పదు. అనేక మార్గాలద్వారా దీనిని పోగొట్టే ప్రయత్నాలు విఫలమైనప్పుడు మార్గాంతరం నిషేధమే. ఏ పనిచేస్తున్నా

అవరోధాలు ఉంటాయి. అలాగే కులాన్ని పోగొట్టడానికి చేసే ప్రయత్నంలో కూడా లక్ష అడ్డంకులు రావచ్చు. ఆ అడ్డంకులను, అవరోధాలను అధిగమించి ప్రగతి సాధించాలి.

ఇప్పటికే కులజబ్బు ముదిరింది. దీనికి శస్త్ర చికిత్సచేసి తొలగించటం అవసరం. చూస్తూ ఊరుకుంటే కులజాడ్యం మనల్ని మింగేస్తుంది. పైగా వెర్రితలలువేసే ప్రమాదంకూడా కనిపిస్తుంది.

కులం చాలా శతాబ్దాలుగా వస్తున్నప్పటికి నేటి ఉద్రిక్తత ఎన్నడూ రాలేదు. దీనికి కారణం ఒక్కటే. అన్ని రంగాలలోనూ అదుపుచేయగల్గు రాజకీయాధికారి పరిధిలోకి కులం ప్రవేశించింది. అందువలన ప్రమాదం అంటున్నాం. ఇంకా ఇది నాగజెముడు వలె వ్యాపించకముందే, కులాన్ని తొలగించుకోవాలి. అందుకే కులంలో పెళ్ళిళ్ళు శిక్షార్హం చేయడం ఒక్కటే పరిష్కారమార్గంగా కనిపిస్తున్నదంటున్నాను. ఆలోచించండి.

ఆర్థికంగా సంపన్నులైతే కులం పోతుందనడానికి ఆధారాలు కనిపించడంలేదు. అలాగే చదువుకున్న వారిలో కులజాడ్యం తగ్గలేదు. ఇదొక ప్రత్యేకరుగ్మత. కనుక ప్రత్యేక చికిత్స అవసరం. పక్షులకు, చీమలకు సైతం కులాల పేర్లు పెట్టిన సమాజం మనది! అందువలన దీనిని పూర్తిగా మట్టుపెడితే తప్ప, ఏ మాత్రం మిగిలినా మళ్ళీ తలెత్తుతుంది. కుల వివాహాలు నిషేధించడం, కులంలో పెళ్ళి అంటే శిక్ష అయితేనే ఇది పోతుంది.



"మగడు రక్షకుడు, ఆలి రక్షిత కానప్పుడే వారిద్దరిమధ్య నిజమైన భాగస్వామ్య జీవితం నెలకొంటుంది."

— ఎం. ఎన్. రాయ్

"పరస్పర సమ్మతి, ప్రేమ కాకపోతే మరేవి లైంగిక నీతికి ప్రాతిపదికలు?"

— ఎం. ఎన్. రాయ్

"స్త్రీ పురుషుల సాహచర్యం, పరస్పర అవగాహన ప్రేమగా వికసించిన దశలో వారిరువురి సంతోషప్రదమైన కలయికే వివాహం"

— కార్లిస్ లామాంట్

# కుల, మత, జాతి, భాష, రంగు, ప్రాంత ప్రసక్తిలేని వివాహాలు

**— ఎం. వి. రామమూర్తి**

కులాన్ని, మతాన్ని వివాహసందర్భంగా పరిగణనలోకి తీసుకొనరాదని అభ్యుదయగాములు అందరూ అంగీకరిస్తున్నారు. కాగా వీటి ప్రాబల్యాన్ని తగ్గించడానికి, లేదా నిర్మూలించడానికి ఏమిచేయాలనే అంశం పై అభిప్రాయ భేదాలు పొడసూపుతున్నాయి. కులాంతర, మతాంతర వివాహాలు అవశ్యం అనుసరణీయమని కొందరు వాదిస్తుంటే కుల మత ప్రసక్తిలేని వివాహాలు కావాలని మరికొందరు ప్రతిపాదిస్తున్నారు. వాదోపవాదాలు చెలరేగి తీవ్రమయి పరస్పర నిందలకుకూడా దారితీస్తున్నాయి. మొదటి రకం భావాన్ని ఆమోదించేవారు రెండవ వర్గాన్ని భీరువులని, సమస్యను ఎదుర్కొనకుండా దాటవేసే పలాయన వాదులని విమర్శిస్తున్నారు. రెండవ వర్గం వారు మొదటివారిని ఆవేశపరులని, కార్యాచరణ పేరుతో ఆలోచనను త్రోసిరాజనే వారని ప్రతి విమర్శ చేస్తున్నారు. ఈ వాదాలలోని పసను, ఔచిత్యాన్ని, బలాన్ని గమనించటం అవసరం.

ఒక పురుషుడు ఒక స్త్రీని గాఢంగా ప్రేమించి, అభిమానించి వివాహ మాడదలచుకున్నాడను కుందాము. అపుడు అతడు ఆమె కులాన్ని, మతాన్ని అడిగి తెలుసుకొని తన మతానికి లేక కులానికి ఆమె చెందియుంటే ఆమెను వివాహమాడే సంకల్పం విరమించాలన్నమాట. కులాంతర మతాంతర వివాహాలను మాత్రమే చేసుకోవాలని నియమం పెట్టినప్పుడు - ఈ సూత్రాన్ని ఇంకా పొడిగిస్తే ఆమెతో పరిచయమయి ఆమె తనకు తగిన సహచారి కాగలదనేభావం కలిగినపుడే ఆమె కులాన్ని, మతాన్ని తెలుసుకొని ఆమె విభిన్న కులానికి లేక మతానికి చెందినప్పుడే ఆమెపై అభిమానాన్ని పెంచుకోవలసి వస్తుంది. ఈ రెండు సందర్భాలలో పైన ఉదహరింప బడిన ప్రవర్తన విడ్డూరంగా ఉంటుంది. అంతేకాదు సందర్భరహితంగా ఉంటుంది. ఇక్కడ ప్రేమకు ఆధారపీఠం ఏమిటనే విషయం

చర్చనీయాంశం అవుతున్నది. భిన్నకులానికి లేక వేరొక మతానికి చెంది యుండటం ముఖ్యాంశం అయితే, వివాహ ఎంపికలో భూమికలు వహించ వలసిన పరస్పర అవగాహన, సానుభూతి, అభిమానం, ఇద్దరికీ ఇష్టమైన కొన్ని అంశాలు లేక అభిరుచులు, ఆసక్తిదాయకాలు లాంటివి వెనుకకు నెట్టబడతాయి. వివాహం విషయంలో పూర్వం కులం, మతం ఆంక్షలను విధిస్తే ఇపుడు మరొక రీతిలో అడ్డువస్తున్నాయనేది సత్యం. అంతేకాదు ఆ స్త్రీ "నన్ను ప్రేమిస్తున్నావా? లేక నా విభిన్న కులాన్ని ప్రేమిస్తున్నావా?" అని నిగ్గదీసి అడిగితే అతడు ఏమని సమాధానం చెప్పగలడు? నిమ్న జాతి కులానికి చెందిన యువతిని వివాహ మాడానని ఒక పురుషుడు సగర్వంగా చెప్పుకుంటే, ఆమె "నన్ను పెండ్లి చేసుకున్నావా? లేక నా అంటరానితనాన్ని పెండ్లాడావా?" అని సూటిగా ప్రశ్నిస్తే, అతని పరిస్థితి ఏమవుతుంది? వ్యతిరేక పద్ధతిలో కులతత్వ విజృంభణకాక మరేమిటి ఇది? పూర్వం ఒకే కులంవారిని అభిమానిస్తే ఇపుడు విభిన్న కులం వారిని మాత్రమే అభిమానించడం జరుగుతున్నది. అంటే అన్నిటికీ గీటురాయి కులం తప్ప మరేమీ కాదనే కదా!

మరొక అంశాన్ని ప్రస్తావించవలసి ఉంటుంది. కులంలో, మతంలో విశ్వాసంలేని వ్యక్తి మరొకవ్యక్తిని "నీ కులం ఏమిటి? నీ మతం ఏమిటి" అని ఎలా ప్రశ్నిస్తాడు. తనకు కులం, మతం అక్కరలేదనే మనిషి మరొక మనిషి కులాన్ని, మతాన్ని గురించి వాకబు చేయపూనినాడంటే — వివాహ సందర్భంగా — వాటికి ప్రాధాన్యత ఇవ్వదలచినట్లే కదా! తనకు పనికిరాని విషయాలు ఇతరులకు ఎలా పరిగ్రహణాంశాలు అవుతాయి? ఎందుకు కావాలి?

కులం మతం, పెండ్లి సందర్భంగా పట్టింపుకు కారణభూతాలు కారాదనటం ఒక పద్ధతి. అంటే కుల మత ప్రసక్తి ఉండరాదన్నమాట. కుల మత ప్రసక్తిని వివాహ ఎంపిక విషయంగా తీసుకొనిరానని ఒక వ్యక్తి తీర్మానించుకోవడం ఒక ఎత్తు; కులాంతర వివాహాన్ని, మతాంతర వివాహాన్ని మాత్రమే చేసుకుంటానని నిశ్చయించుకోవడం మరొక ఎత్తు. ఈ రెండు మనస్తత్వాలమధ్య హస్తి మశకాంతర భేదమున్నది. ఒక ఉదాహరణలో ఈ విషయం స్పష్టమవుతున్నది. "నాకు కులం లేదు,

మతంలేదు" అని ప్రకటించేవారు ఉంటారు. అదీగాక కులాంతర వివాహాలు చేసుకున్నవారి సంతానం ఉంటే ఆ యువతీ యువకులకు కులం ఉండదు. అలాగే మతాంతర వివాహాలు చేసుకున్న వారి సంతానానికి జన్మతః మతం ఉండదు. అపుడు కులాంతర వివాహమే చేసుకుంటానన్న పట్టుదల వహించే వ్యక్తికి పై చెప్పిన రెండు తరగతులకు చెందిన వ్యక్తులు వివాహార్హులు కాకుండా పోతారు. అలాగే మతాంతర వివాహమే కావాలని భీష్మించుకున్నవారికి కూడా పై రెండు తరగతులకు చెందిన వ్యక్తులు వివాహ ఎంపిక విషయంగా పరిగణనలోకి రారు. ఇలాంటి పరిణామం అభిలషణీయమా ?

మరియొక అంశం మన దృష్టిని ఆకట్టుకుంటున్నది. నాకు కులంలో విశ్వాసంలేదని ప్రకటించిన వ్యక్తికి కులం ఉండదుకదా! ఆ వ్యక్తి కులాంతర వివాహమే చేసుకుంటానని ప్రతిన పూనడంలో అర్థం లేదుకదా! ఇదే తర్కం మతాంతర వివాహం విషయంలో పనిచేస్తుంది.

కాగా కులాంతర, మతాంతర వివాహాలు చేసుకోవడానికి ప్రగతి శీలుడైన వ్యక్తి సంకోచింపరాదు. ఇతర కారణాలవల్ల ఒక వ్యక్తిని ఎంపిక చేసుకొని అవతలి వ్యక్తియొక్క కులమో, మతమో తెలిసిన తరువాత ఏక కులమనో, భిన్న కులమనో కారణాన వివాహప్రతిపాదన విరమించడం అవివేకమవుతుంది.

కులాన్ని, మతాన్ని వదులుకొనలేని వారూ సమాజంలో ఉన్నారు. మతం వ్యక్తిగత విషయమని, కులం వృత్తిసంబధమని అర్థం చెప్పుకునే వారున్నారు. వారి అభిప్రాయం తప్పా లేక ఒప్పా అనేది ఇప్పుడు ఇక్కడ విచారణీయాంశం కాదు. కాగా వారు ఆ దృక్పథాన్ని అవలంబించినా మరియొక కులం వారిని, మరియొక మతం వారిని పెండ్లాడటానికి అభ్యంతరం చెప్పరు. అలాంటి వారిని 'పంక్తి బాహ్యులు' గా పరిగణించ గలమా? సర్వమత సహనం పేరుతో విభిన్న ప్రార్థనా పద్ధతులను, విభిన్న పూజా విధానాలను ఆలుమగలుకూడా కలిగి ఉండవచ్చనే ధోరణిలో ఉన్న వారున్నారు, వారిని మత రహిత వివాహాలను చేసుకోమంటే, కులరహిత వివాహాలను ఆమోదించమంటే, అంగీకరించరు. కనుక కులరహిత,

మతరహిత వివాహాలుగా అలాంటివారి వివాహాలను పేర్కొనలేము. అలాగే వాటిని మతవ్యతిరేక వివాహాలని అభివర్ణించలేము. దంపతులిరువురికీ మతంలో — విభిన్న మతాలవారైనా — విశ్వాసం ఉండవచ్చు కదా!

కనుక కులం, మతం, జాతి, రంగు, భాష, ప్రాంతం, తెగ అనేవి వివాహం విషయంలో అప్రధానాంశాలుగా పరిగణించడానికి వీలయినపరిస్థితి కలగాలి. అంటే కులం, మతం, జాతి, భాష, ప్రాంతం, రంగు, తెగ ప్రసక్తిలేని వివాహాలు ఆమోదకరం కావాలి. విజ్ఞులు అలాంటి వాటిని ప్రోత్సహించాలి.

---

"ప్రేమతో కూడియుండని జ్ఞానం నిష్ఫలం; జ్ఞాన సమన్వితం కాని ప్రేమ ఫలితాలు ప్రమాదకరం కావచ్చును"

—బెర్ట్రాండ్ రస్సెల్

ప్రేమికులు కేవలం పరస్పరం ప్రేమించుకున్నపుడే గాక, ఇరువురు కలసి అనేక విషయాలను అభిమానించినపుడు మాత్రమే ప్రేమ శాశ్వతంగా మనగలుగుతుంది"

— వాల్టర్ లిప్‌మన్

"వివాహం కేవలం లైంగికానుభూతి కోసం, లేక ప్రేమ కోసం కాదు ........ అది మౌలికంగా ఆర్థిక 'యూనిట్'. భద్రత సాహచర్యం లాంటి మానసిక విలువలను అది పెంపొందిస్తుంది; అనేక జీవితానందాలను పాలు పంచుకునేలాగు స్త్రీ పురుషులకు అవకాశం ఇస్తుంది"

— పాల్ కుర్ట్జ్

"స్వచ్ఛమైన ప్రేమ నెలకొనియున్న దశలో నిజాయితీ, నిష్కాపట్యమూ, విశ్వాసంలాంటి ముఖ్యమైన విలువలు దర్శనమిస్తాయి"

— పాల్ కుర్ట్జ్

"లైంగిక కలయికకు లైంగికానుభూతి ప్రకటనకు సాధనంగా ఏర్పడిన వ్యవస్థలు చాలావరకు సంప్రదాయికాలు. వాటిని మార్చవచ్చును"

— పాల్ కుర్ట్జ్

# వివాహ వ్యవస్థకు

# అవసరంవుందా?

— మహీధర రామమోహనరావు

వివాహ వ్యవస్థకు అవసరంవుందా — అనే ప్రశ్నకు అర్థంలేదు. మన ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా అది సమాజంలోవుంది. దానిని ఒకరు ఆలోచించి ఏర్పరచిందేమీ కాదు. అత్యవసరమూ, అతి సహజమూగా వచ్చింది. సమాజ పరిణామ క్రమంతో అది అనేక రూపాలు మారింది, అవతరాలు ఎత్తింది.

మానవుడు జంతుసంతతినుంచి విడబడి, తనకాళ్ళమీద తాను నిలబడి పది లక్షల సంవత్సరాలు అయిందని వూహ. ఆ దశలో మనుష్యుడు పదిమందికి మించని గుంపులుగా జీవించివుండాలి. ప్రకృతి, పరిసరాలూ అతడు గుంపుగా జీవించవలసిన అవసరాన్నీ, ఆ గుంపుపరిమితినీ కూడా నిర్ణయించాయి. ఆ దశలో ఆ గుంపులోని ఆడ-మగ అందరూ ఒక కుటుంబం. గుంపు నశించకుండేందుకూ, విస్తరించేందుకూ అవసరం అయిన స్త్రీ పురుష సంప్రయోగానికి ఆ అత్యంత ప్రథమ దశలో రక్త సంబంధాలనుపట్టీ, వయస్సు అంతరాన్నిపట్టి కూడా నిషేధం వుండడానికి వీల్లేదు. క్రమంగా సమాజంలో కనబడిన ఆరోగ్యావసరాల దృష్ట్యా కావచ్చు, రక్తసంబంధీకులమధ్య నిషేధాలు అనేక అంతరువులతో విస్తరించాయి. "ప్రారంభ కాలంలో చాలామంది ఉమ్మడి వివాహ బంధంతో ఇమిడి వుండే వారు. కాని, ఒక్కొక్క మార్పు వచ్చినప్పుడల్లా వారి సంఖ్య తగ్గిపోతూ వచ్చింది. చివరకు ఆ బంధంతో ఒక్క జంటని మాత్రమే ఇముడ్చుకునే స్థితివచ్చింది. ఇదే ఈనాడు అమలులోవున్న వివాహ పద్ధతి" – అంటాడు, ఫ్రెడిరిక్ ఏంజిల్స్ తన "కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగ యంత్రాల పుట్టుక" అనే గ్రంథంలో (విశాలాంధ్ర ప్రచురణ పుట – 52)

ఈ మధ్యకాలంలో వివిధ దశలలో రక్త సంబంధీకుల పెళ్లి, పునలాన పెళ్లి, జంట పెళ్లి వంటి పేర్లతో ఆ యా నాటి స్త్రీ — పురుష సంప్రయోగ వ్యవస్థకి పేర్లు పెట్టుకున్నాం. పేరు ఏదయినా అది స్త్రీ పురుష సంబంధాల ఏర్పాట్లకు పెట్టుకున్న సంకేతనామం తప్ప వేరుకాదు. అందుచేతనే వివాహ వ్యవస్థ అవసరమా అన్నప్రశ్నకి అర్థంలేదు అనడం. అది మానవ సమాజం మనుగడకు అవసరం. అందుచేతనే దానిమీద సమాజం ముద్ర వుండక తప్పదు. వుంది.

ఆ ముద్ర మన వివాహ పద్దతులరూపంలో, ఆచారాలు, అలవాట్ల రూపంతో వుంటుంది. మనం సాంప్రదాయిక వివాహ పద్ధతి అనేదాంట్లో కులాన్నీ, దానిలోని శాఖల్నీ పాటించాలి. "సమాన వియ్యం" అన్నది వధూవరుల మధ్యకాదు; వారి కులాలమధ్యా, కుటుంబాల మధ్యాగాని, కులాలమధ్యా, కుదురులమధ్యా, కుటుంబాల మధ్యాకూడా అంతరాల్ని పాటిస్తుంది మన సమాజం.

అలాగే సంప్రదాయ వివాహపద్ధతిలో కన్యాదానం, కన్యావరణం వుంది. అందులోని అర్థం ఆ శబ్దాలే చెప్తున్నాయి. కాయనో, కసరునో, చెంబునో, తప్పేలానో ఇచ్చినట్లు తండ్రి కన్యను దానం చేస్తాడు. 'ధర్మ ప్రజాసంపత్యర్థం' ఆ వరుడు స్వీకరిస్తాడు. పిల్లదాని ఇష్టాయిష్టాలతో సంబంధం నిరాకరించే సమాజం మనది. నిరుపమా నిరంజన్ వ్రాసిన 'మాధవి' నవలలోని మాధవి మన వధువులకు తాతమ్మ.

ఈ రెండూ మన సంప్రదాయిక వివాహ పద్ధతికి మూల స్తంభాలు. అది భూస్వామ్యయుగపు సమాజ వ్యవస్థను సూచిస్తుంది. సగోత్ర వివాహ నిషేధాలు, పునర్వివాహ (స్త్రీకి మాత్రమే) నిషేధాలు ఆ సమాజంలోని సంబంధాలకు ప్రతిబింబాలు.

ఈనాడు మనం ఈ నిషేధాలను నిరాకరించడం నూతన సమాజ సంబంధాలకు సూచన. అంతేకాదు. వివాహం కులానికీ, కుదురుకూ, కుటుంబానికీ లోపలనో, బయటనో మాత్రమే వుండాలనే నిబంధనలనూ ఆచారంలోంచి తోసివేస్తున్నాం. ఇదీ ఇంతవరకు పాటిస్తున్న సమాజ నిబంధనలకు వ్యతిరేకమే.

దీనికన్నా ముఖ్యమైనది ఇంకొకటుంది. వధూవరుల యిష్టం, అయిష్టంనుపట్టి వివాహాలు జరగటం, జరగకపోవడం పాటిస్తున్నాం. వివాహ విచ్ఛేదాన్ని ఆమోదిస్తున్నాం. పునర్వివాహాన్ని అంగీకరిస్తున్నాం. వీనికి వున్న పరిమితులూ, ఆటంకాలూ, అటకాయింపులూ సమస్యకాదు, ఇక్కడ. వానిని అధిగమించి, వధూవరుల అంగీకారం వివాహం విషయంలో అంత కంతకు అధిక ప్రాధాన్యం వహిస్తూంది. ఇది నూతన సమాజ ఆవిష్కారానికి సూచన.

ఈ పరిణామదశలో చాలా ముఖ్యమైన కొన్ని మార్పులు వచ్చాయి. అందులో మొదటిది వివాహ సంబంధాల విశ్వవ్యాపకత్వం, ఇంతఃపూర్వపు సమాజాలు విధించిన కుల, మత, జాతి, దేశ పరిధులను అధిగమించి స్త్రీ పురుషులు వివాహ బంధాలు ఏర్పరచు కొనేందుకు అధికారమూ, స్వేచ్ఛనూ వివాహబంధంలో పురుషునితో పాటు స్త్రీకి కూడా సమానస్థాయి, సమాన హక్కున్నూ, తల్లిదండ్రులూ, ఇతర పెద్దలా ఇచ్ఛనుగాక వధువు తన మనోదండిని అమలు జరుపుకోవాలనడమూ, వివాహంలో స్త్రీ సమాన బాధ్యత కలదనడమూ నూతన సమాజ రూపం స్థిరపడుతుందనడానికి సూచనలు.

దీనికి అనుగుణంగా వివాహ పద్ధతిలో, ప్రక్రియలలో సహజంగానే మార్పులు వచ్చేస్తున్నాయి.

నిన్నటి పత్రికలో ఒక వార్త చదివాను. కాన్పూర్‌లో సుమన్‌రాజ్ అనే యువకుడు నీలంచతుర్వేది అనే యువతి చేయిచేయీ కలిపి జీవిత భాగస్వాములు అయినట్లు ప్రకటించారు. అదే వివాహం. దానికి ఏ విధమైన మత సంబంధమయిన తంతు, తతంగాలూ, సమాజ సంబంధ మైన వేడుకలు, ఏమీలేవు. ఇరుపక్షాల పెద్దల అంగీకారంతోనే ఇది జరిగిందని దానికో ఉపశ్రుతి (ట్రైల్ పీస్) వుందనుకోండి.

1930 నాటికే మన వివాహ పద్ధతులు మారవలసి వున్నదనే గ్రహింపు వచ్చింది. ఏవిధంగా మారాలి? ఎందుకు మారాలి? పురోహితవర్గం మారాలి అనుకున్నారు కొందరు. అంతేకాదు వివాహ మంత్రాలూ, ప్రతిజ్ఞలూ మొత్తం తంతు అంతా జనానికి అర్ధంకాని సంస్కృతంలోవుంది. అవన్నీ

తెలుగులో వుండాలన్నారు మరికొందరు. ఈ తతంగం అంతా మరీ ఔడదగావుంది తగ్గించుకొందామన్నారు, మరికొందరు.

1936 ప్రాంతాల నుంచి ఈ వివాహ పద్ధతిని శాస్త్రీయపంథాతో ఆలోచించడం, సర్దుబాటుచేయడం ప్రారంభమైనదనవచ్చు. కన్యాదానం వగైరాలు తొలగించి సభాముఖంలో వధూవరులు దండలు మార్చుకోవడం, ప్రమాణాలు చేయడం వివాహ కార్యక్రమం చేసేరు. సామాజికమైన వేడుకలస్థానంలో, పాత కొత్త వివాహపద్ధతుల తేడాను, మార్పు అవసరాన్ని వివరిస్తూ ఉపన్యాసాలు వచ్చేయి. ఈ పద్ధతిని బలపరిచినదీ, వ్యాప్తిలో పెట్టినదీ కమ్యూనిస్టులు.

మధ్యలో 'స్వేచ్ఛా ప్రణయం' ఒక వాదంగా వచ్చింది. అది ఎక్కువకాలం మనలేదు. విస్తరించనూలేదు.

వివాహపద్ధతితో వచ్చిన ఈ మార్పుతో సాంప్రదాయిక పద్ధతిలో అంతర్గతంగావుంటూ వచ్చిన వైరుధ్యాలను తొలగించడానికి ప్రయత్నం జరిగింది. అయితే ఒకటి మిగిలింది. వ్యక్తిగత ఆస్తిహక్కు ప్రాతిపదికగా సాగుతున్న మన సమాజంలో ఈ నూతన పద్ధతికి చట్టపరమైన బలం కుదర లేదు. అంతవరకూవున్న కుల, మత పరమైన రక్షణ తొలగింది. మనుష్యుల లోని సహజమైన మంచితనం, న్యాయబుద్ధి కొత్తపద్ధతిలో జరిగిన వివాహాలను సమర్థించి కాపాడింది. అంతేగాని వానికి చట్టబలంలేదు. కనుక రిజిస్ట్రేషనును ప్రోత్సహించడం తప్పలేదు.

కొంచెం ఇంచు మించుగా మనం ఈనాడు అనుసరిస్తున్న వివాహ పద్ధతి ఇది.

ఈ విధంగా స్త్రీ పురుషసంప్రయోగ (వివాహం) సమస్యలోవున్న రెండు అంశాలూ — ఒకటి వధూవరులకు మాత్రమే పరిమితమయినదీ, రెండు - సమాజ వ్యవస్థగతిక్రమానికి సంబంధించినది. రెండూ ఈ పది లక్షల సంవత్సరాల కాలంలో ఎన్నో మార్పులకు లోనయ్యాయి. దశా విశేషాన్ని బట్టి నీతి నియమాల నిర్ణయమూ, ఆచారాలు, అలవాట్లు, ప్రమేయమూ

మారేయి. మారుతున్నాయి. మారుతాయి. ఈ మార్పుల్ని సమాజ గతమయిన పరిణామాలూ, దాని అవసరాలే నిర్ణయిస్తాయి.

వివాహం అన్నది పైనుంచి ఎవరో తెచ్చిపెట్టిందికాదు. స్త్రీ పురుష సంబంధాలను సమాజగతికి అనుగుణంగా సరిపుచ్చుకుంటూ సంఘమే-అంటే మనమే - రూపొందించుకున్న నియమాల సంపుటి. దీనిని అల్లాగే చూడాలి.



"మానవ కుటుంబాలు సమాజాన్ని నిర్మించే ఇటుకలు. వాటిని కలిపివుంచే సిమెంటు నీతి."

— హెక్టర్ హోటను

"ఉద్వేగమూ, మేధస్సూ ఈ రెండూ సమష్టిగా వైవాహిక ప్రేమకు గట్టి పునాదిని నిర్మిస్తాయి"

—కార్లిస్ లామాంట్

# వివాహం : వ్యక్తి స్వేచ్ఛ

— సురవరొళి

వివాహం అనేది వ్యక్తిస్వేచ్ఛకు సంకెల అనేది నా నిశ్చితాభిప్రాయం. అయితే ఈ సంకెలను బుద్ధిపూర్వకంగా మానవ జాతి ఎందుకు తగిలించుకున్నదో, ఎప్పుడు తగిలించుకున్నదో పరిశోధకులు ఇదమిద్ధంగా తేల్చి చెప్పలేకపోతున్నారు.

ప్రాణికోటిలో మానవులలో తప్ప ఈ పద్ధతి మరే ప్రాణికిలేదు. మానవులలోకూడా బహుశా తొలి రోజులలో ఉండేది కాదేమో. జాతిని కొనసాగించడం లేదా పరిరక్షించడం ప్రతిప్రాణికి సహజమైన శారీరక ధర్మం. ఈ శారీరక ధర్మనిర్వహణ కొరకే ప్రతి ప్రాణిలోనూ లైంగిక వాంఛ ఉంటుంది. లైంగికవాంఛ తీర్చుకోవడానికి పెట్టిన కట్టుబాటును వివాహం అంటున్నారని కొందరి అభిమతం. అయితే ఎటువంటి కట్టుబాటుకూ లొంగకపోవడం లైంగిక వాంఛయొక్క ధర్మం. ఇనుప కచ్చడాలు బిగించిన రోజుల్లోనూ, సాంఘికంగా, చట్టపరంగా, ధార్మికంగా ఇంకా అనేక విధాలుగా ఎన్నెన్ని కఠినమైన నిబంధనలు చేసినా కట్టుబాట్లు పెట్టినా వివాహబంధాన్ని అధిగమించిన కామవాంఛ మానవుల్లో చావలేదు; చావదు. వ్యాసభారతంలోనిది ఔనోకాదో — కాని ద్రౌపది శ్రీకృష్ణునితో అన్నట్లుగా ప్రచారంలో ఉన్న —

" పంచమే పతి యిస్సంతి మహ్యా షష్ఠోపిరోచతే
పురుషాణా మభావేన సర్వానార్య పతివ్రితాః "

అన్నమాట — (అంటే — కావలసిన మగాడు దొరక్కనే పతివ్రతలుగా ఉంటున్నారు) ఒక్క ఆడవాళ్ల విషయంలోనే కాక మగాళ్ళ విషయంలో కూడా వర్తిస్తుంది.

మొదట్లో వివాహం అనే పద్ధతిలేని రోజుల్లో ఆడదే కుటుంబానికి పెద్దగా వుండేదంటారు. బహుశా ఇది నిజమే కావచ్చుననిపిస్తున్నది.

ఇతర ప్రాణుల్లో సహజ సిద్ధంగా ఉన్న అలవాట్లను పరిశీలిస్తే ఆడది పిల్లల్ని కనడమే కాదు; కన్నపిల్లల వల్ల విస్తృతమైన కుటుంబాన్ని నడపడం కూడా ఆడదే. ఏ ప్రాణుల మందలను తిలకించినా ఆడవి ఎక్కువగా ఉండటం — మొగవి ఒకటో రెండో ఉండటం కనిపిస్తుంది.

వివాహం పుట్టకముందు అలాగే ఉండేదేమో మానవజాతి.

'వివాహం అనేది వ్యక్తి స్వేచ్ఛకు సంకెల' అంటూ నే ప్రారంభించాను ఈ వ్యాసాన్ని. ఈ సంకెల మగాళ్ల స్వేచ్ఛను హరిస్తోందా, ఆడవాళ్ల స్వేచ్ఛను హరిస్తోందా? ఇద్దరి స్వేచ్ఛనూ సమానంగా హరిస్తోందా? అన్న ప్రశ్నలకు సమాధానాలను అన్వేషించాలని బాగా ఆలోచిస్తే – అధ్యయనం చేస్తే తేలేది ఆడవాళ్ల స్వేచ్ఛను ఎక్కువగా హరించడానికే 'వివాహం' ను ఈనాడు నవనాగరిక సమాజంలో అమలులో ఉన్న వివాహపద్ధతిని మగవాడే రూపొందించి ఉంచాడని నా అనుమానం.

ఆడదానికి "అబల" అని మగాడు పేరుపెట్టాడు గాని, శారీరక బల పరీక్షచేసిచూస్తే – మానవుల్లోనే కాదు; ఏ ప్రాణిలో అయినాసరే ఆడదే బలవంతురాలు అని తేలుతుంది. అత్యాధునిక మధ్యతరగతి నాగరిక జీవితాన్ని ఉదాహరణగా తీసుకొని పరిశీలించండి; పొద్దున్నే లేచి, వాకిలూడ్చుకొని, బాసన్లు కడుక్కొని, బెడ్‌కాఫీ భర్తకిచ్చి, పిల్లలను తయారుచేసి బడికిపంపి, భర్తకు స్నానానికి నీళ్ల దగ్గర్నుంచి అన్నీ సమకూర్చి — ఆయనకు పెట్టి తానుతిని — ఇద్దరూ తలో ఆఫీసుకు వెళ్ళి, ఆఫీసులో పనులుచేసుకొని ఇంటికివచ్చి మళ్లీ రాత్రి వంటలూ వార్పులూ చేసి, పక్కలుసర్ది పిల్లల్ని పండుకోబెట్టి, భర్త ప్రక్కలోకివచ్చే ఆడది అలసటఎరుగదు — ఆఫీసులో ఒక్క గంట ఎక్కువ పనిచేస్తే అలసి సొమ్మసిల్లుతాడు మగాడు. ఇటువంటిదాన్ని 'పాదదాసి' గా చేసుకుంటే ఎంతగానో సుఖపడవచ్చునని మగాడు ఈ ఉచ్చు బిగించాడేమో ననిపిస్తుంది.

పెళ్లి దాని పుట్టుపూర్వోత్తరాలను గురించి పరిశోధించినవారు "వ్యక్తిగత ఆస్తి" కోసం పెళ్లి పుట్టిందన్నారు. "వ్యక్తిగత ఆస్తి" కీ పెళ్ళికీ అంతటి అవినాభావ సంబంధం ఉండాల్సినపని లేదనివిస్తోంది.

పైగా పెళ్లివల్ల వ్యక్తిగత ఆస్తిని వ్యక్తి వినియోగించడంలో కూడా వ్యక్తిస్వేచ్ఛకు భంగం కలుగుతున్నదేమో ననిపిస్తున్నది.

మరికొందరు 'యోనిశుచి' పరిరక్షణ కోసం దీన్ని రూపొందించారంటారు. కాని మనకన్నా మన పూర్వీకులే ఈ విషయంలో పురోగాములుగా వున్నట్లు ఆధారాలున్నాయి. ప్రతి బహిష్టు తర్వాత స్త్రీయోని పరిశుద్ధం అవుతుందనీ, పరిశుద్ధంకావడానికి స్త్రీయోనికున్న ఈ సహజధర్మం పురుషులకు లేదనీ పూర్వీకులే అంగీకరించారు.

కామవాంఛను కట్టుబాటులో పెట్టకపోతే సుఖవ్యాధులు వ్యాపించే ప్రమాదం ఉన్నదికనుక వివాహబంధాన్ని సృష్టించి ఉంచారని మరికొందరి నమ్మకం. కాని విచ్చలవిడిగా కామవాంఛ తీర్చుకోవడానికి సుఖవ్యాధులు ప్రబలడానికీ అంత దగ్గరి సంబంధంలేదు. "కాల్ గరల్స్" అనే జారిణులు విదేశాల్లో రోజు ఎందరికో సంభోగసుఖాన్ని పంచిపెడుతూ సుఖరోగాలు తగలకుండా ఉంటున్నారు. పారిశుధ్యపు అలవాట్లు, ఆరోగ్య రక్షణ, చికిత్స ఇవి ఉంటే వాటిని అదుపు చెయ్యవచ్చు. వివాహబంధంతో కాదు. వాటిని వివాహబంధం అదుపు చెయ్యజాలదని ఆచరణలో, అనుభవంలో రుజువైన సత్యం.

వివాహవ్యవస్థ లేని రోజుల్లో మానవజాతి సుఖరోగాలతో తీసిపోయిందని గానీ, మానవనాగరికతా వికాసం జరగలేదని గాని, ఆనాటి మానవ సమాజం ఈనాటికన్నా పతనావస్థలో ఉండేదని గానీ చెప్పడానికి ఆస్కారాలేవీ లేవు.

కనుక 'వివాహం' అనేదాని సృష్టికర్త మగాడే కావాలి; వివాహం మగాడికి అవసరమా ? ఆడదానికా ? ఈనాటి నవనాగరికులను ఈ ప్రశ్నవేస్తే ఆలోచించకుండా టక్కున ఆడదానికేనని సమాధానం చెపుతారు. ఎందుకని ? తండ్రిలేని 'సంతానం 'అంటే, (కుంతీ సుతులంటే) సమాజంలో ప్రచారంలోవున్న చిన్నచూపు; పాతివ్రత్యానికి సమాజంలోఉన్న పెద్దచూపువల్ల. ఈ భావాలను బాగా ప్రచారంచేసి, పసుపు కుంకుమే జీవిత పరమావధి, పతిసేవే సతికి గతి, అన్న భావాన్ని ఆడాళ్లలో సైతం బాగా నాటినవాడు ఈ మగాడే. ఈ అభిప్రాయాలను, ప్రచారాలను ఒక్క నిమిషం విస్మరించి పరిశీలిస్తే వివాహం కావలసింది మగాడికేనని ఖచ్చితంగా చెప్పవచ్చు.

ఇటీవల కొన్ని పరిశోధనలు జరిగాయి. 1981 తొలిరోజుల్లో న్యూయార్క్‌లో "డోగ్లాస్‌నాతేస్" నాయకత్వంలో ఒక పరిశోధకుల బృందం తమ పరిశోధనా ఫలితాలను ప్రకటిస్తూ శిశువు అణువణువునా సాగే పాత్రిబప్రక్రియకు కావలసిన జన్యపదార్థన్నంతటినీ (DNA) తల్లి గర్భమే సరఫరా చేయగలదని ఉద్ఘాటించారు. అందువల్ల వివాహంకాని ఆడదాన్ని, కట్టుకున్నవాడు లేడు కనుక అసంపూర్ణ వ్యక్తి అనడం అశాస్త్రీయమన్నారు. మగాళ్లు ప్రచారంచేసిన పైభావాలు లేకపోతే, ఏ మగాడితోనైనా సంభోగించి, స్త్రీ సంతానం కనవచ్చు; పెంచవచ్చు; పోషించవచ్చు; స్త్రీ శరీరంలో ఇందుకు కావలసిన శక్తి - అవయవాలూ, లక్షణాలూ అన్నీ ఉన్నాయి. మగాడికి అలాకాదు; కొడుకు కావాలంటే పెళ్లి చేసుకోవలసిందే; పెళ్లి లేకుండా కామవాంఛ తీర్చుకోగలడు గాని మగవాడు సంతానం పొందలేడు. అందుకని ఈ బంధాన్ని సృష్టించి శాశ్వతం చేసుకున్నాడేమో ననిపిస్తుంది.

ఈ బంధాన్ని ఎంత శాశ్వతం చేసుకున్నాడంటే - తన మరణం తర్వాత కూడా తెగకుండా బిగించాడు. "జన్మజన్మల బంధం" అని కథల్లల్లాడు. కల్పనలు చేశాడు. కవిత్వం, కావ్యాలూ, ప్రణయ గీతాలురాసి, సంకెల వేయించుకొనేది దాన్ని సంకెలగాకాక సౌభాగ్యంగా, దాస్యంచేసేది తాను చేసేది దాస్యంకాక ధర్మంగా, అది లేకపోవడం అవమానకరంగా భావించేంతగా నూరిపోశాడు; అలా నూరిపొయ్యకపోతే, అంత గట్టిగా కట్టుదిట్టంగా ఈ అబద్ధాన్ని నిబద్ధి చెయ్యకపోతే తనకన్నా శారీరకంగా బలవంతురాలైన ఆడది, తనకూ, తన మరణం తర్వాత తన సంతానానికి తరతరాలదాకా దాస్యంచేస్తూ ఎలా ఉండగలదు?

ఒక సందర్భంలో డాక్టర్ రామ మనోహరలోహియా గారన్న మాటలను ఇక్కడ ఉదహరిస్తాను. "అసలు పాపమనేది ఏదైనావుంటే, ఈనాడు జరుగుతున్న వివాహాలకూ, వివాహానంతర జీవితానికీ మించిన పాపం మరేదీలేదు" అని.

వివాహబంధంవల్ల మానవుల కామవాంఛ కట్టుబాట్లకు లొంగలేదని, లొంగబోదని, వివాహపు కట్టుబాట్లను అతిక్రమించి కామవాంఛ తీర్చుకోవడం సర్వత్రా సాగుతూనేవున్నదని గమనించాం. స్త్రీ - పురుష ఆకర్షణ

సర్వకాల సర్వావస్థలలోనూ ఒకేరకంగా ఉండదనికూడా చూసాం. 'మోజులు' తీరుతుంటాయి; కొత్తవి మొలకెత్తుతుంటాయి.

అలాగే వివాహం చేసుకోలేక పోయినట్లయితే యువతీయువకులంతా విచ్చలవిడిగా, కామవాంఛ తీర్చుకుంటూ వుంటారనే భావంకూడా సరైంది కాదు. జీవితంలో 24 గంటలూ ప్రాణులకు ఇదేయావ ఉండదు. ఆహార, నిద్రా, భయ, మైథునాల్లో ఈ యావది నాలుగోస్థానం. వైఖరిపైనా, నిమగ్నతపైనా తీరికపైనా ఇంకా అనేకవిధాల వాతావరణాలపైనా ఈ కోరిక ఆధారపడి ఉంటుంది.

శారీరకంగా బలవంతురాలైన ఆడది, ఏవో బలహీన క్షణాల్లో ఉండగా మగాడు దానికి పెళ్లి ఉచ్చును బిగించిఉంటాడు. శారీరకంగా బలవంతుడు కాకపోయినా మగాడు ఆడదానికన్నా ఆక్రమణ వైఖరి ఎక్కువగా ఉండే వాడు; కనుక, గర్భవతిగా ఉన్నప్పుడు బాలింతగా వున్నప్పుడు అండదండలు అవసరమైన ఆడది ఈ ఉచ్చుకు లొంగిపోయి వుంటుంది.

'స్త్రీ స్వాతంత్ర్యం' కావాలని కోరేవారు వివాహ వ్యవస్థను రద్దు చేస్తేతప్ప అది దుర్లభమని గుర్తించాలి.

'వివాహం' అనేదాన్ని అట్టేపెట్టినందువల్ల మానవజాతికి ఒరిగే ప్రయోజనం ఏమీలేదు — సరే దాన్ని రద్దు చేసినట్లయితే పూర్తిగా నామ రూపాలు లేకుండా ధ్వంసం చేసినట్లయితే మానవజాతికి కలిగే ప్రయోజనాలు ఏమన్నా ఉన్నాయో లేదో పరిశీలిద్దాం.

'వివాహం' రద్దయితే కలిగేగొప్ప ప్రయోజనం మానవుల్లో వికసించే ధైర్య సాహసాలు, తెగింపు. ఈనాడు 99 శాతం సగటు మానవులు సమాజంలో ప్రతినిత్యం, ప్రతిక్షణం జరుగుతున్న అన్యాయాలకు — అక్రమాలకూ వ్యతిరేకంగా తిరగబడకపోవడానికీ, అవినీతి — అక్రమాలతో అనుక్షణం రాజీపడుతూ, బ్రతుకులు కొనసాగిస్తూ వుండ టానికీ ప్రధాన కారణం ఈ వివాహబంధమే. వివాహబంధంతో ఆడదాన్ని బానిసను చేసుకున్న మగాడు, దాన్ని కాపాడుకోవడానికి సమాజానికి బానిస అయిపోతున్నాడు. ఆడదాని వ్యక్తిస్వేచ్ఛను కట్టడిచేసి తాను కట్టుబడిపోతున్నాడు. విప్లవాలు రాకపోవడానికీ, అన్యాయం యధావిధిగా

కొనసాగడానికీ, సమాజంలోని ఇంకా ఎన్నో అనర్థాలకు ఈ వివాహబంధమే మూలకారణం.

ఈ బంధం రద్దయితే కలిగే రెండో ప్రయోజనం పరిపాలనా స్వేచ్ఛత. ప్రఖ్యాత గ్రీకు తత్వవేత్త పాలకులు పెళ్లి చేసుకోవద్దని ఏనాడో రాశాడు. ఆయన కాలపు పాలకులు మగవారే; ఇప్పుడు ఆడవారుకూడా పాలకులుగా ఉంటున్నారు కనుక — తల్లులు కాదలచుకున్నవారు పాలకులు కావద్దని, పాలకులు కాదలచుకున్నవారు తల్లులు కావద్దని కూడా సూత్రీకరించాల్సి వస్తుంది.

ఇప్పుడు సమాజంలో స్థిరంగా నాటుకొనిఉన్న అభిప్రాయాలను కాదని వివాహవ్యవస్థ రద్దుకాదు. అయితే ఈ యుగంలో ఇందు అనుకూలత చాలా ఉన్నది. గర్భధారణ మానవుల గుప్పిట్లోకి వచ్చింది. ఇష్టానిష్టాలతో నిమిత్తం లేకుండా గర్భధారణ జరిగే రోజులు పోయినై. కనుక వివాహవ్యవస్థ రద్దుకోసం మానవజాతి, ముఖ్యంగా మహిళాలోకం ఉద్యమించడానికి ఇది మంచితరుణం.

వివాహాన్ని పూర్తిగా రద్దుచేసే దశలో మొదటి దశగా మాతృస్వామ్య కుటుంబాల వికాసాన్ని ప్రోత్సహించవచ్చు ; ఆస్తిహక్కు పూర్తిగా స్త్రీ పరం చేయడం ద్వారా, కుటుంబ యాజమాన్యాన్ని ఆమెకప్పగిస్తే మానవజాతి బాగా వికసించగలదనడంలో సందేహంలేదు.

క్రమంగా ప్రతివ్యక్తి తన పేరుతో తండ్రి పేరుకు బదులుగా తల్లి పేరు ధరించే పరిస్థితి రావాలి ; దీనితోబాటే — 'కులట' అన్న పదం స్థానంలో "కులటుడు" అనే పదం ; "కాల్ గరల్" అన్న పదం స్థానంలో "కాల్ బోయ్" అన్న పదాలు వాడుకలోకివచ్చి "లంజ కొడుకులు" అన్న పదం పూర్తిగా మాయమైపోయే దిశగా మానవ నాగరికత వికశిస్తే ఎంత బాగుండును ?



# వివాహం మత తంత్రా?
# లేక
# స్త్రీపురుషుల కలయిక సంబంధమా?

— మమతా లక్ష్మన్న

(ఆంగ్లంలో శ్రీమతి లక్ష్మన్న వ్రాసిన పరిశోధనా వ్యాస సంగ్రహ పాఠం ఇది).

గృహస్థాశ్రమంలో అడుగిడటానికి ప్రతివ్యక్తి విధిగా చేయవలసిన లాంఛనాయుత కార్యక్రమము, మత తంతు ఈ రెండూకలిసి హిందూ వివాహ సారమని చెప్పవచ్చు. (ప్రభు 1954)

ధర్మమూ, ప్రజ (సంతానం), రతి (సుఖ ప్రాప్తి) ఈ మూడూ పైన చెప్పిన వరుస క్రమంలో హిందూవివాహ లక్ష్యాలు (కపాడియా 1972). హోమము, పాణిగ్రహణం, సప్తపది ముఖ్యమైన మత సంబంధమైన ఆచారాలు. (కపాడియా 1972)

భారతదేశంలోని ముస్లిం సమాజంలో వరుని కుటుంబం వారు వధువు ఇంటికి 'పైఘం' పంపుతారు. ఆ ప్రతిపాదనను వధువు కుటుంబం వారు అంగీకరిస్తే 'మహర్' (వరుడు ఇచ్చే శుల్కం) విషయమై ఇరుకుటుంబాలు ఒప్పందానికి వస్తాయి. నికా (పెండ్లి) కు తేది నిర్ణయం అవుతుంది. ఆ రోజున వరుడు తన బంధువర్గంతో కలిసి వధువు ఇంటికి వెళ్తాడు. 'కాజి' ఇద్దరు సాక్షులతో వధువు సమ్మతిని లాంఛనాయుతంగా తీసుకుంటాడు. తరువాత వరుని సమ్మతిని గ్రహిస్తారు. ప్రార్థన జరగటం, ఇస్లాం మతంలో అంతకు క్రితం జరిగిన ప్రసిద్ధిచెందిన వివాహాలను గురించి ముచ్చటించడం జరుగుతుంది. తరువాత వివాహాన్ని ధృవపరుస్తాడు కాజీ.

"స్త్రీకి మహమ్మదు తక్కువ స్థానాన్ని కేటాయించాడు. ఆమెకు భర్తసేవే పరమావధి. ఒక్కగంట కూడా, వ్యవధిలేకుండానే ఏ కారణం చెప్పకుండానే అతడు ఆమెను పరిత్యజించవచ్చు. ఆమెకు విడాకులిచ్చే అతని అధికారం సంపూర్ణమైనది; ఎవరూ ప్రశ్నించ వీలులేనిది. అలాంటి అధికారం ఆమెకు ఇవ్వబడలేదు. భర్తకు అలా ఇష్టమయితే, ఆమె అలా అయిష్టంగా, నిరాదరణకు గురిఅయి, లేక మరో సవతినిపొంది, భర్తకు దాసురాలిగా జీవయాత్ర సాగిస్తుంది." (విలియం మెయిర్)

క్రైస్తవమతంలో వివాహం ఏక పత్నీకం, ఏక భర్తృకం; అది జీవితాంతము కొనసాగవలసినది. విడాకులను అనుమతించదు ఆ మతం. వివాహమయిన తరువాత భార్య తన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని కోల్పోతుంది; భర్త పేరును వాడాలి. విడాకులకు వీలులేదు కనుక, పురుషులు ఉంపుడు కత్తెలను చేపట్టే ఆచారం వెలిసింది. ఎనిమిదవ హెన్రీ రాజు పోప్‌తో సంబంధం త్రెంచుకున్న తరువాత భార్య కాధరినుకు విడాకులిచ్చి మరల వేరొక వనితను వివాహమాడాడు. స్త్రీలకు ఆనాడు ఆస్తిహక్కులేదు; పౌర సత్వాలు లేవు. ఇది అసమ్మతి ప్రదర్శనలకు దారితీసింది. అనేక దేశాలలో కోర్టులద్వారా విడాకులిచ్చే పద్ధతి అమలులోనికి వచ్చింది. అలాగే భారతదేశంలో శాసనపరంగా విడాకుల వెసులుబాటు కల్గింది.

**జీవిత సహచరుల ఎంపిక:-** ఈ విషయంలో విధి నిషేధా లున్నాయి. ఫలాని కులంలోనే వివాహం చేసుకోవాలని, ఒకే గోత్రంలో వారిని, సపిండులను, ప్రవర కలవారిని వివాహమాడరాదనే సూత్రాలు హిందూ వివాహ పద్ధతిలో బలంగా ఉన్నాయి. ఈ ఆచారాన్ని ఉత్తర భారతదేశంలో ఖచ్చితంగా పాటిస్తారు. దక్షిణాదిన మేనరికాలు, మేనమామను వివాహమాడటం ఆచారంగా వస్తుంది; అంతేకాదు, ఇలాంటి సంబంధాలను ఎక్కువగా ఆదరించడం జరుగుతున్నది. ఏ కుటుంబాల పిల్లలను వివాహ మాడరాదో మనువు నిర్దేశించాడు. ధర్మాన్ని తృణీకరించేవి అంటే సామాజిక బాధ్యతలను, వ్యక్తిగత బాధ్యతలను నెరవేర్చనివి, వేదాధ్యయనం లేనివి అంటే మతాన్ని అంగీకరించనివి, ఆ కుటుంబ సభ్యులలో ఎవరికైనా కుష్టు,

మూర్ఛ లాంటి వ్యాధులుంటేను ఆ కుటుంబాల పిల్లలను వర్జించాలి. ఇలా ఎన్నో లక్షణాలను వివరించాడు మనువు.

**వివాహ వయస్సు :-** హిందూ వివాహ శాస్త్రజ్ఞులు, శాసనకర్తలు వయస్సు విషయంలో వరాధిక్యత ఉండాలని నిర్దేశించారు. ముప్పది ఏండ్ల పురుషుడు 12 ఏండ్ల బాలికను వివాహమాడాలని మనువుచెప్పాడు. ముప్పదేండ్ల పురుషుడు పదేండ్ల పిల్లను పెండ్లాడాలని భీష్ముడు ధర్మరాజుకు ధర్మోపదేశం చేశాడు. వాత్స్యాయనుడు బాల్య వివాహాలను నిరసించి వధువుల శారీరకంగాను, మానసికంగాను పరిణితులు కావాలన్నాడు. వరుని వయస్సు విషయంగా అందరూ 24, 25 ఏండ్లు దాటాలన్నారు. వధువు వయస్సును గురించి అభిప్రాయ భేదాలున్నాయి. క్షత్రియులలో స్వయంవర పద్ధతి ఆచారమయింది. మగపిల్లలకు బాల్య వివాహాలు చేయటం తరువాత వచ్చిన సంప్రదాయం.

ముస్లిం సమాజంలో వివాహం సర్వత్రా ఆచరణ యోగ్యమయినది. బ్రహ్మచర్యాన్ని ఆ మతం ప్రోత్సహించదు. 15 సంవత్సరాల వయస్సు వచ్చినవారు ఎవరైనా వివాహమాడవచ్చును. ఏమైనా, ఇరువురి సమ్మతి అవసరం. ముస్లిం పురుషుడు ముస్లిమేతర స్త్రీని వివాహమాడవచ్చును. కాని ముస్లిం స్త్రీ ఇతర మతస్థుని పెండ్లాడరాదు. మైనర్లు, మానసిక శక్తి లేనివారు సంరక్షకుల అనుమతితో వివాహబంధంలో ప్రవేశించవచ్చును.

బౌద్ధమతంలో వివాహం సామాజిక ఒప్పందం. చాలా నిరాడంబర మైన తంతు ఉంటుంది. ఇరువదిఏండ్ల వయస్సు దాటిన స్త్రీ తన ఇచ్ఛ వచ్చిన పురుషుని భర్తగా స్వీకరించవచ్చును.

వివాహం ఇరువురు వ్యక్తులమధ్య సంబంధమేకాక వధువును వరుని కుటుంబంలో ఆమోదంతో చేర్చుకోవడమూ, ఆమె ఆ కుటుంబానికి చెందడం ప్రాధాన్యత వహించాయి. 'పతివ్రత' భావం పెరిగి బాల్య వివాహాలు, కన్యాత్వరక్షణ పెరిగాయి.

'కులీనులు' అనేక మంది స్త్రీలను పెండ్లాడటము బెంగాలులో అమలులో ఉండేది. కేరళలో నాయరు కుటుంబాలలో ఈ పద్ధతి ఒకప్పుడు

ఉన్నది. కొన్ని తెగలలో, కులాలలో మొదటి పెండ్లివిందు వినోదాలతో, మత విధులతో జరిపిస్తారు; తరువాత భర్త భార్యను పైకం గాని, వస్తువు గాని తీసుకొని ఇతరులకు మార్పిడి చేయవచ్చును. అలా ఆమెను భర్త విక్రయిస్తాడు. (DUMONT 1970)

ఇదంతా పరిశీలిస్తే వివాహానికి సంబంధించిన మత తంతులన్నీ స్త్రీకి తక్కువ హోదాను ఇచ్చినట్లు తెలుతుంది. బహుశః ఋగ్వేద కాలంలో స్త్రీలు విద్య నభ్యసించగలిగి పండితులు కాగలిగిన పరిస్థితిలో వారికి ఈనాటి కన్న ఎక్కువ హోదా ఉన్నదేమో! అలాంటి స్త్రీలు వివాహమాడేవారు కారు. వారిని 'పుత్రికలు' అని పిలిచేవారు. కాలం సాగిపోయిన కొలదీ ఆమెను శూద్రస్థితికి తేవడం, పెండ్లితో ఆమెకు ఉద్ధరణ జరగడం గమనించాలి. భర్తతో కలిసి మతవిధుల నిర్వహణలో పాల్గొనే అర్హత ఆమె భార్యగా సంతరించుకుంటున్నది. ఈ మత తంతులన్నీ పురుషాధిక్య సమాజ చిహ్నాలే. ఇంటినీ కుటుంబాన్ని చూచుకోవడం, మతపరంగా భర్తకు సాయపడటం ఆమె విధ్యుక్త ధర్మాలు. స్త్రీలను దేవతలుగా పేర్కొనటం, 'శక్తి' గా అభివర్ణించటం జరుగుతున్నది. ఏదైనా ఆమెను పురుషునితో సరిసమానమైన వ్యక్తిగా చూడలేదని దీనివల్ల కూడా తెలుతుంది.

కాలక్రమేణ ఈ మతతంతులు అర్థంలేనివై పోతున్నాయి. ఏమి వాగ్దానాలు చేస్తున్నారో తెలియకుండానే ప్రతిజ్ఞలున్న మంత్రాలను ఉచ్చరించడం, పెండ్లి తంతును కొనసాగించడం ఈనాటి వివాహాలలో కన్పడుతున్నది. తమకంటే అధికులను అంటే కులీనులను వివాహమాడే పద్ధతి ఫలితంగా వరునికి కానుకలతో మొదలయి వరకట్నంతో ఆగి పోయింది. మొదటినుంచీ స్త్రీ ఎవరో ఒకరి సొత్తుగా పరిగణింపబడి, బరువు భారంగా ఎంచబడేది. అవకాశం దొరకగానే వదిలించుకోవలసిన వస్తువు ఆమె. భర్త ఇంటిలో ఆమె పరాయిది. తన భర్త కుటుంబానికి సేవ చేయడమే ఆమె విధి.

**వివాహ వ్యవస్థ యొక్క భవిష్యత్తు :-** ఎన్నో సంవత్సరాల పోరాట ఫలితంగా మనం ఆధునిక విలువలను సంతరించుకోగలిగాము.

వాటి కనుగుణంగా, వర్తమాన కాలానికి తగినట్లు వివాహ వ్యవస్థలో పెద్ద మార్పులు చేస్తేనే అది మనగలదు.

ప్రప్రథమంగా అది సరిసమానస్తులమధ్య కలయిక కావాలి. అంతే కాని స్త్రీని భర్తకు దానంచేయటంకారాదు. భర్త చేత, అతని కుటుంబీకులచేత వస్తువుగా ఎంచబడి, నిరాదరణచేయబడే పరిస్థితి పోవాలి. సమానస్తుల మధ్య సంబంధమయితే అది ఇరువురి న్యాయమైన స్వేచ్ఛాయుతమైన సమ్మతిపై ఆధారపడాలి. అవతలి మనిషియొక్క కుటుంబ సభ్యులను గురించి తెలుసుకోవడం అవసరమే కావచ్చును. కాని ముఖ్యమైన అంశాలు వధూవరులకు సంబంధించినవి. ఇరువురిమధ్య సఖ్యతకు అవకాశం ఉందా, ఒకరిపై మరొకరు శ్రద్ధవహించగలరా, ఒకరికోసం మరొకరు ఎంతవరకు త్యాగం చెయ్యగలరు, ఒకరిని మరొకరు ఎంతవరకు త్యాగం చెయ్యమని ఆశించకుండా ఉండగలరు; ఇవి ప్రధానమయిన ప్రశ్నలు. మత వివాహం కావాలనుకునే వారికోసం మత వివాహం ఆచారాలు మార్చాల్సి ఉంటుంది. మత పద్ధతిలో వివాహం జరిగినా, మతేతర విధానంలో పెండ్లి అయినా ప్రతి వివాహాన్ని రిజిష్టరు చేయించాలి. ఇది సర్వేసర్వత్రా అన్ని మతాలవారికీ, కులాలవారికీ వర్తించాలి. ఇది పెండ్లి విషయమైన రికార్డును భద్రపరచటమే కాక బాల్య వివాహం, బహు భార్యత్వం, వరకట్నం, బలవంతంగా బాలికలను పెండ్లి చేసుకోవటం లాంటి దురాచారాలను అరికట్టుంది. విడాకుల విషయంగా ఉన్న శాసనాలను మార్చాలి.

అంతమాత్రాన పాశ్చాత్యుల పద్ధతులను ఆమోదిస్తే సమస్య పరిష్కార మవుతుందని ఆశించరాదు. సనాతన సంప్రదాయ ఆచారాల కంటే అవి ఏమంత మెరుగుగాలేవు. ఈనాడు పాశ్చాత్య ప్రపంచంలో వివాహవ్యవస్థ విషయమై సలహాలిచ్చేవారి హితబోధలను గమనిస్తే అవి మనువు శాసించిన ధర్మాల లాగానే ఉంటున్నవని తేలుతుంది. దాంపత్య జీవితంలో ఆనందం సాధించాలంటే సకాలంలో పెండ్లి జరగాలని, మత పరమైన వివాహాలు ఎక్కువ కాలం మనగల్గుతున్నాయని పైగా ఆనందదాయక మవుతున్నాయని చెప్తున్నారు. సంప్రదాయ సిద్ధమైన పునస్సంధానం, తృప్తి కరమైన నివాసం, ఎక్కువ ఖర్చుతో పెండ్లి, వివాహత్పూర్వం సలహా పొందడం,

సరియైన కారణం ఉంటే వివాహం ముందుగా మానుకోవటం, ఇరువురి కుటుంబాలు సమ్మతించడం, ఇరుకుటుంబాలు ఇంచుమించుగా పోలికలున్న కుటుంబ పరిస్థితులు కలిగి ఉండటం, సమాన హోదాతో ఉండటం ఇవన్నీ తోడ్పడే అంశాలని సలహాలు ఇస్తున్నారు. (గ్లోవర్) ఇందులో కొన్ని అంశాలు నిజం కావచ్చును. కాని దాంపత్యంలో ఆనందం ప్రాప్తించటానికి ఇవి ముఖ్య ప్రాతిపదికలు కావు. ఇరువురు జీవిత భాగస్వాములు తమ వ్యక్తిత్వాలను పెంచుకోవటానికి సుసంపన్నం చేసుకోవటానికి అవకాశము ఉన్నపుడు, ఒకరు పెదగడానికి మరి యొకరు సాయపడుతున్నపుడు, ఒకరి అభివృద్ధి మరొకరికి నష్టదాయకం కానపుడు, ఇరువురు తమ పిల్లలకు చుట్టూ ఉన్న సమాజానికి తోడ్పడుతున్నపుడు, ఇద్దరినీకలిపేది ప్రేమ పరస్పరానురాగమూ అయినప్పుడు, ఒకరి పెత్తనానికి అధికారానికి మరొకరు లొంగివుండవలసిన అవసరం లేనపుడు మాత్రమే, వర్తమానకాలపు వివాహం ఆనందప్రదమవుతుంది. మేరీ స్టోప్సు అన్నట్లు "ఆధునికవివాహం భాగస్వాములకు ఇతోధిక స్వేచ్ఛను ఇస్తున్నప్పటికీ, స్త్రీ యొక్క వ్యక్తిత్వాన్ని కుంచించేదిగాను పురుషులకు విసుగుపుట్టించేదిగాను ఉన్న కుటుంబ పరిధినిమించి వారిద్దరిని ఉన్నతస్థాయితో సన్నిహితంచేసే పనులు ఆసక్తులను ఇరువురిమధ్య ఏర్పరుస్తుంది. స్త్రీ యొక్క స్వేచ్ఛా పరిధి, ఆమె వ్యాసంగాలు సంవత్సర సంవత్సరానికీ పెరుగుతున్నాయి; అయినా వివాహం సామాన్యంగా మేధాజీవితానికి చరమగీతం పాడుతున్నది. పురుషులతోపాటు సమంగా స్త్రీలకు మానసికాభివృద్ధికి స్వేచ్ఛావకాశాలు కలిగిన నాడే వివాహం ఉన్నతస్థాయికి చేరుకోగలదు.

ఈనాడు ఎక్కువమంది స్త్రీలు సృజనాత్మక కృషిని వాంఛించటం లేదంటే, తమ సృజనాశక్తిని ఎలా వినియోగించాలో వారికి తెలియదంటే మనిషిని బలవంతంచేసి అణగద్రొక్కే గతకాలపు ప్రభావాలకు లోనవు తున్నామనే దానికి అవి చిహ్నాలుగా పరిగణించవచ్చును".

# అనుబంధం

పరిశీలించబడిన గ్రంథాలు :-


1. PRABHU, P.N. : HINDU SOCIAL ORGANISATION
POPULAR Book depot, BOMBAY 1954.
2. KAPADIA, K.M. : MARRIAGE and FAMILY in INDIA
oxford university press, DELHI 1972.
3. SUR, A.K. : SEX and MARRIAGE IN INDIA
Allied Publishers, CALCUTTA. 1973.
4. LAKSHMANNA, C. : CASTE DYNAMICS IN VILLAGE INDIA
Nachiketa Publications, BOMBAY 1971.
5. Dr. LELARD and GLOVER : How to Marry SOMEONE YOU CAN LIVE WITH ALL YOUR LIFE.
Vikas Publishing House Private Ltd.
NEW DELHI.
6. STOPES, Dr. MARIE : MARRIED LOVE
Allied Publishers Private Ltd.
BOMBAY 1966.
7. D' SOUZA, ANTHONY : HAPPINESS IN MARRIAGE
Indian Social Institute, Lodi Road,
NEW DELHI.
8. DUMONT, LOUIS : HEMO HIERARCHIS,
Vikas Publications, DELHI 1970.
9. TOWARDS EQUALITY : REPORT OF THE COMMITTEE ON THE STATUS OF WOMEN IN INDIA,
Government of India 1974.


—)o(—

# వివాహ వ్యవస్థ: ఆవశ్యకత

— జె. కమలాబాయి

సామాజిక జీవితంలో వివాహం ఒక ముఖ్యమైన వ్యవస్థ. మానవ చరిత్రలో పరిణామ ఫలితంగా ఈ వ్యవస్థ ఏర్పడింది. స్త్రీ పురుషులు కలిసి సంసారమేర్పరచుకొని, భావిపౌరులను తీర్చిదిద్ది, క్రమపద్ధతిలో సంఘాన్ని పెంపొందించడానికి వైవాహిక జీవితం అవసరమైంది. కేవలం సృష్టి కొనసాగించడానికో, లేక ప్రకృతి సిద్ధమైన లైంగిక వాంఛలను తీర్చు కొనుటకో మాత్రమే కాక స్త్రీ పురుషులమధ్య ఒక విధమైన బంధమూ, అన్యోన్యత, సహకార భావమూ, కష్టసుఖాలలో భాగస్వామ్య మనస్తత్వం ఇవన్నీ వివాహానికి ప్రాతిపదికలు. సామాజిక నియమబద్ధతకు దారితీస్తుంది వివాహం.

మన దేశంలో వివాహాలు చాలావరకు పెద్దలు ఏర్పాటు చేస్తున్నవే. ఇటీవల వధూవరుల ఇష్టాఇష్టాలను తెలిసికొని పెళ్ళిళ్ళు చేయడం జరుగుతోంది. ఏదైనా తమ సంతానంయొక్క బాగోగులను మనస్సులో వుంచుకొని, వారి సుఖసంతోషాలను ఆశించి వారికి తగిన వధూవరులను ఎంపిక చేయడం గమనిస్తున్నాం. ఇటీవల యువతీ యువకులు పరిచయాలు పెంచుకొని, పరస్పరాభిమానాలు వృద్ధిచేసుకొని, ప్రేమ వివాహాలు చేసుకోవడం పరిపాటి అయింది. ఈ పద్ధతులన్నింటిలో తోడూ నీడల కోసం ఆరాటం కొట్టొచ్చినట్లు కనపడుతుంది. స్త్రీ పురుషులు ఉద్యోగాలు చేసుకుంటూ కొంచెం వయస్సు ముదిరిన తర్వాత, తోడుంటే బాగుంటుందని భావించి, వివాహతంతు లేకుండా కలసి నివసిస్తే తప్పేమిటని కొందరు ప్రశ్నించవచ్చు. విదేశాల విషయం ఎలావున్నా, మనదేశంలో ఈ పద్ధతి ప్రస్తుతం చాలా ఎబ్బెట్టుగాను, అవాంఛనీయంగానూ వుంటుంది. ఈరకపు సమష్టి జీవితంలో అన్యోన్యత జీవితాంతం వుంటుందని వూహించినా అది ఎక్కడోగాని సంభవించదు. ముమ్ముందు అవిద్య అంతటా నశించి, సంఘ పరిస్థితులన్నీ వేరేవిధంగా మారితే చెప్పలేము కాని ప్రస్తుతం ఇది అనుసరణీయం కాదు.

మానవజాతిలో పిల్లలకు పది, పదిహేను సంవత్సరాలు నిండేవరకు తల్లిదండ్రుల అండదండలు అవసరం. జంతువులలో, పక్షులలో, తదితర మానవేతర జాతులలో ఇంత కాలవ్యవధి అవసరంలేదు. సంతానాన్ని సరిగా పెంచే నిమిత్తం ఆ జాతులలో స్త్రీ పురుషబంధం స్థిరరూపం పొంద నక్కరలేదు. మనుష్యులలో అలాకుదరదు. తల్లిదండ్రుల ప్రేమాభిమానాలు పిల్లలకు చాలా అవసరం. కనుక మానవజాతికి వివాహబంధం ఆవశ్యకం. 'తల్లి మాత్రమే పిల్లలను ఒంటరిగా పెంచలేదా?' అనే ప్రశ్న ఉదయించ వచ్చును. అది అసాధ్యంకాదు. కాని దానివల్ల అనేక ఇబ్బందులు కల్గుతాయి. పిల్లలు అనేక మానసిక అనుబంధాలకు, ఆపేక్షలకు దూరమై పోతారు. తద్వారా చాలా బాధ్యత తల్లిమీదనే పడుతుంది. పిల్లలు పెరిగి పెద్దవారైన తర్వాత వేరుగా కాపురం వుంటుంటే తల్లి ఒంటరి దవుతుంది. వృద్ధాప్యంలో తోడులేకుండా వుండవలసి వస్తుంది. పిల్లల మీద ఆధారపడదామంటే వాళ్ళ బాధ్యతలు, ఇబ్బందులు అడ్డురావచ్చును. అప్పుడు భర్త అన్నవాడుంటే ఈ బాధలు ఇద్దరికీ తగ్గుతాయి. పూచీలూ, పనులూ, విభజించుకొని వివాహమైన స్త్రీ పురుషులు ఒక ఇంట్లో కాపురం చేస్తూ పిల్లలను పొందితే ఇవన్నీ వారిద్దరికీ ఆసక్తిదాయక విషయా లవుతాయి. తల్లిదండ్రులమధ్య మమతానురాగాలతో కూడిన సంబంధం ఏర్పడి వారివారి బాధ్యతలు వారికనుక్షణం గుర్తుకు వస్తాయి. కనుక తమ శ్రేయస్సుకోసం స్త్రీ పురుషులు వివాహమాడటం కర్తవ్యమవుతుంది.

ప్రతి వ్యక్తి జీవితంలోనూ ఎప్పుడో ఒకప్పుడు నిరాశ, నిస్పృహ కలుగక మానవు. ఈ స్థితికి వయస్సుతో నిమిత్తంలేదు. చిన్న వయస్సులో కాని లేదా వృద్ధాప్యంలో కాని ఈ భావాలు పొడసూపవచ్చును. అందువల్ల పరస్పర సహకారం ద్వారా వాటిని అధిగమించే నిమిత్తం స్త్రీ పురుషుల మధ్య స్థిరమైన సంబంధం కావాలి. వివాహబంధంవల్ల అది సిద్ధిస్తుంది. సకాలంలో — మనస్సుకు తోడు కావాలనిపించినప్పుడు — వివాహమాడి సుఖ జీవితం సాగించుట మానవజాతికి ఉత్కృష్ట ధర్మం. కనుక వివాహ వ్యవస్థ వాంఛనీయమనక తప్పదు.



# కులంలో పెండిండ్లు నిషేధించాలి

— ఏ. కోమల

సమాజంలో కులం ఎంతో భీభత్సాన్ని సృష్టిస్తున్నదని అనేకమంది చెప్తూంటే వింటున్నాం. కాని అలా బహిరంగంగా వారు చేసిన ప్రకటనలను వారే ఆచరణ సందర్భంగా వ్యతిరేకిస్తున్నారు. మానవ జీవితంలో కులం అనేది పట్టుకువేళ్ళాడే జాడ్యం. దానికి మందు మనకు ఇంకా అందుబాటు లోకి రాలేదు.

ఏ వ్యక్తి అయినా జాతి, మత, ప్రాంత, కుల భావాలను అధిగమించి నపుడే, ఆ నిజాయితీ అతనికి లేక ఆమెకు ఉందా అనేదానికి వివాహం నిర్ణాయక పరీక్ష. ఈ ఇరుకు అడ్డంకులను దాటడానికి తాము ఇష్టపడు తున్నామని కొంతమంది తరచు ప్రకటిస్తుంటారు. వివాహం దగ్గరకు వచ్చేటప్పటికి తియ్యటి సాకులతో తప్పించుకొని కుటుంబ పెద్దలమీదనో, లేక అవతలి పెండ్లివారిమీదనో నెపం వేస్తారు. కుల వ్యవస్థ మనజాతి జీవనంలో నరనరాన జీర్ణించిపోయి ఉన్నందున మాటలు చెప్పినంత తేలిక కాదు చేతలలో దానిని అధిగమించడం.

భారతదేశంలో ప్రతిమనిషి కులంలో పుట్టున్నాడు; ఈ కులానికి మతం, 'పవిత్ర గ్రంధాలు' ప్రామాణికంగా ఉన్నాయి. కుల వ్యవస్థ పుట్టుపూర్వోత్తరాలను తడివితే అది అమానుషమని, అవమానకరమని తేలుతుంది. తమ ప్రబోధం ద్వారాను, ఆచరణద్వారాను ఈ దౌష్ట్యాన్ని రూపుమాపాలనుకున్న సంస్కరణ వాదులెంత మందో ఈ అంశాన్ని గ్రహించారు. మానవజాతి యొక్క అంధవిశ్వాసం వలన, వాదు జీవిత కాలం వెచ్చించినా వారి ప్రయత్నాలు జయప్రదం కాలేదు. ఎప్పటికప్పుడు అది ఈజిప్షియను దేవత స్ఫినిక్స్‌లాగా తల ఎత్తేది; ప్రతి జీవితపు

వ్యాపారంలోకి చొచ్చుకుపోయేది. కులతత్వం శాశ్వత తత్వాన్ని సంతరించు కోవటమే కాక రాజకీయ రంగలోకికూడా ప్రవేశించింది. రాజకీయ పార్టీల ఇష్టా రాజ్యాంగా సంచరించే పద్ధతిలో సర్వసత్తాక రాజకీయ కార్యరంగం తయారయింది. ఈ పార్టీలు అధికారానికి రావాలంటే ప్రజల వోట్లుకావాలి, కనుక ప్రతి కులంయొక్క వీరోచిత కార్యాలను ప్రశంసించి తద్వారా కుల చైతన్యాన్ని పెంపొందించి వోట్లను జమ చేసుకుంటున్నాయి. అలా కులాభిమానాలను రెచ్చగొట్టే అభ్యర్థికి యీరకపు చైతన్యానికి ప్రభావితు లయిన వోటర్లు తమవోట్లను ఇస్తున్నారు. అలా కులపరమైన వాగాడంబరం ఈనాడు సర్వ సామాన్యమయింది. అయినా ప్రతి రాజకీయవాది, రాజకీయ పార్టీ ఈ దుష్ట కులతత్వాన్ని సమూలంగా నాశనం చేస్తామని ప్రకటిస్తారు. రాజ్యాంగంలో కులానికి చోటు పెట్టలేదు. అయినప్పటికి, ఎవరు అధికారంలో ఉన్నా, తమ కులపువారు న్యాయ వ్యవస్థలో, ప్రభుత్వంలో, శాసనసభలో కీలక స్థానాలను ఆక్రమించేలాగు ప్రయత్నిస్తూ తమ కులాన్ని పోషించు కుంటున్నారు.

మనరాజ్యాంగంలో షెడ్యూలు జాతులకు, తెగలకు, వెనుకబడిన జాతులకు రిజర్వేషనులు ఇచ్చాము; కనుక రాజకీయ వ్యవస్థలో ఒక వైపరీత్యం వచ్చింది. ఒక రకంగా ఈ రిజర్వేషన్లు కుల వ్యవస్థమీద ఆధారపడుతున్నాయి. దోపిడీకి గురి అవుతున్నవారికి రిజర్వేషనులు ఇస్తూ కులవ్యవస్థను ఎలా రూపుమాపాలా అనేది సమస్య. అభివృద్ధిచెందిన తరగతులవారితో సమానంగా, ఆర్థికహోదాను పెంచుకున్న వారికి రిజర్వేషనులు ఉండరాదని కొందరు ప్రతిపాదిస్తున్నారు. అచ్చంగా ఆర్థిక గీటురాళ్ళమీదనే రిజర్వేషను 'పాలసీ' ఆధారపడి ఉండలేదనే వారు ఈ ప్రతిపాదనను వ్యతిరేకిస్తున్నారు. భారతదేశంలో వెనుకబడిన జాతులు, షెడ్యూలు జాతులు, షెడ్యూలు తెగలు శతాబ్దాల తరబడి దోపిడీకి గురి అయినారు. అందులో ప్రత్యేకంగా షెడ్యూలు జాతులవారిని 'అంటరాని వారు' గా పరిగణించారు; రాజ్యాంగం ప్రకారం అంటరానితనం రద్దు చేయబడినా వారిని అంటరానివారుగానే చూస్తున్నారు. వారు గ్రామం వెలుపల నివసించవలసిన దుర్భర పరిస్థితిని వారికి తదితరులు కల్పించారు. వారిని జాతీయ జీవనంలో సమ్మిళితం కానివ్వటంలేదు. ఈ సందర్భంగా

ఎనుకబడిన జాతులవారుకూడా తదితరులవలెనే ప్రవర్తిస్తున్నారు. అలా కులసమస్య చిక్కులలో ఇరుక్కున్నది; పరిపాలకులకు పరిష్కార మార్గం లభించడంలేదు, రిజర్వేషన్లుకోరే నిమిత్తం, రాజకీయ ప్రాతినిధ్యం కోసం, ఆర్థిక సదుపాయాల కొరకు కులసంఘాల నిర్మాణం సాగించడం జరుగుతున్నది. ఇది కులవ్యవస్థకు శాశ్వత ప్రాతిపదిక కల్పించే ప్రమాదకర ధోరణి. మంత్రివర్గ నిర్మాణం కుల ప్రాతిపదికపైన జరుగుతున్నది. కుల భావనను అనుసరించే శాసన సభకు పోటీచేయడానికి సీట్లు ఇవ్వబడుతున్నాయి. ఈ కులపు ఆటలో అన్ని రాజకీయపార్టీలు పోటీ పడుతున్నాయి.

ఇలా జరుగుతున్నా మన నాయకులు కులవ్యవస్థ నిర్మూలన గురించి ప్రసంగిస్తూనే ఉన్నారు. వారి అసత్య ప్రసంగాలకు వారు వేదికలను వాడుకొంటున్నారు. వారి నిజాయితీని మనం ఎవ్వరమూ నమ్మనక్కరలేదు. అపుడపుడు కులాంతర వివాహాల సంగతి వినవస్తుంది. మన నాయకులు ఆ వివాహాలకు హాజరవుతారు; వధూవరులను ఆశీర్వదిస్తారు. తమ 'విశాల దృక్పథాలను' వివరిస్తారు. ఒకసారి కులాంతర వివాహం జరిగితే ఆ దంపతుల సంతానానికి కులం ఉండరాదు. కాని, ఆచారంగా సంతానం తండ్రి కులాన్ని తమ కులంగా చెప్పుకుంటారు. శాసనం కూడా ఆ సదుపాయాన్ని కలుగజేస్తుంది. ఇదంతా ఆస్థి సంబంధంగా వచ్చే హక్కులవల్ల జరుగుతున్నది. ఒక్కొక్కపుడు రిజర్వేషనుల కొరకు, 'స్కాలర్ షిప్పు' ల కొరకు సంతానం 'మేము ఫలానా కులంవారము' అని చెప్పుకుంటారు. కులనిర్మూలనకోసం కులాంతర వివాహం ఉద్దేశింపబడినదయితే, ప్రస్తుత కులాంతర వివాహం, అందువలన అంటే పై చెప్పిన కారణాలవలన, వాంఛించిన లక్ష్యాన్ని సాధించలేక పోయిందని చెప్పక తప్పదు.

మరి, ప్రత్యామ్నాయ మార్గమేది? ప్రస్తుతానికి ఒకే ఒక ప్రత్యామ్నాయం గోచరిస్తుంది. కులతత్వం చెడ్డదని మన రాజకీయ నాయకులు, సంఘ పెద్దలూ అందరూ అంగీకరిస్తున్నారు. కనుక ఒకే కులంలో వివాహాలపై నిషేధం విధించాలి. ఈ ప్రతిపాదనకు వ్యతిరేకంగా, నిస్సందేహంగా, గగ్గోలు పుట్టుంది; వ్యతిరేకులు రణగొణ ధ్వనిచేస్తారు.

మద్యపాన నిషేధంలాగా ఇది ఘోరంగా విఫలమవుతుందని ఎగతా చేయటం, వ్యతిరేకించడం జరుగుతుంది. సంస్కరణ వాదులకు ఇ విషమ పరీక్ష. తన జీవిత భాగస్వామిని తను ఎంపికచేసుకునే స్వేచ్ఛపై ఈ విధానం పరిమితి విధిస్తుందని సహేతుకంగా విమర్శించవచ్చును. అ రహితమయిన అడ్డంకులను దాటి ఎవరినైనా వివాహం చేసుకోవటాని ఎంతో గొప్ప అవకాశాన్ని ఇస్తుంది ఈ పద్ధతి. కులవ్యవస్థను ఛేదించటాని శాసనం పోద్బలం కారణమవుతుంది. కులంలో వ్యక్తిని ప్రేమించి వివాహ మాడటానికి ఈ విధానం అడ్డంకి అవుతుందని కుల వ్యవస్థను శాశ్వతం చేయాలని ఆశించేవారు వాదించవచ్చును. మన సమాజంలో ఇంచు మించుగా అన్ని వివాహాలు పెద్దలు ఏర్పాటు చేసినవని (ముఖ్యంగా కులంలోనే) మనందరికీ తెలిసిన విషయమే. ఏ సంస్కరణమైనా మొదట్లో తీవ్ర వ్యతిరేకతకు లోనవుతుంది. అది మానవ స్వభావాను గుణం. ఎక్కడో అక్కడ మనం సంస్కరణ ప్రారంభించాలి.

మూడవ ప్రత్యామ్నాయ విధానాన్ని మనం రూపొందించేవరకు ఏక కులంలో వివాహాలను నిషేధించడం ఒక్కటే సాధ్యమయిన పరిష్కారమార్గం.



# మానవమతం కావాలి

— వె. లీలావతీ రాఘవయ్య

మతాలు వివాహ వ్యవస్థలో ఎంతో బలముగా పాతుకుపోయి ఉన్నవి. మత పెద్దలు కులాలను సృష్టించి తమ ఆధిక్యతను కాపాడుకొనుచున్నారు. వృత్తులనుబట్టి కులాలు ఏర్పడినచో మరొకటి గొప్పది, ఒకటి హీనమైనదిగాను చూడ నవసరంలేదు. జీవనానికి అవసరమైన ఏ వృత్తి అయినా ఒకే విలువ కలిగివుండును. దాని మూలంగా వచ్చే మూల్యంలో తేడాలుండ వచ్చును. అంతేకాని హెచ్చు పెచ్చులదృష్టి అనవసరము. మానవుడు సుఖజీవనం చేయుటకొరకు కొన్ని పద్ధతులను ఏర్పాటు చేసుకుంటాడు. అవి రాతియుగంనుండి నేటివరకు దేశ కాల పరిస్థితులనుబట్టి మారుతున్నవి. ఈ మార్పులలోనే హిందూ, ముస్లిం, క్రైస్తవ, బౌద్ధ, జొరాస్ట్రియన్ వగైరా మతాలు ఉద్భవించుట జరిగినది. ఒక్కొక్కమతం ఒక్కొక్క దేశంలో పుట్టినది. భిన్న ప్రాంతాలలో ఏర్పడినవి కాబట్టి, వాటి పద్ధతులు లేక సిద్ధాంతాలు భిన్న రూపాలలో వుంటాయి. కాలక్రమేణా ఈ మతాలు తమ తమ ప్రాంతాలనుండి ఇతర ప్రాంతాలకుకూడా వ్యాపించినవి. ప్రస్తుతము మతాలు సుఖజీవనము కలిగించే కంటే హానినే కలిగించు చున్నవి.

ఒక మతంయొక్క సాంఘికాచారాలు మరొక మతంలో వుండవు. అంత మాత్రాన ఒకరివి చెడు, మరొకరివి మంచి అనడానికి వీలులేదు. మంచి చెడులు అన్నింటిలోనూ వుండును. ఏ దేశంలోనైనను, పల్లెల్లోకాని, పట్టణాలలోకాని వుండే ప్రతి మనిషికి కనీసం తిండి, గుడ్డ, నీరు కావాలి. అందుకు కొన్ని విధానములు ఏర్పరచు కొనవలెను. మానవులంతా ఒకటే జాతి కాబట్టి, ఆ విధానములన్నీ మానవులందరికీ ఒకటిగానే వుండాలి. అదే మానవ మతమని చెప్పుకోవాలి.

మద్యపాన నిషేధంలాగా ఇది ఘోరంగా విఫలమవుతుందని ఎగతాళి చేయటం, వ్యతిరేకించడం జరుగుతుంది. సంస్కరణ వాదులకు ఇది విషమ పరీక్ష. తన జీవిత భాగస్వామిని తను ఎంపికచేసుకునే స్వేచ్ఛపై ఈ విధానం పరిమితి విధిస్తుందని సహేతుకంగా విమర్శించవచ్చును. అర్థ రహితమయిన అడ్డంకులను దాటి ఎవరినైనా వివాహం చేసుకోవటానికి ఎంతోగొప్ప అవకాశాన్ని ఇస్తుంది ఈ పద్ధతి. కులవ్యవస్థను ఛేదించటానికి శాసనం ప్రోద్బలం కారణమవుతుంది. కులంలో వ్యక్తిని ప్రేమించి వివాహ మాడటానికి ఈ విధానం అడ్డంకి అవుతుందని కుల వ్యవస్థను శాశ్వతం చేయాలని ఆశించేవారు వాదించవచ్చును. మన సమాజంలో ఇంచు మించుగా అన్ని వివాహాలు పెద్దలు ఏర్పాటు చేసినవని (ముఖ్యంగా కులంలోనే) మనందరికీ తెలిసిన విషయమే. ఏ సంస్కరణమైనా మొదట్లో తీవ్ర వ్యతిరేకతకు లోనవుతుంది. అది మానవ స్వభావాను గుణం. ఎక్కడో అక్కడ మనం సంస్కరణ ప్రారంభించాలి.

మూడవ ప్రత్యామ్నాయ విధానాన్ని మనం రూపొందించేవరకు ఏక కులంలో వివాహాలను నిషేధించడం ఒక్కటే సాధ్యమయిన పరిష్కారమార్గం.



# మానవమతం కావాలి

— వె. లీలావతీ రాఘవయ్య

మతాలు వివాహ వ్యవస్థలో ఎంతో బలముగా పాతుకుపోయి ఉన్నవి. మత పెద్దలు కులాలను సృష్టించి తమ ఆధిక్యతను కాపాడుకొనుచున్నారు. వృత్తులనుబట్టి కులాలు ఏర్పడినచో మరొకటి గొప్పదీ, ఒకటి హీనమైనదిగాను చూడ నవసరంలేదు. జీవనానికి అవసరమైన ఏ వృత్తి అయినా ఒకే విలువ కలిగివుండును. దాని మూలంగా వచ్చే మూల్యంలో తేడాలుండ వచ్చును. అంతేకాని హెచ్చు పెచ్చులదృష్టి అనవసరము. మానవుడు సుఖజీవనం చేయుటకొరకు కొన్ని పద్ధతులను ఏర్పాటు చేసుకుంటాడు. అవి రాతియుగంనుండి నేటివరకు దేశ కాల పరిస్థితులనుబట్టి మారుతున్నవి. ఈ మార్పులలోనే హిందూ, ముస్లిం, క్రైస్తవ, బౌద్ధ, జొరాస్ట్రియన్ వగైరా మతాలు ఉద్భవించుట జరిగినది. ఒక్కొక్కమతం ఒక్కొక్క దేశంలో పుట్టినది. భిన్న ప్రాంతాలలో ఏర్పడినవి కాబట్టి, వాటి పద్ధతులు లేక సిద్ధాంతాలు భిన్న రూపాలలో వుంటాయి. కాలక్రమేణా ఈ మతాలు తమ తమ ప్రాంతాలనుండి ఇతర ప్రాంతాలకుకూడా వ్యాపించినవి. ప్రస్తుతము మతాలు సుఖజీవనము కలిగించే కంటే హానినే కలిగించు చున్నవి.

ఒక మతంయొక్క సాంఘికాచారాలు మరొక మతంలో వుండవు. అంత మాత్రాన ఒకరివి చెడు, మరొకరివి మంచి అనడానికి వీలులేదు. మంచి చెడులు అన్నింటిలోనూ వుండును. ఏ దేశంలోనైనను, పల్లెల్లోకాని, పట్టణాలలోకాని వుండే ప్రతి మనిషికి కనీసం తిండి, గుడ్డ, నీరు కావాలి. అందుకు కొన్ని విధానములు ఏర్పరచు కొనవలెను. మానవులంతా ఒకటే జాతి కాబట్టి, ఆ విధానములన్నీ మానవులందరికీ ఒకటిగానే వుండాలి. అదే మానవ మతమని చెప్పుకోవాలి.

ఒక కులంవారు మరొక కులంవారితో వివాహం చేసుకొనుటకు ముందుకురారు. ఒకవేళ ఎవరైనా సాహసించినా వాళ్ళు చేయరాని తప్పు చేసినట్లుగా ఇతరులు వారిని వింతగ చూచుదురు. ఆ సమస్య అంతటితో పోదు. వారి సంతానపు భవిష్యత్తుకు కూడా ఆటంకాలు వస్తాయి. పెద్దలు ఏర్పాటుచేసినా, పిన్నలు ఏర్పాటు చేసుకున్నా ఇరువైపుల వారి భావాలు ఒకటిగ వున్నపుడు వారి కలయికలకు అభ్యంతరము దేనికి? స్నేహము, అభిమానము రెండూ మెండుగావున్నా ఇతరులు ఏమంటారో అన్న భయానికి వారి కలయిక విషయంగా ఆలోచించనే ఆలోచించరు. అలాగని, ఒకే కులములోనూ, ఒకే మతములోనూ సమస్యలు ఉండుటలేదా? ఏ మనిషికి ఆ మనిషికే ఒక మతము (అభిప్రాయము, అభిరుచి) ఉండును. తన ఎదుటి మనిషితో ఎప్పుడూ ఏదో ఒక అభిప్రాయ విషయంగా బేధము లేకుండా వుండలేదు. ఒకరికొకరు సర్దుకొని జీవితాన్ని గడపాలి; గడుపుచున్నాము. అలాంటప్పుడు మతము, కులము ఎందుకు అడ్డురావాలి?

వివాహాలు ఒకే మతములో ఒక్కొక్కచోట ఒక్కొక్క రకముగా జరుగును. అందులో ఏ ఒక్క దానికి గిటురాయిలేదు. అలాగే వివాహము జరిపించే లగ్నకాల నియమాలుకూడా ఇద్దరుకలిసి జీవించడానికి చేసుకున్న ఒప్పందాన్ని తమ పరిచయస్తులకు తెలియజేయడానికి నిర్ణయించుకున్న సమయముగా ఎంచుకొనవచ్చును. ఎవరికి అనుకూలంగా వుండే సమయమును వారి సదుపాయముల ననుసరించివారు నిర్ణయించుకొనవచ్చును. అందువలన మిగిలిన వారి నిర్ణయాలు సరియైనవికావని అనవసరములేదు. వివాహ ఆచారముల వెనుక ఆర్థికవ్యవస్థకు కూడా మంచి స్థానము వున్నది. ఈ ఆచారములు, అలవాట్లు అన్నీ సామాన్య మానవునిమీదే స్వారి చేయుచున్నవి. లక్షాధికారులను, కోటీశ్వరులను అవి అంటవు. వారు ఏమిచేసినా సామాన్య ప్రజలు నోరు మెదపరు సరికదా తాముకూడా వారిని అనుసరించాలని పాకులాడుదురు. మత పరంగా, కుల పరంగా వారు ఏమిచేసినా చెల్లుతున్నది. నోరులేని సామాన్య మానవుడి మానసిక ఆర్థిక బలహీనతలను ఆధారముగా చేసుకొని ధనవంతులైన వారు ఇష్టారాజ్యంగా ప్రవర్తిస్తున్నారు. కాబట్టి మనమంతా పైవారి ఆధిక్యతలకు దాసోహం అనకుండా ఇచ్ఛాపూర్వకంగా బ్రతకాలంటే ముందు ఆర్థిక

స్వాతంత్ర్యం కలిగివుండాలి. కులమతాల బారినుండి విముక్తి పొందాలన్నా దేశపు ఆర్థిక పరిస్థితి బాగుండాలి.

ప్రతివారూ ఏ విషయమునైనా మూఢంగా నమ్మకుండా కాలానుగుణమైన అవసరాలకు మార్పులు చేసుకోవాలి. బుద్ధి ప్రాణమూవున్న ప్రాణులుగా మనము ఆలోచించాలి.

కులమతాలు స్త్రీని ఎంతో చులకనచేశాయి. స్త్రీలను నగ్నంగాను, అర్ధనగ్నంగాను చిత్రించి ఆ చిత్రాలను వ్యాపారప్రకటనలకు, ఇతరత్రాను వినియోగించుకొనేంత వరకు పరిస్థితి దిగజారింది. ఇదంతా కులమతాలు నూరిపోసిన బోధనా ఫలితమే. కాబట్టి వేదాలు ఘోషించినా, పురాణాలు ఇతిహాసాలు కథలు చెప్పినా, మతాచార్యులు సిద్ధాంతాలు ప్రబోధించినా, రాజకీయ నాయకులు స్వార్థపర నీతులు చెప్పినా మనము మాత్రం ఇలాంటి మతాలు వద్దని ప్రకటించాలి. స్త్రీ పురుష భేదాలులేని సర్వ మానవ సౌభ్రాతృత్వానికీ, సుఖజీవనానికీ ప్రపంచమంతటికీ మానవజాతి అంతటికీ ఒకే మతం, ఒకే కులం, ఒకే చట్టం కావాలి. అదే మానవ మతం, మానవ కులం, మానవ జాతి.



# యువతరపు బాధ్యత

— రతన్ ప్రసాద్

ఈనాటి దేశ పునర్నిర్మాణ కార్యక్రమాల్లో యువతరం బాధ్యతా యుతమైన పాత్రను నిర్వహిస్తోందన్న సంగతి మనకందరికీ తెలుసు. యువతరం ఆవేశానికీ, ఉద్రేకానికీ, ఉత్సాహానికీ కూడా ప్రతిరూపం అందుకే ఒక సమాజం అభ్యున్నతిని సాధించాలన్నా దేశం పురోగ మించాలన్నా యువతరం పూనిక వహించడం తప్పదు.

మన జనాభాలో సుమారు 38 శాతం 16 సం॥ లోపు వయస్సుగల పిల్లలుంటే మరో 30 శాతం 40 సం॥ రాల వయస్సు దాటిన వారున్నారు. పోతే తక్కిన 32 శాతం వరకూ యువతీ యువకులు ఉన్నారు. అంటే జనాభాలో మూడోవంతు ఈ యువతరం ఉందన్నమాట. కనుక యువతరం కృషిచేస్తే తప్ప దేశం అభివృద్ధి చెందదు.

దేనినయినా ఒకసారి నమ్మితే యువతరం దానిని సాధించే నిమిత్తం విశేషంగా త్యాగాలు చేయగలదు. మొక్కవోని ధైర్యసాహసాలతో ముందుకు ఉరకగలదు. అవివాహితులుగా ఉంటున్నందున, సంసార బాధ్యతలు తక్కువగా ఉండడమువలన సామాజిక లక్ష్యాల సాధనకోసం ప్రాణాలొడ్డి పోరాడతారు యువతీయువకులు. కనుక ఏ మంచి కార్యమయినా ఫలించాలంటే వారి దృష్టిని ఆకట్టుకోవాలి; వారి సహాయ సహకారాలు పొందాలి.

కట్నం లేకుండా వివాహమాడడం, కుల మత జాతి భాష ప్రాంత భేదాలను పట్టించుకోకుండా పెండ్లికి సిద్ధపడటం ఉదాత్త ఆశయాలు. స్వేచ్ఛా సమానత్వ సౌభ్రాతృత్వ నినాదాలను తమవిగా చేసుకున్న యువతీ యువకులు పై ఆశయాలను కలిగి ఉండటం ఏమంత కష్టంకాదు. వచ్చిన చిక్కల్లా ఆశయాలను ఆచరణలోనికి అవతరించడంలోనే ఉన్నది. ఆదర్శాలు

వ్లించినంత కాలం కుటుంబ పెద్దలూ, కుల పెద్దలూ అడ్డంరారు. ఇతరుల యెదుట తమ సంతానాన్ని గురించి గొప్పగా చెప్పుకుంటారు కూడా. ఎప్పుడయితే యువత మాటలను చేతలుగా మార్చ పూనుకుంటుందో అప్పుడు పెద్దలు రంగం మీదికి వస్తారు. ముందు ఆ ప్రయత్నం విరమించమని నచ్చచెప్పటానికి ప్రయత్నిస్తారు. తలనెరిసిన వారమని తమను అభివర్ణించుకొని సలహా ఇస్తారు; కష్ట నష్టాలుంటాయని హెచ్చరిస్తారు. ఇవన్నీ పని చేయకపోతే "నా ఆస్తిలో చిల్లిగవ్వ నీకు ఇవ్వను." అని బెదిరిస్తారు. 'నీ మొగంచూడన' ని ఈసడిస్తారు. ఈ లాలనతో, బుజ్జగింపుతో, దబాయింపుతో యువకులలో యువతులలో చాలామంది లొంగిపోతారు. పెద్దల మాటకు తలొగ్గి వారు చెప్పినట్లు సంప్రదాయాను సారంగా వారివారి కులంలోనో, మతంలోనో వివాహమాడతారు. ఇదంతా సర్వేసర్వత్రా జరిగే పరిణామం. ఈ ప్రమాదాన్ని తట్టుకొని ధైర్యంగా నిలబడగలగాలి యువతరం.

వివాహం చేసుకోవాల్సినది, చేసుకునేది యువతీ యువకులు. ఈ విషయంలో పెద్దలపాత్ర సలహామేరకుమాత్రమే పరిమితం కావాలి. పెండ్లి నూరేండ్లపంట అనే నానుడి తరచు వినపడుతూ ఉంటుంది. జీవిత కాలమూ కలిసిమెలసి కాపురం చేయాల్సిన వధూవరులకు వివాహాత్పూర్వము కొన్ని సందర్భాలలో — ఆ మాటకువస్తే చాల జంటల 'కేసు' ల్లో — పరిచయమే ఉండదని చెప్పవచ్చు. వివాహాలు రెండు రకాలు — ప్రేమ వివాహాలూ, పెద్దలు ఏర్పాటు చేసినవి. వీటిలో ప్రేమ వివాహాల ప్రాశస్త్యాన్ని ఇటీవల గుర్తిస్తున్నారు ప్రజలలో విజ్ఞులు.

మనదేశంలో జరిగే ప్రేమ వివాహాలసంఖ్య అత్యల్పం. ఒకరికి మరొకరి పై ప్రేమాభిమానాలులేకపోతే ఇలాంటి వివాహాలు జరగడం అసంభవం. పరస్పరం సంప్రదించు కోగలిగితే తప్ప ఒకరిపై మరొకరికి ఆసక్తి ఉదయించదు. మన సంప్రదాయ సనాతన సమాజంలో యువతీ యువకులు కలిసి మాట్లాడుకోవడానికి అవకాశాలు లేవు. ఇరువురు స్త్రీ పురుషులు ఒకచోటకూడి సంభాషణసాగిస్తే కొంపలు మునిగిపోయినట్లు గగ్గోలు పెడుతుంది సమాజం. ఆ ఆడపిల్లను వేలుపెట్టి చూపిస్తుంది;

గుసగుసలు పోతుంది. పరోక్షంగా హేళనచేస్తుంది ; ప్రత్యక్షంగా వ్యంగ భాషణలతో బాధపెట్టుంది. ఈ చర్యలకు భయపడి యువతులు – చదువు కున్నవారు కూడా — యువకులకు దూరంగా తొలగిపోతారు. ఇది ఈనాడు జరుగుతున్న కథ.

ప్రేమ ఆధార రహితం కాదు. ఒక వ్యక్తి ఆదర్శాలు, లక్ష్యాలు, అభిప్రాయాలు, ఆసక్తికర విషయాలు రెండో వ్యక్తికి అంగీకార యోగ్యం కాకపోయినా వాటిని గౌరవించగలిగితే మొదటి మెట్టు దాటినట్లే. సహనం, పరస్పర గౌరవం ఉన్నపుడే ఇరువురు సన్నిహితం కాగలగుతారు. కాకపోతే ఒకరు రూపానికి ప్రాధాన్యత ఇస్తే, మరొకరు ఆకర్షించే స్వభావానికి ముగ్ధులౌతారు. సంభాషణాచాతుర్యానికి ఒకరు మనసిస్తే, మరొకరు చిరునవ్వుచిందించే ముఖానికి హృదయాన్ని అర్పిస్తారు. అవతలి మనిషియెడ శ్రద్ధాసక్తులు కొంతమందిని ఆకర్షిస్తాయి. ఒకరిలో మానవత, మరొకరిలో త్యాగ గుణం, వేరొకరిలో దైన్యరాహిత్యం, ఇంకొకరిలో పట్టుదల ధైర్య సాహసాలు ఇలా ఒక్కొక్క గుణం కొట్టవచ్చినట్లు కనపడి అవతలి మనిషి మనస్సును ఆకట్టుకోవడం చూస్తున్నాం. 'లోకో భిన్నరుచి' అనే సామెత అనుభవసారం. ఇంతకూ చెప్పపూనుకున్న దేమంటే 'ప్రేమ, ప్రేమ' అని ఊహాలోకంలో విహరించి లాభంలేదు. ఉదయించిన ప్రేమ మఖలో పుట్టి పుబ్బలో పోకుండా ఉండాలంటే దానికి ఆధారమయిన కొన్ని ప్రాతి పదిక అంశాలు అవశ్యం అవసరం. ప్రేమించడం ఒక ఎత్తు, ప్రేమించి పెండ్లాడటము మరొక ఎత్తు. వధూవరులిరువురికి ఉద్యోగవసతి ఉండి ఆర్జన లేకపోతే ఆ కాపురం అష్టకష్టాల పాలవుతుంది. కనుక ప్రేమ వివాహాల మనుగడకు సంపాదనాశక్తి వధూవరులు కలిగి ఉండటము తప్పనిసరి. దానికి వృత్తి విద్యలు విధిగా అభ్యసించవలసి ఉంటుంది. ఎన్ని బాధలయినాపడి యువతులు విద్యా సముపార్జన చేయాలి. ఉద్యోగాలను చేపట్టాలి. అపుడే వారికి నిజమైన స్వేచ్ఛ లభిస్తుంది.

ఇక పెద్దలుచేసే పెండ్లిండ్ల పద్ధతికూడా కొద్దిగా మారుతున్నది. ఒకనాడు వధూవరులు పెండ్లికి ముందు ఒకరినొకరు చూచుకునేవారు కారు. ఈనాడు పెండ్లిచూపులు సాగుతున్నవి. పాతకాలపు పద్ధతులు కొన్ని పోయాయనుకోండి. అయినా వధూవరుల సమ్మతిని కోరడం జరుగుతున్నది.

ఈ అవకాశాన్ని యువతీయువకులు వినియోగించు కోవాలి. 'కట్నం తీసుకోవడమంటే స్త్రీ లోకాన్ని అవమానించడం' అనే అంశాన్ని యువకులు ఎల్లవేళలా గుర్తుంచుకోవాలి. "మీకు నచ్చిన పిల్లనే పెండ్లాడుతాను కాని ఒక్కపైసరతు కట్నం తీసుకోరాదు, ఆమె యొక్క కులమతాలతో మీకు సంబంధం ఉండరాదు" అని ధైర్యంగా ప్రకటించగలగాలి యువకులు. అపుడు రెండో పక్షంగా చెప్పుకునే 'ఏర్పాటు వివాహాల' లలో కూడా కొంత అభ్యుదయం సాధించవచ్చు.

యువజన సంఘాల కార్యక్రమాలు చాలావరకు రాజకీయాలకు, ఆట పాటలకు పరిమితమవుతున్నవి. అపుడపుడు కొన్ని సంఘాలు సేవా కార్యక్రమాలను చేపట్టటం కద్దు. కాని సామాజిక సంస్కరణా ప్రయత్నాలలో కృషి అత్యల్పంగా ఉంటున్నది. యువజనసంఘ సభ్యులు వరకట్న దురాచారాన్ని, జాత్యహంకారాన్ని, మత విద్వేషాన్ని, కులతత్వ దౌష్ట్యాన్ని, వర్ణవివక్షతను రూపుమాపుతామని ప్రతిజ్ఞలు చేయాలి. వాగ్దానాలు నిలుపుకోటానికి నడుం కట్టాలి. "పురుషుడితో సమానంగా స్త్రీ కూడా చదువుకుని ఉద్యోగం చేయగలుగుతున్నపుడు, కుటుంబంలో భార్యాభర్త లిద్దరికీ సమానస్థాయి బాధ్యతలున్నపుడు, అత్తింటికివచ్చే ఆడపిల్ల కట్నం ఎందుకివ్వాలి?" అని యువతీ యువకులు ప్రశ్నించుకోవాలి. ఇలా ఆలోచనలతో తాము ముందుకు సాగిపోతూ సమాజాన్ని చైతన్యవంతం చేయాలి యువతరమూ, యువజన సంఘాలూ.



# పెళ్ళి - కొన్ని సమస్యలు

— రంగనాయకమ్మ

[పెళ్ళికీ, దానిద్వారా ఏర్పడే స్త్రీ పురుష సంబంధాలకి సంబంధించిన కొన్ని సమస్యల్ని ఈ సెమినార్ మన ముందుకు తెచ్చింది. ఈ సమస్యల గురించి నా అభిప్రాయాలు ప్రశ్నలకు జవాబులిచ్చే పద్ధతిలో రాశాను.

ఒక సమస్యని పరిష్కరించేటప్పుడు ఆ పరిష్కారం శాశ్విత పరిష్కారంగా వుండాలిగానీ, తాత్కాలిక పరిష్కారంగావుంటే లాభంలేదు. తాత్కాలిక పరిష్కారంవల్ల సమస్య పూర్తిగా పరిష్కారం కాదు; పరిష్కారం అయిన భాగంకూడా మళ్ళీ మళ్ళీ తలెత్తుతూ వుంటుంది. సమస్య మళ్ళీ మళ్ళీ తలెత్తడానికి వీలిచ్చేరకం పరిష్కారాలు ఎన్ని యుగాలపాటు చేసినా సమస్య సమస్యలాగే వుండిపోతూ వుంటుంది.

సమస్య మళ్ళీ రాకుండాచేసే మార్గమే సమస్యకు శాశ్విత పరిష్కారం.

కానీ, ఈనాడు మనంవున్న సమాజంలో, సమస్యల్ని శాశ్వితంగా పరిష్కరించడానికి కావలసిన పరిస్థితులు ఇంకాలేవు. సమస్యలనేవి సమాజంలోవుండే పరిస్థితులవల్లనే వస్తాయి కాబట్టి, ఆ పరిస్థితుల్ని మార్చుకునే ప్రయత్నాలు మన సమాజంలో ఇప్పుడిప్పుడే ప్రారంభమవుతున్నాయి. ఇలాంటి దశలో ఏ సామాజిక సమస్యనీ శాశ్వితంగా పరిష్కరించడం సాధ్యం కాదు. కానీ, సాధ్యం అయినా కాకపోయినా శాశ్విత పరిష్కారాల గురించే మొదట తెలుసుకోవాలి. శాశ్విత పరిష్కారాల్ని దృష్టిలో పెట్టుకుని తాత్కాలిక పరిష్కారాలు చేసుకుంటూ వుండాలి. శాశ్విత పరిష్కారాలు ఇప్పుడే సాధ్యం కావుకదా అని సమస్యల్ని వదిలేసి ఊరుకోలేము. సమస్యకి ఏదో ఒక తాత్కాలిక పరిష్కారంకూడా వుంటుంది. తాత్కాలికంగా ఏదో ఒక మార్గం వెతుక్కోవడం తప్పనిసరి అవుతుంది. సమస్యకి తాత్కాలిక పరిష్కారం చేసుకోవడం ఏమీ తప్పుకాదు. కానీ,

ఈ తాత్కాలిక పరిష్కారం సమస్యకివుండే శాశ్వత పరిష్కారాన్ని ఆటంక పరిచేదిగా వుండకూడదు. దానికి తోడ్పడేదిగానే వుంటూ వుండాలి. తాత్కాలిక పరిష్కారాలు శాశ్వత పరిష్కారానికి దారితీసేటట్టూ, దానికి తోడ్పడేటట్టూ వుండడం ఎప్పుడు సాధ్యమవుతుందంటే — సమస్యకివుండే శాశ్వత పరిష్కారమేమిటో తెలిసినప్పుడే. ఆ శాశ్వత పరిష్కారాన్ని తెలుసుకోవడం ఎలా సాధ్యమవుతుందంటే — సమస్యకివున్న మూలకారణం ఏమిటో తెలుసుకోవడం వల్లనే. అంటే, దీన్నిబట్టి, ఏ సమస్యకైనా అది ఎందుకు పుడుతుందో దాని మూలకారణం తెలుసుకొని, దాన్ని పూర్తిగా తీసెయ్యగల మార్గం తెలుసుకొని, ఆ దృష్టితోనే తాత్కాలిక పరిష్కారాలు చేసుకుంటూ వుండాలి. అలా చేసుకున్నప్పుడే తాత్కాలిక పరిష్కారాలు కూడా కొంత ప్రయోజనకరంగా వుంటాయి. ఏ సమస్యకైనా ఇదే సరైన పద్ధతి — పెళ్ళికి సంబంధించిన సమస్యలకైనా కూడా. ఇక్కడ మనం చూడబోయే [ప్రతీ సమస్యకీ దానికి శాశ్వతంగావుండే పరిష్కార మేమిటో ఒక జవాబు చెప్పాను; ప్రస్తుత దశలో ఎలాంటి పరిష్కారం అవసరమో కూడా ఒక జవాబు చెప్పాను.]

1) వివాహవ్యవస్థ అవసరమా, కాదా?

(అంటే, పెళ్ళిళ్ళు చేసుకునే పద్ధతి వుండటం అవసరమా, కాదా?)

జ) ఈ ప్రశ్నకు శాశ్వతంగా, సహజంగావుండే జవాబు - 'అవసరం లేదు' అనే 'పెళ్ళి అవసరం లేదు' అనే విషయాన్ని చాలా మంది ఎలా అర్థం చేసుకుంటారంటే, ఇద్దరు స్త్రీ పురుషులు ఒక 'జంటగా' వుండనక్కర లేదనీ, స్త్రీ పురుషులందరూ ఎవరితో ఎవరైనా వుండవచ్చుననీ-చెప్తోన్నట్టుగా అర్థం చేసుకుంటారు. అలాంటి అర్థంతో మాత్రం నేను మాట్లాడడం లేదు. ఇద్దరు స్త్రీ పురుషులు కలిసి వుండడానికి ఒకరంటే ఒకరికి అనురాగం వుండటమే ప్రధానమైన విషయం అయినప్పుడు ఎవరితో ఎవరైనా వుండడం అనేది సాధ్యంకాదు. అనురాగంవున్న వాళ్ళిద్దరే ఒక జంటగా వుంటారు. అలా జరగకుండా చెయ్యడం ఎవరికీ సాధ్యంకాదు. ఒకరంటే ఒకరికి సదభిప్రాయమూ, అనురాగమూవున్న స్త్రీ పురుషులిద్దరూ ఒక 'జంట'గా జీవించడమే సరైన పద్ధతి. 'పెళ్ళి అవసరంలేదు' అనడం అంటే దానికి

ప్రత్యేకంగా ఒక కార్యక్రమం అవసరం లేదు అని మాత్రమే. ఆ కార్య క్రమాన్ని తీసేసినప్పుడు కూడా ఆ స్త్రీ పురుషుల సంబంధంలో చాలా మార్పులు వస్తాయి. ఆ మార్పులు చాలా సహజమైనవీ, సరైనవీ కాబట్టి పెళ్ళి కార్యక్రమము అక్కరలేదు అనడం.

పరస్పరం అనురాగంవున్న స్త్రీ పురుషులు ఒక 'జంటగా' జీవించడమే ప్రకృతి సహజమైన విషయం. ఆ విషయానికి చట్టబద్ధమైన హక్కులు వుండవలసిన అవసరం లేదు. ఏ ఇద్దరు స్త్రీ పురుషులైతే పెళ్ళి చేసు కుంటున్నారో ఆ ఇద్దరూ పెళ్ళి లేకుండానే ఒక జతగా జీవిస్తే – దానివల్ల, ఆ ఇద్దరూ ప్రేమగా వుండడానికి గానీ, స్నేహంగా వుండడానికి గానీ, ఒకరి కష్ట సుఖాల్లో ఒకరు పాలుపంచుకోడానికి గానీ, ఒకరి బంధు మిత్రుల్ని ఒకరు గౌరవించుకోడానికి గానీ, ఒకరితో ఒకరు సంతోషంగా వుండడానికి గానీ ఏమీ ఆటంకం వుండదు. పెళ్ళి లేకపోవడం అనే పరిస్థితి వారి శరీర ధర్మాలకు కూడా ఏమీ అభ్యంతరకరంగా వుండదు. పెళ్ళి లేకుండా జీవించడంవల్ల స్త్రీ పురుషులమధ్య సంతానోత్పత్తి జరగకుండా వుండదు. పెళ్ళిలేకపోవడం అంటే, స్త్రీ పురుషులమధ్య సంబంధమే లేకపోవడమనీ, సంబంధాలన్నీ మానుకోవడమనీ అర్థంకాదు. పెళ్ళి లేకుండా జీవించడానికి ఏ కోణమూ అభ్యంతరకరంగా వుండదు. అందుకే పెళ్ళి శాశ్వతమైన అవసరం కాదు. సహజమైన అవసరం కాదు. అందుకే అది సమాజంలో తాత్కాలికంగా మాత్రమే వుండిపోయే విషయం అవుతుంది.

కానీ, ఈనాటి సమాజానికి 'పెళ్ళి' ఇంకా అవసరమే. స్త్రీలలో మెజారిటీ మంది పురుషుడి పోషణమీదే ఆధారపడి వుండవలసిన విధంగా వున్నాయి ఈనాటి పరిస్థితులు. సాంఘికంగా కూడా ఇంకా పురుషుడి రక్షణే స్త్రీకి అవసరమవుతోంది. పిల్లలుకూడా ఎక్కువ భాగం తండ్రి పోషణమీదే వుండవలసి వస్తోంది, తల్లికి సంపాదన లేకపోబట్టి. అంతేగాక, సమాజంలో ఇంకా స్వంత ఆస్తులు వుండడమూ, తండ్రి ఆస్తి పిల్లలకు వారసత్వంగా చెందడమూ కూడా వున్నాయి. పెళ్ళి అనేది ఈ పరిస్థితు లన్నింటికీ కావలసిన చట్టబద్ధమైన హక్కులు కల్పిస్తూ వుంటుంది. స్త్రీ — పురుషుడి పోషణకిందే బ్రతకాలి కాబట్టి, పెళ్ళిద్వారా ఆమెకు భర్త

పోషణకింద బతికే హక్కు వస్తుంది. పిల్లలకు కూడా తండ్రి పోషణకింద బతికేహక్కు వస్తుంది. తండ్రి ఆస్తిని పిల్లలు తీసుకునే హక్కుకూడా వస్తుంది. ఇప్పుడున్న పరిస్తితుల్నిబట్టి స్త్రీ పురుషులమధ్యా, తండ్రీ పిల్లల మధ్యా చట్టబద్ధమైన హక్కుల్ని ఇచ్చేట్టుగా సంబంధాలు ఏర్పడడం తప్పనిసరి అవుతుంది. పెళ్ళివల్ల ప్రధానంగా జరుగుతోన్న పనే అది. పెళ్ళి అనేది ఈనాడు స్త్రీ పురుషులమధ్య మానసిక సంబంధాన్నీ ఏర్పరచే విషయం కాదు. ఆర్థిక సంబంధాన్నీ, సాంఘిక సంబంధాన్నీ ఏర్పరచడమే దాని ప్రథమ కర్తవ్యం. తండ్రీ పిల్లల మధ్య కూడా ప్రేమబంధం అనేది ప్రధానంగా లేదు. ఆర్థిక సంబంధమూ, సాంఘిక సంబంధమే ప్రధానంగావుంది. భార్యా బిడ్డల్ని వదిలేసిన పురుషుడు "నీ భార్య పోషణకు ఇంతఇయ్యి, పిల్లల పోషణకు ఇంత ఇయ్యి" అని కోర్టు ఆజ్ఞాపిస్తేనే ఆ పని చేస్తాడు. ఈ స్త్రీ పోషణ సమస్యా, ఆస్తి వారసత్వ సమస్యా ఇలాగే వున్నంత కాలం — స్త్రీ పురుషుల సంబంధాలూ, తండ్రీ బిడ్డల సంబంధాలూ తప్పనిసరిగా చట్టబద్ధంగా వుండవలసే వుంటుంది. అంటే, ఏ కార్యక్రమంద్వారా అయితే, "ఈ స్త్రీ పురుషులిద్దరూ భార్యా భర్తలు" అని సంఘమూ, దాని చట్టాలూ ఒప్పుకుంటాయో ఆ కార్యక్రమమే స్త్రీ పురుషులమధ్య తప్పనిసరి అవుతుంది. అంటే, పెళ్ళి వుండడం తప్పనిసరి అవుతుంది.

పురుషుడి పోషణమీదా, రక్షణమీదా ఆధారపడకుండా, స్త్రీ – తనను తనే పోషించుకొనే పరిస్థితులూ, పిల్లల్ని తను కూడా పోషించగల పరిస్తితులూ ఏర్పడినప్పుడూ; సమాజంనుంచే రక్షణపొందే పరిస్తితులు ఏర్పడినప్పుడూ; ఆస్తి వారసత్వ సమస్యనేదే లేకుండా, అంటే సమాజంలో స్వంత ఆస్తి సమస్యనేదే లేకుండా పోయినప్పుడూ మాత్రమే 'పెళ్ళి'కి వుండే పునాది పోతుంది. అప్పుడు భార్యా భర్తలమధ్య సంబంధాలు చట్టబద్ధంగా ఏర్పడవలసిన అవసరం వుండదు. అలాంటి పరిస్తితులు ఏర్పడకుండా ఇప్పుడు సమాజంనుంచి 'పెళ్ళి'ని తీసెయ్యడం ఎవ్వరికీ సాధ్యం కాదు.

పెళ్ళి అవసరమా, కాదా — అన్న ప్రశ్నకి జవాబు చెప్పాలంటే —

ఏ సమాజంనుంచి మనం మాట్లాడుతున్నామో ఆ సమాజ పరిస్థితుల్ని దృష్టిలో పెట్టుకొని ఆ సమాజంలో పెళ్ళి అవసరమో కాదో చూడాలి.

ఈ సమాజంలోవున్న పరిస్థితుల్నిబట్టి ఈ పరిస్థితుల్లో పెళ్ళి విధానం వుండడం ఇంకా అవసరమే. అయితే ఇది జనరల్‌గా సమాజానికంతటికీ వర్తించే విషయం. ఇది ప్రతీ విడివిడి వ్యక్తికీ వర్తించ నక్కరలేదు. ప్రతీ వ్యక్తీ తప్పనిసరిగా పెళ్ళి బంధంలోకివచ్చి తీరాలని ఆజ్ఞాపించడానికి ఎవరికీ హక్కులేదు. పెళ్ళి కార్యక్రమంలోవున్న అసహజత్వాన్నీ, దానివల్ల సంక్రమించే హక్కుల స్వభావాన్నీ గ్రహించి దాన్ని వొదులు కోవాలని కోరుకునే స్త్రీ పురుషులు తమ జీవితాల్లో దాన్ని వొదులుకోవచ్చు. అయితే దానివల్ల వచ్చే ఫలితాల్ని ఎదుర్కోడానికి వాళ్ళు సిద్ధంగా వుండాలి. ఆ స్త్రీ పురుషులు తర్వాత విడిపోతే, ఆ పురుషుడినుంచి పోషణ కోరేహక్కు ఆ స్త్రీకి వుండదు. అలాగే, అతని ఆస్తిని కోరేహక్కు ఆమె పిల్లలకూ వుండదు. అంతేగాక, పెళ్ళి లేకుండావున్న వాళ్ళని సమాజం కొంత అవహేళనగా చూస్తేకూడా చూడవచ్చు. ఈ పరిస్థితులన్నిటినీ ఎదుర్కోవాలంటే, ఆ స్త్రీకి, ముందు స్వంత సంపాదన వుండాలి. ఆ స్త్రీ పురుషులిద్దరికీ ఈ సమాజ సాంప్రదాయాలలోవున్న అసహజత్వాన్ని గుర్తించే కొత్త దృక్పథం వుండాలి. ఈ దృక్పథం ఏర్పరచుకొని పెళ్ళిని వొదిలెయ్యడం తప్పకుండా ఆదర్శవంతమైన విషయం. దానికి సిద్ధపడే వాళ్ళని ప్రోత్సహించాలిగానీ నిరుత్సాహ పరచకూడదు.

పెళ్ళిని వొదిలెయ్యడం అనేది ఈనాడు వ్యక్తులు ఆచరించగల విషయమే గానీ, సమాజం అంతా ఆచరించగల విషయం కాదు.

2. పెళ్ళి విషయంలో "సెలక్షన్" ఎవరిద్వారా జరగాలి?

జ. పెళ్ళి చేసుకునేది ఎవరో ఎంచుకునేది కూడా వాళ్ళే అని వేరే చెప్పనక్కరలేదు. కలిసి జీవించవలసిన వాళ్ళే ఒకర్ని ఒకరు ఎంచుకోవడం సహజమైన విషయం. అయితే, ఈ విషయంలో స్వంత నిర్ణయాలు చేసుకునే పరిస్థితి ఇంకా స్త్రీకీ లేదు, పురుషుడికీ లేదు. (మొదటి ప్రశ్న కిచ్చిన జవాబునే పునాదిగా పెట్టుకుని మిగతా ప్రశ్నలన్నిటినీ ఆలోచించాలి.)

తనను తను పోషించుకునే శక్తి స్త్రీకి లేనప్పుడు స్వంత నిర్ణయాలు చేసుకునే శక్తికూడా ఆమెకు వుండదు. పురుషుడుకూడా ఇంకా తండ్రి ఇచ్చే ఆస్తిమీద ఆధారపడి వుండడంవల్ల అతనికీ స్వంత నిర్ణయాలు చేసుకునే శక్తి వుండదు. ఒక్క ఎకరం పొలంవున్న నిరుపేద తండ్రి కూడా తన ఆస్తి తన కొడుకులకే ఇస్తాడు. తండ్రిమాట వినకపోతే తండ్రి నించి ఆస్తి రాకపోవచ్చు. తండ్రి ఆస్తిమీదే ఆశలు పెట్టుకునే మొగ పిల్లలూ, తండ్రి ఇచ్చే కట్నంమీదే ఆధారపడి భర్తని సంపాయించవలసిన ఆడపిల్లలూ స్వతంత్రంగా ఎలా ప్రవర్తించగలుగుతారు? ఆర్థిక, సాంఘిక విషయాలతో సంబంధంలేని ప్రేమకీ, స్వంత నిర్ణయాలకీ ఎక్కడ అవకాశం వుంది? అయితే, ప్రేమ వివాహాలు జరగడంలేదా అంటే జరుగుతున్నాయి. అందులో ఎక్కువ భాగం "నాన్నగార్లు" పర్మిషన్ ఇచ్చాక జరిగేవే. తమ ప్రేమని జంకుతూ, జంకుతూ నాన్నగార్ల ముందుకు తీసుకువెళ్తారు. ఆ నాన్నగార్లు తమ శక్తికొద్దీ ఆ ప్రేమని పడగొట్టటానికే చూస్తారు. సాధ్యం కానప్పుడు మాత్రమే ఏడుపు మొహాలుపెట్టి ఒప్పుకుంటారు. "నీ ఇష్టం నీది. నీ నిర్ణయం నీది" అని కొడుకులకూ, కూతుళ్ళకూ చెప్పగల నాన్నగార్లు ఇంకా మనకు పుట్టలేదు. నాన్నగార్లు ఒప్పుకోవడంతో సంబంధం లేకుండా జరిగే వివాహాలే స్వంత నిర్ణయాల వివాహాలు. అలాంటివి ఎన్నివున్నాయో లెక్కలుతీస్తే నూటికి ఒకటికూడా దొరకడం కష్టం. పోనీ ఒకటి దొరకవచ్చు. సమాజంలో తల్లిదండ్రిలూ, పిల్లలూ ఎలాంటి సంబంధాల్లో వున్నారంటే: పిల్లలూ — తల్లి దండ్రిల ఆస్తులమీదా, పెద్దరికాలమీదా ఆధారపడే సంబంధాల్లో వున్నారు. అందుచేత పిల్లలమీద పెద్దల నిర్ణయాలే సాగుతాయి. ఆ పెద్దలు డబ్బుకే, కుల మతాలకే ప్రాధాన్యతఇచ్చే స్థితిలో వున్నారు. పిల్లలుకూడా వాటికే ప్రాధాన్యత ఇవ్వవలసి వస్తుంది. మొత్తానికి — పెళ్ళి విషయంలో సెలెక్షన్ అనేది ఆస్తులమీదా, కుల మతాలమీదా, కుటుంబ సంబంధాలమీదా ఆధారపడ్డ సెలెక్షన్‌గా మాత్రమే జరుగుతోంది. అక్కడక్కడా విడివిడి వ్యక్తులు మాత్రమే దీన్ని తిరస్కరించగలరు గానీ, సమాజం అంతా దీన్ని తిరస్కరించగల పరిస్థితిలో లేదు ఇంకా.

3) 'పెళ్ళి' కి ఏ ఏ విషయాలు ప్రధానం ? పెళ్ళి చేసుకునే వ్యక్తి రెండో వ్యక్తిలో ఏ ఏ విషయాల్ని ప్రధానంగా ఎంచుకుంటే ఆ సంబంధం వున్నతంగా వుండగలుగుతుంది ?

జ) మొదట పరిచయం ఏర్పడి, ఒకరి భావాలు ఒకరికి తెలియాలి. ఒకరి నడవడి ఒకరికి తెలిసి సదభిప్రాయం ఏర్పడాలి. ఒకరి అలవాట్లు ఒకరికి సరిపడాలి. ఒకరి అందచందాలు ఒకరికి నచ్చాలి. అది అనురాగంగా మారాలి. ఇందులో డబ్బు దృష్టి, కుల మతాలదృష్టి, ఇతర కృత్రిమ విలువలదృష్టి, ముఖ్యంగా స్త్రీ పురుషులమధ్య ఎక్కువ తక్కువల దృష్టి లేకుండావుంటే ఆ సంబంధం వున్నంతగా వుండగలుగుతుంది. మొదటి లక్షణాలు అన్నీ వున్నవాళ్ళల్లో కూడా చివరి లక్షణం వుండదు. అంటే, స్త్రీ పురుషులు సమానులనే దృష్టి వుండదు. అందుకే ప్రేమ వివాహాలు కూడా సాధారణ భార్యా భర్తల సంబంధాల లాగానే పరిణమిస్తూ వుంటాయి. సమానత్వం ఏర్పడాలంటే దానికితగిన పునాది వుండాలి. ఇది అలాంటి పునాదిలేని సమాజం కాబట్టి, స్త్రీ పురుషులమధ్య సమానత్వాన్ని వూహించ లేము. ఇదికూడా కొంత ప్రత్యేక చైతన్యంగల స్త్రీ పురుషులమధ్య వుండే విషయమేగానీ, సమాజంలో ప్రతి భార్యా భర్తలమధ్య వున్న విషయం కాదు. ధనిక వర్గాల్ని తీసుకున్నా, మధ్య తరగతుల్ని తీసుకున్నా, పేద తరగతుల్ని తీసుకున్నా స్త్రీ పురుషులమధ్య సమానత్వం అన్న మాటేలేదు.

4) పెళ్ళికి వ్యక్తిగత స్వేచ్ఛకీ సంబంధం వుంటుందా ?

జ) వుండదు. వుండనక్కరలేదు. ఇద్దరు మనుషులు కలిసి జీవించేటప్పుడు అందులో ఎవరి స్వేచ్ఛా పోవలసిన అవసరంలేదు. కానీ, ఇప్పుడు అలాగే జరుగుతోంది. పెళ్ళి అనే వ్యవస్థలోనే స్త్రీల స్వేచ్ఛని తీసేసే గుణంవుంది. భర్తమీద ఆధారపడడం అనే విషయంలోనించే ఈ స్వేచ్ఛ పోవడం అనేది పుట్టుకొస్తుంది. ఈ ఆధారపడడం కేవలం ఆర్థిక విషయాలకే కాదు. స్వంత సంపాదనవున్న స్త్రీలు కూడా, ఆ సంపాదనని ఖర్చు పెట్టుకోవడం దగ్గర్నించీ, సాంఘికంగా అనేక విషయాలకి భర్తమీదే ఆధారపడతారు. ఆధారపడడానికీ, స్వంత స్వేచ్ఛకీ పొసగదు. ఈ సంబంధంలో పురుషుడుకూడా నిజమైన స్వేచ్ఛతో వుండ లేడు. తనమీదే ఆధారపడే స్త్రీతో అతని సంబంధం అనేక అవకతవకలతో,

కృత్రిమత్వాలతో, వంచనలతో నడుస్తుంది. ఈ స్వేచ్ఛ పోవడం అనే విషయంలో స్త్రీ పరిస్తితీ; పురుషుడి పరిస్తితీ వేరు అయినప్పటికీ – పెళ్ళి అనేది ఇద్దరి వ్యక్తిగత స్వేచ్ఛలకూ చెరో రకంగానూ హాని చేస్తుంది.

5) కట్నం — స్త్రీ పురుషులమధ్య సమానత్వ సూత్రానికి వుల్లంఘనే కదా ?

జ) తప్పకుండా వుల్లంఘనే. కట్నం అంటే స్త్రీయే పురుషుడికి ఇచ్చేది. ఇద్దరిమధ్య సంబంధం ఏర్పడడానికి ఒకరు ఇంకొకరికి డబ్బు ఇవ్వవలసి వొస్తోందంటే అది సమానత్వానికి వుల్లంఘనే. అయితే, కట్నం లేకుండా పెళ్ళి జరిగినంత మాత్రాన అదే స్త్రీ పురుషులమధ్య సమానత్వం కాదు. స్త్రీల స్వంత పోషణా; ఇంటి పనులు స్త్రీలకు మాత్రమే బాధ్యతగా వుండని పరిస్తితీ; పిల్లలమీద తల్లికి హక్కూ; పిల్లల పెంపకంలో తండ్రికూడా తల్లిచేసే పనులన్నీ చెయ్యడమూ వగైరా మార్పులు జరిగితేనే స్త్రీ పురుషులమధ్య నిజమైన సమానత్వం ఏర్పడుతుంది. కట్నం తీసుకోనంత మాత్రాన్నే పరిష్కారమయ్యే సమస్య కాదు ఇది. కట్నం తీసుకోక పోవడం అనేది — పురుషుడి సంస్కార భావాలకీ; కట్నంతో ఏర్పడే సంబంధానికి ఒప్పుకోక పోవడం అనేది స్త్రీ ఆత్మ గౌరవానికీ నిదర్శనాలుగా వుంటాయి.

6) కట్నం — ఆడపిల్లవేపు వారికి భారమే కదా ?

జ) ధనిక వర్గాలలోనూ, మధ్య తరగతిలోని పై సెక్షన్లలోనూ కట్నం భారంగా వుండదు. మిగతా కుటుంబాల్లో కట్నం భారమే. "కట్నం భారం కాబట్టి దాన్ని మానెయ్యాలి" అనే దృష్టితో ఆలోచిస్తే — "భారం కాకపోతే ఇవ్వవచ్చు" అనే అర్థం వస్తుంది. ధనవంతులకు భారంకాదు కాబట్టి వాళ్ళు కట్నాలు ఇవ్వడమూ, తీసుకోవడమూ చెయ్య వచ్చునన్నమాటేగా ? "మాకు చాలా డబ్బుంది. కట్నాలివ్వడం మాకు భారం కాదు" అని వాళ్ళంటే ఏమిటి జవాబు మనకి ? ఆ జవాబుతో ధనవంతులందర్నీ వొదిలెయ్యాలి. మధ్య తరగతి విషయమే చూసినా — మరీ భారం అయ్యేంత ఇవ్వకుండా కొంత తగ్గించి ఎవరి తాహతుకి

తగ్గట్టే వాళ్ళుఇస్తే మనకి అభ్యంతరం వుండక్కర లేదుగా? "మా మొగ పిల్లలకు కట్నాలు తీసుకొని అదే తెచ్చి మా ఆడపిల్లలకు ఇస్తాం. కట్నాలు మానడం ఎందుకూ? అదో ముచ్చట!" అని ఎవరైనా అంటే ఏమిటి జవాబు? మొగపిల్లలు లేకుండా ఆడపిల్లలే వున్నవాళ్ళ సంగతా? "మా కెలాగూ మొగపిల్లలు లేరు. మా కున్నదేదో మా ఆడపిల్లలకే. అదే వాళ్ళకి కట్నాలుగా ఇచ్చేస్తాం" అని వాళ్ళంటే? అసలు ఆస్తే లేనివాళ్ళ సంగతా? "పాపం వాళ్ళింట్లో అందరూ ఆడపిల్లలే. వాళ్ళకి ఆస్తిలేదు. కట్నాలు ఇవ్వడం వాళ్ళకి చాలా భారం. కట్నాలు లేకుండా వాళ్ళ పిల్లల్ని పెళ్ళిళ్ళు చేసుకోండి" అని పెళ్ళికొడుకుల్ని వుద్దేశించి అంటాం అనుకుందాం. "కట్నాలివ్వడం భారం అయితే అలాంటి వాళ్ళని పెళ్ళిళ్ళు మానుకోమనండి. వాళ్ళ ఇబ్బందినిబట్టి వాళ్ళు నడుచుకోవాలి గానీ, వాళ్ళ సమస్యకి మేమేం చెయ్యం?" అని పెళ్ళికొడుకులు అంటే? ఒకరి ఇబ్బందినిబట్టి ఇంకొకర్ని నడవమనడం ఎలా సమంజసమవుతుంది? 'ఆడపిల్లలు కలవాళ్ళకి కట్నం భారం అవుతుంది కాబట్టి దాన్ని మానాలి' అనే దృష్టితో ఆ సమస్యనిచూస్తే ఇన్ని అవకతవకలు పుట్టుకొస్తాయి.

కట్నం భారం అవుతుందని కాదు దాన్ని మానవలసింది — అది స్త్రీలకు అవమానకరమైన విషయం కాబట్టి దాన్ని మానాలి. ఈ దృష్టితో చూచినప్పుడు ఎంత డబ్బువున్న స్త్రీ కయినా సరే, కట్నం ఇచ్చి పెళ్ళి చేసుకోవడం అవమానకరమే. ఒక సమస్యవల్ల ఎవరికే అవమానం జరుగుతోందో, ఎవరికి బాధ కలుగుతోందో వాళ్ళని దృష్టిలో పెట్టుకుని చూసినప్పుడే ఆ సమస్యని సహజంగా పరిష్కరించగలం. 'కట్నం భారం అవుతుంది' అనే దృష్టితో చూడడం అంటే, ఆ సమస్యని కేవలం డబ్బు దృష్టితో చూడడం. డబ్బు దృష్టితో చూచినప్పుడు ఏ సమస్యనీ సహజం గానూ సంపూర్ణంగానూ పరిష్కరించలేము. ఆ సమస్య ఒక రూపంలోంచి పోయి ఇంకో రూపంలోకి రావడం మాత్రమే జరుగుతుంది. 'కట్నంఇచ్చి పెళ్ళి చేసుకోవడం మీకు అవమానం' అని స్త్రీలకు బోధించగలిగితే, స్త్రీలకు ఆ అవమానాన్ని గ్రహించగల జ్ఞానం వచ్చినప్పుడే ఆ సమస్య పోతుంది.

'కట్నం ఇవ్వకూడదు' అనే విషయాన్ని చాలామంది — 'ఆడ పిల్లలు తల్లిదండ్రుల్నించి ఏమీ ఆస్తి తీసుకోకూడదు,' అని అర్థం చేసుకుంటారు. అలా అర్థం చేసుకుంటే మాత్రం అది చాలా పొరపాటే. తల్లిదండ్రుల ఆస్తిపాస్తుల్ని కొడుకులూ కూతుళ్ళూ సమానంగా తీసుకోవచ్చును. ఒక ఆడపిల్లకి కట్నం ఇవ్వడం మానేసి, తండ్రి ఆమెకు తన ఆస్తిలో ఒక వాటా ఇస్తాడనుకుందాం. అప్పుడు పెళ్ళికొడుకుల దృష్టి ఇంకో రకంగా మారుతుంది. ఏ పిల్లకి ఎక్కువ ఆస్తివుందా అని చూస్తారు. ఆవును, ఆడపిల్ల తరఫు వాళ్ళయినా చేసేపని అదే. వాళ్ళు మాత్రం ఆస్తిగల పెళ్ళికొడుకుల కోసం వెతకడం లేదూ? అలాగే మొగవాళ్ళూ చేస్తారు. స్వంత ఆస్తి అనేది సమాజంలో వున్నప్పుడు ఆస్తికోసం వెతుకులాటలు ఎలాగూ తప్పవు. కట్నంగా ఇవ్వడం అయితే అది పెళ్ళికొడుకు చేతిలోకి వెళ్ళిపోతుంది. ఆడపిల్లకి ఆస్తి ఇవ్వడం అయితే అది ఆమె పేరనేవుండి ఆమెకి కొంత రక్షణగా వుంటుంది. ఇది కట్నం సమస్యని ఇంకో రూపంలోకి మార్చడమే. ఈ సమస్యకి అసలు పరిష్కారం స్త్రీల చైతన్యమే. స్త్రీ పురుషులమధ్య సమానత్వం ఏర్పరచుకో గలిగినప్పుడు ఈ సమస్య శాశ్వతంగా పోతుంది. కట్నం తీసుకునే పురుషుణ్ణి పెళ్ళి చేసుకోవడం అవమానంగా స్త్రీ భావించినప్పుడు కూడా ఈ సమస్య పోతుంది. ఆ చైతన్యం స్త్రీకి రావాలంటే ఆమె జీవిత పరిస్థితుల్లో ఎన్నో మార్పులు జరగాలి. అంటే, కట్నాల్ని తీసివెయ్యగల పరిస్థితులు ఇప్పట్లో సమాజానికి లేనే లేవన్న మాట.

7) 'ఒకే కులంలో పెళ్ళిళ్ళు' నిషేధించాలా?

జ) పూర్తిగా పొరపాటు అది. పెళ్ళి అనేది ప్రేమమీద ఆధారపడి జరగాలంటున్నాం. ఒకే కులంలోవాళ్ళే ఇద్దరు యువతీ యువకులు ఒకరి నొకరు ఇష్టపడితే? వాళ్ళ పెళ్ళిని నిషేధించాలా? 'వేరువేరు కులాల వాళ్ళు పెళ్ళి చేసుకోకూడదు' అనే వాళ్ళకీ, "ఒకే కులం వాళ్ళు పెళ్ళి చేసుకోకూడదు" అనడానికీ ఏమిటి తేడా? ఇద్దరూ కులాల్ని వదలనట్టే. పిల్లల నిర్ణయాలకు పెద్దవాళ్ళు అడ్డంరాకుండావుంటే చాలు. అది కులాల్ని తీసెయ్యడానికి కొంత వుపయోగపడుతుంది.

8) కులాంతర, మతాంతర వివాహాల అవసరమేమిటి ?

జ) స్త్రీ పురుషుల ప్రేమల్ని విఫలం కాకుండా చెయ్యడానికే అవి అవసరం. ప్రేమే ఆధారంగా ఒక వివాహం జరిగినప్పుడు ఆ వ్యక్తులిద్దరూ వేరువేరు కులాల వాళ్ళయినా, వేరువేరు మతాల వాళ్ళయినా వాళ్ళ దృష్టిలో ఆ తేడాలన్నీ పోతాయి. ప్రేమ లేకుండా, పెద్దవాళ్ళే ఒక కులాంతరాన్నో, మతాంతరాన్నో నిశ్చయించి చేసినప్పుడు ఎవరి మనసులో వాళ్ళ కులమతాల పట్టు ఎప్పటిలాగే వుండిపోతుంది. రెండు కులాల్నీ, రెండు మతాల్నీ పెళ్ళితో కలిపినంత మాత్రాన్నే ఆ ఇద్దరి హృదయాల నించీ అవిపోవు. ఏ తేడాల్నీ లెక్కచెయ్యనంత ఐక్యతగల ప్రేమ వాళ్ళకి వున్నప్పుడే వాళ్ళ హృదయాలనించి కులమతాలు పోతాయి.

ఈ కుల నిర్మూలన, మత నిర్మూలన వాదులు - ఇద్దరు స్త్రీ పురుషులకు పెళ్ళి చెయ్యడం ద్వారానే సమాజంలోవున్న కుల మతాల్ని తీసెయ్యగలం అనుకుంటారు. ఈ కుల మతాలు — దోపిడీ స్వభావంగల ఆర్థిక వ్యవస్థ వల్లనే నిలబడుతున్నాయని తెలియక పోవడంవల్ల కొందరూ, తెలుసు కోడం ఇష్టంలేక పోవడంవల్ల కొందరూ — ఇలా మాట్లాడతారు. కుల మతాల్ని చాలా వివరంగా పరిశీలిస్తే కులాలకూ, మతాలకూ సంబంధించిన మనుషులు అనేక రకాల ఆర్థిక తేడాలలోనూ, సాంఘిక తేడాలలోనూ వున్నట్టు తెలుస్తుంది. ఆ తేడాల్ని తీసెయ్యాలంటే — ఆ తేడాలవల్ల ఎవరైతే బాధలుపడే స్థితిలోవున్నారో వాళ్ళ పక్షాన్ననిలబడి, వాళ్ళ దృక్పథంనించి ప్రయత్నాలు ప్రారంభించాలి. 'కులం,' 'మతం' వంటి మూఢ నమ్మకాలు పోవాలంటే — భౌతిక శాస్త్రజ్ఞానం వుండాలి. అది రావాలంటే ప్రకృతి శాస్త్రాలకు సంబంధించిన జ్ఞానం వుండాలి. అలాంటి జ్ఞానం వుండాలంటే ముందు పేదతనం పోవాలి. చివరికి సమస్యంతా ఆర్థిక పునాదిలోకి వెళ్తుంది. కుల మతాల్ని పోషించి నిలబెడుతోన్న సమాజానికి ఒక ప్రత్యేక ఆర్థిక పునాదివుందన్న స్పృహే లేకుండా, వేరువేరు కులాలలోనూ, మతాలలోనూ కాస్త డబ్బువుండి, చదువుకున్న కుటుంబాల పిల్లల్ని పెళ్ళిద్వారా కలిపితే కులమతాలు పోతాయనుకోవడం అమాయకత్వమో, దాటవేత తనమో మాత్రమే. నిరుపేద కుటుంబాలలో కులాంతర,

మతాంతర వివాహాలు చేయించగలిగారా ఏ సంస్కర్తలయినా ఇంతవరకూ? అలాంటి పెళ్ళిళ్ళు ఎన్ని జరిగాయి ? ఈ సంస్కరణలన్నీ మధ్యతరగతిలో పైస్థాయిలో మాత్రమే కాస్త ప్రభావం చూపిస్తాయి. వాటి శక్తీ, పరిధీ అంతవరకే. అవే మొత్తం అన్ని వర్గాల్నీ ప్రభావితం చెయ్యవు. ఈ కులాంతర, మతాంతర వివాహాలమీద ఇంత స్పష్టమైన స్పృహతో వుండడం అంటే అలాంటి పెళ్ళిళ్ళని వ్యతిరేకించడం కాదు. మనుషుల్ని సమిష్టిగా కలపడానికి వీలయ్యే ఒక మంచిపని, ఎక్కడ ఎంత చిన్న పరిధిలో జరిగినా దాన్ని చాలా గొప్ప విషయంగా భావించాలి. కులాంతర, మతాంతర వివాహాల్ని ప్రోత్సహించడమూ, అలాంటి వివాహాలు చేసుకునే వారికి రక్షణ కల్పించడమూ తప్పనిసరిగా చెయ్యాలి.

9) పెళ్ళికి మతపరమైన కార్యక్రమం తప్పనిసరా ?

జ) మతపరమైన కార్యక్రమమే కాదు, ఏ పరమైన కార్యక్రమమూ తప్పనిసరి కాదు. అసలు పెళ్ళే తప్పనిసరి కానప్పుడు, దానికి ఎలాంటి కార్యక్రమం వుండాలన్న ప్రశ్నలేదు. కానీ, ఈనాడు ' పెళ్ళి ' ని తీసెయ్యగల పరిస్థితిలేదు. పెళ్ళి జరగాలంటే, అది పీటల మీదో, కుర్చీల మీదో, బల్లల మీదో — పురోహితుడి ద్వారానో, ఉపన్యాసకుడి ద్వారానో ఎదో ఒక పద్ధతిలో జరగాల్సిందే. ఈ పెళ్ళి కార్యక్రమం వీలైనంత వరకూ నిరాడంబరంగా వుండాలనీ, భౌతిక శాస్త్రజ్ఞానానికి దగ్గరగా వుండాలనీ ప్రచారం చెయ్యాలి. మంచి మార్పుకే అది తోడ్పడుతుంది.

10) దేశాంతర (కాస్మోపాలిటన్) వివాహాలకు కూడా సిద్ధం కావచ్చా ?

జ) దేశాంతరే కాదు, ఖండాంతరే కాదు, గ్రహాంతర వివాహాలకు కూడా సిద్ధం కావచ్చు — వివాహం జరగాల్సిన వ్యక్తులిద్దరికీ పరస్పరానురాగంవుంటే. విదేశాలలో చదవడంవల్లా, వుద్యోగాలు చెయ్యడం వల్లా విదేశస్తులతో పరిచయాలేర్పడతాయి. ఆ పరిచయాలు స్నేహాలుగానూ, ప్రేమలుగానూ కూడా మారతాయి. వాటిని ఆపవలసిన అవసరమూ లేదు, ఎవరైనా ఆ పని చెయ్యదలచుకుంటే అది సాధ్యమూ కాదు. ఒక దేశానికీ

ఇంకో దేశానికీమధ్య రాకపోకలు వున్నప్పుడు దాన్నించి దేశాంతర వివాహాలు తప్పనిసరిగా పుట్టుకొస్తాయి. అది నూటికి నూరు పాళ్ళూ మానవుల అభివృద్ధికి వుపయోగపడే విషయమే.

11) వేరువేరు కులాల్లో, మతాల్లో, దేశాల్లో జరిగే పెళ్ళిళ్ళకు సంబంధించిన కార్యక్రమాలేమిటి ?

జ) ఈ విషయాల్ని ప్రత్యేకంగా సేకరించిన వాళ్ళు చెప్పాలి దీనికి జవాబు — నేను ఇక్కడ చెప్పేదేమిటంటే — కార్యక్రమంలో ఎన్ని మార్పులువున్నా దాని సారాంశం అంతా ఒకటే. సాధారణంగా పెళ్ళిళ్ళన్నీ మతపరమైన కార్యక్రమాలతోటే, పురుషాధిక్యతకు సంబంధించిన కార్యక్రమాలతోటే నడుస్తాయి. స్త్రీని పురుషుడికి దాసిగా, సేవకురాలిగా, పురుషుణ్ణి అనుసరించవలసిన మనిషిగా చిత్రించే కార్యక్రమాలే అవన్నీ. ఒకవేళ మనం ఈ పాత కార్యక్రమాల్నీ, మంత్రాల్నీ తీసేసి స్త్రీ పురుషుల మధ్య సమానత్వంవుండే లాంటి సూత్రాలతో ఒక వాగ్దాన పత్రం రాయించి కొత్త కార్యక్రమమే మొదలు పెడతాం అనుకోండి. "మే మిద్దరమూ సమానులుగా జీవిస్తాం. ఒకరి కష్టసుఖాలలో ఒకరం పాలు పంచుకుంటాం" వగైరా నిబంధనలన్నీ రాస్తాం అనుకోండి. స్త్రీ పురుషుల మధ్య సమానత్వం ఏర్పడిపోయినట్టే కనపడుతుంది. ఆ పెళ్ళి సభలోంచి ఇంటికి వెళ్ళగానే ఆవిడ వంటింటిలోకీ, ఆయన ఆఫీసులోకీ బైల్దేరతారు. ఆవిడ కూడా ఆఫీసులోకి బైల్దేరినా, తిరిగివచ్చాక ఆవిడే వంటింట్లోకి వెళ్తుందిగానీ ఆయన ఆ ఛాయలకు పోడు. స్త్రీయే ఇంటిపని చెయ్యడం అనేది - దోపిడీ సమాజాల శ్రమవిభజన లక్షణం. సమాజంలో ఆర్థిక పునాది మారి "సోషలిస్టు శ్రమ విభజన" ప్రారంభమైనప్పుడు, స్త్రీ పురుషులమధ్య శ్రమ విభజన కూడా మారిపోతుంది. అంతవరకూ స్త్రీ పురుషులమధ్య సమానత్వం వుండనే వుండదు. సభలో సమానత్వ సూత్రాలు చదివినప్పుడు అది ఆ సభ వరకే పరిమితమవుతుంది గానీ, ఆ సూత్రాలు చదివిన వ్యక్తి అయినా స్త్రీ విషయంలో తన దృక్పథమూ, ఆచరణా మార్చుకోడు. మార్చుకున్నా అది ఆ వ్యక్తికే పరిమితం గానీ, దానివల్ల సమాజం అంతటిలోనూ మార్పు జరగదు. ఆ మార్పుని ఏ సమాజమైతే సాధిస్తుందో, ఆ సమాజంలో

జరిగే పెళ్ళిళ్ళ కార్యక్రమంలో కొన్ని చెప్పుకోదగ్గ మార్పులు ప్రారంభమవుతాయి. రష్యా-చైనాలు "కమ్యూనిస్టు" స్వభావంలోవున్న రోజుల్లో — ఈ పెళ్ళిళ్ళ కార్యక్రమాలు స్త్రీ పురుషులమధ్య సమానత్వ సూత్రాల తోటి ప్రారంభమయ్యాయి. కేవలం పెళ్ళిళ్ళ కార్యక్రమాలలోనే కాదు, వాళ్ళ సమాజ పునాదిలోనూ, చట్టాలలోనూ కూడా ఆ సమానత్వం ప్రారంభమయింది. అది ఇంకా ఎంతో అభివృద్ధి చెందవలసివుండగా, అక్కడ కూడా మళ్ళీ పరిస్థితంతా మొదటికొచ్చింది. స్త్రీపురుషుల్ని ఎక్కువ తక్కువ స్థానాల్లోవుంచి, వాళ్ళ పెళ్ళి కార్యక్రమాన్ని ఎంత "రాడికల్" గా మార్చినా దానివల్ల ఏమీ లాభంలేదు. ఫలానా కులంలో, ఫలానా మతంలో, ఫలానా దేశంలో పెళ్ళి కార్యక్రమం బాగుంటుంది — అనే ధోరణిలో ఆలోచించడం పూర్తిగా పొరపాటు ఆలోచన.



12) 'పెళ్ళి' కి ఎలాంటి నూతన కార్యక్రమం వుండాలి?

జ) పెళ్ళికి గొప్ప నూతన కార్యక్రమం — పెళ్ళి లేకపోవడమే. అంత నూతనత్వం ఇప్పుడు సాధ్యం కాదు కాబట్టి, కొంత నూతనత్వం వరకే ఆలోచించాలి. కేవలం పెళ్ళి జరిగే పద్ధతిలో మాత్రం నూతనత్వం ప్రవేశపెట్టగలం. పీటలుతీసేసి కుర్చీలువేస్తాం. పురోహితుల్ని తీసేసి వుపన్యాసకుల్ని పెడతాం. ఈ వుపన్యాసకులు మంత్రాలు చదువరు కాబట్టి ఇది నూతనత్వమే. కానీ, ఈ వుపన్యాసకులు స్త్రీ పురుషుల సమానత్వం గురించి 10 నిమిషాలు చెప్పకపోతే ఇందులోకూడా ఏమీ నూతనత్వం వుండదు. భార్యా భర్తలు ఒకరిపట్ల ఒకరు సమానత్వ భావంతో ఎలా జీవించాలో, పది మాటలు ఆ పెళ్ళిలో వినపడితే ఆ కార్యక్రమంలోకి కొంత నూతనత్వం ప్రవేశించినట్టే. ఆ నూతనత్వానికి సహకరించే కార్యక్రమం ఏదైనా పెట్టుకోవచ్చు.



13) దేశాంతర వివాహాలకోసం 'కాస్మోపాలిటన్ మేరేజ్ బ్యూరో' లాంటి సంస్థ ఏదైనా పని చెయ్యవచ్చా?

జ) పని చెయ్యవచ్చు. కానీ, దాని పని పెళ్ళి సంబంధాలు కుదర్చడంగా వుండకూడదు. అలాంటి సంస్థ ఏ లక్ష్యంతో పనిచెయ్యాలంటే — దేశాంతర వివాహాలు చేసుకోదల్చిన వాళ్ళకీ, చేసుకున్న వాళ్ళకీ

ఆ దేశాలమధ్య ఏమైనా టెక్నికల్ ఇబ్బందులువస్తే, అలాంటి విషయాల్లో సహాయం చెయ్యడానికి అది కృషిచెయ్యాలి. అంతేగానీ, అది పెళ్ళి సంబంధాలు కుదిర్చే కార్యక్రమం పెట్టుకోకూడదు. ఒకరి ఫోటోలు ఒకరికి పంపడమూ, ఒకరి వివరాలు ఒకరికి తెల్పడమూ, ఒకరి పక్షాన్న ఒకరితో మాట్లాడడమూ వగైరా కార్యక్రమాలేవీ దానికి వుండకూడదు. పెళ్ళి నిర్ణయం అనేది — వ్యక్తులు తమ స్వంత పరిచయాలతోటీ, స్వంత అవగాహనలతోటీ చేసుకోవలసిందే. దాంట్లో ఇతరులెవ్వరూ కలగజేసుకో కూడదు. ఈ "దేశాంతర వివాహసంస్థలు" పెళ్ళిళ్ళ నిర్ణయాలకు మధ్యవర్తి తనం నెరిపితే, వాటికీ పెళ్ళిళ్ళ పేరయ్యలకీ ఏమీ తేడావుండదు. ఆ రకం సంస్థలన్నీ ఇప్పుడు పెళ్ళిళ్ళ పేరయ్యల పనే చేస్తున్నాయి. చెప్పాలంటే వీటిని ఆ పేరయ్యలతో కూడా పోల్చకూడదు, అంతకన్నా కుత్రిమమైన స్థాయిలో, కేవలం డబ్బు దృష్టితో పనిచేస్తాయి ఇవి.

14) పెళ్ళికీ స్త్రీ స్వేచ్ఛకీ సంబంధం వుందా ?

జ) ఇంతకు ముందు చెప్పిన జవాబే ఇది. ఈ ప్రశ్నకి జవాబు చాలా చిన్నది. పెళ్ళితోనే స్త్రీ స్వేచ్ఛ సంపూర్ణంగా ముగుస్తుంది ఈ సమాజంలో.



# విషవలయంలో భారతదేశ స్త్రీ



— ఎం. వనజాల.

భారతదేశ స్త్రీ వివాహితయైనా, అవివాహితయైనా సామాజిక ఆర్థిక పరమైన విషవలయంలో చిక్కుకొనియున్నది. ఈ వ్యాసము ఈ ప్రతిపత్తిపై ఆధారపడియున్నది. ఈ సామాజిక ఆర్థిక విలువల వేళ్ళు ఎంత లోతుకు పాతుకుపోయాయి అంటే ఏ ఒక్క సామాజిక సంస్కరణ కూడా వీటిని పెకలించలేదు.

వలయము I. స్త్రీ సామాజిక విలువలకు ఎట్లు గురి అయినదో తెలుపును. ఈ విలువలు పురుషాధిక్యత గలవి. న్యాయశాసనాలు, చట్టాలు ఈ సామాజిక ఆచారాలపై సంప్రదాయాలపై ఆధారపడి నిర్మితమవుతున్నవి. ఈ విధమైన రెండు గొడ్డలిపెట్లు :-

1) సాంప్రదాయాలు, ఆచారాలు. 2) శాసనాలు, చట్టాలు. స్త్రీ 'స్త్రీ మూర్తి' గా పరిగణించబడడానికి, సమాజముతో అతి జాగ్రత్తగా సర్దుబాటుతో మెలగనేర్చుకొనును. ఈ విధమైన పరిస్థితిలో పెరిగిన స్త్రీకి సమాజము స్థానమును, స్థాయిని కేటాయించును.

ఈ సామాజిక పరిధులలో పెరిగిన స్త్రీ వ్యక్తిత్వ వికాసానికి, అభివృద్ధికి కూడ పరిధి, పరిమితి ఏర్పరచి అంతర్గతమైన మరియొక వలయాన్ని అల్లుటకు తోడ్పడును.

ఈ అంతర్గత విషవలయము వివాహముతో ఏర్పడిన బహిర్గత విష వలయముతో కలిసి స్త్రీకి వివాహము ఒక అత్యవసర మానవ అవసరముగా పరిగణింప జేయును. ఈ వివాహ బాధ్యతలైన కుటుంబము, దీని అవసరాల పరిపూర్తి ప్రథమస్థాన మాక్రమించి విద్యావంతురాలైన స్త్రీకి పై చదువులకు

గాని, ఇతరమైన నిపుణతలు గాని అలవరచు కొనుటకు అవకాశాలుంచవు. ఇక విద్యలేని స్త్రీకి ఇక వీటి విషయాలు చెప్పనక్కరలేదు.

ఇక అవివాహిత స్త్రీకి సమాజంలో తగుస్థానం లేకపోవుటయే కాక, తరతరాలుగా వస్తున్న సాంప్రదాయాల ధిక్కరణ తల్లిదండ్రుల ప్రతిష్టకు భంగకారణము మరియు అన్నదమ్ములకు ఆస్తి కలతలకు కారణముగా ఆమె ఎంచబడును.

ఈ విధముగా భారత స్త్రీ అంతర్గత, బహిర్గత విషవలయాలలో చిక్కు కొనియున్నది. ఈ వలయాలు పరస్పర సహాయముతో ధృఢపడును.

"ఏ విధముగా ఈ విషవలయాలను ఛేదించాలి? మరియు ఏ విధముగా సంపూర్ణ సామాజిక అవకాశాలను వినియోగించాలి? దీనిలో వివాహము యొక్క పాత్ర ఏమిటి? ఈ ప్రశ్నలకు జవాబు చెప్పడములోనే వివాహవ్యవస్థ భవిష్యత్తు ఆధారపడియున్నది.

1వ పటము

## స్త్రీపై అంతర్గతాల ప్రభావము

సాంప్రదాయ, సాంస్కృతిక విలువలు, వాటికి సామాజిక ప్రాధాన్యత.

చట్టాలు, శాసనాలు, సామాజిక నైతికవిలువలు.

పరిమిత సామాజిక అవకాశాల వినియుక్తము, పరిమిత కర్తవ్యాల పరిధి స్త్రీ వ్యక్తిత్వాభివృద్ధి పరిమితం జేయును.

స్త్రీ, మాతృమూర్తి, (బంధు మిత్రులకు) అన్నపూర్ణ, నైతికవిలువలున్న సహధర్మచారిణి ఈ వాతావరణములో పెరిగిన స్త్రీ.

అల్పసామాజిక అవగాహన, తక్కువ స్థాయిలో సామాజిక స్థానము, మరియు పరిమిత కర్తవ్యాల అవకాశాల లభ్యత.

2వ పటము

## వివాహిత స్త్రీలపై బహిర్గతాల ప్రభావము

### వివాహము ఒక అత్యవసర సామాజిక విలువ.

స్త్రీ ఉద్యోగరిత్యా తక్కువ స్థాయిలో స్థిరపడి వుండుటవలన సామాజిక దృష్టిలో పురుషుని ఆధిక్యతకు లోబడి వుండవలెను.

స్త్రీకి కుటుంబము, కుటుంబ పరిచర్యలు దాని ప్రాముఖ్యత ప్రధమ స్థాన మాక్రమింప జేయును.

ఈ ఆటంకాలే స్త్రీకి ఆర్థిక కార్యక్రమాలు చేపట్టడములోను ఉద్యోగావకాశాలు సద్వినియోగము చేసుకోవడములో గాని, ఆర్థిక స్థాయిని గాని పెంచుకోవటములోను అవకాశాలను తగ్గించి వేయుచున్నది.

చదువుకున్న వారికి, సహితము ఈ బాధ్యతలు పై చదువులకు లేక శిక్షణా కార్యక్రమాలు చేపట్టుటకు ఆటంకాలుగా ఏర్పడును.

3వ పటము

## అవివాహిత స్త్రీలపై బహిర్గతాల ప్రభావము

అవివాహిత స్త్రీకి సమాజంలో గౌరవనీయ స్థానములేదు.

అవివాహిత స్త్రీ సామాజిక, కుటుంబ మరియు ఆస్తిపరమైన కలతలకు కారణమగును.

దోషభావన ఏర్పడుటయు సామాజిక రక్షణ లేకపోవుటయు, నిరాశా నిస్పృహతో జీవితముపై విముఖత్వమేర్పడును.

ఈ విధముగా మానవత అభివృద్ధికి అతీతమైన స్త్రీ జీవితములో అవిశ్వాసముతో అసంతృప్తితో సతమతమగును.

కలిగివుంటే పెళ్ళయిన తరువాత పేదరికంవల్ల కలిగే బాధలను గురించి ఘర్షణ పడవలసిన పనివుండదు. పేదరికంలో తాము యెందుకున్నామో గ్రహించుకొని దానినుండి ఎలా విముక్తి పొందాలో ఆలోచించుకొని తగు కృషి చేసుకొంటారు.

పిల్లల్లో హేతుత్వం పెంపొందించవచ్చు. పిల్లల్లో ఛాందస స్వభావాలు, గుడ్డి నమ్మకాలు పెరగకుండ చెయ్యవచ్చు. మతం, కులం, భాష, ప్రాంతాల పుట్టు పూర్వోత్తరాలు, చారిత్రక దృష్టితో తెలుసుకొని వుండటానికి వీలుకలిగి సాంఘిక సమస్యలపట్ల విశాల దృక్పథం యేర్పడుతుంది.

శాస్త్రీయ దృష్టివున్న ఇద్దరు వ్యక్తులు వివాహ బంధంలోకి వస్తే వ్యక్తి పరంగా, కుటుంబపరంగా కలిగే మంచి ఫలితాలు చాలా ఉన్నాయి:-

1) విమర్శనా దృష్టిని పెంపొందించు కోటానికి అవకాశం కలుగుతుంది ;

2) సహచరుల్లో హేతుత్వశక్తి పెంపొందించవచ్చు ;

3) తన ప్రవర్తనకి తన చుట్టూవున్న సంఘానికి మధ్య ఉన్న సంబంధ బాంధవ్యాలను గురించి సమ్యక్ దృష్టి కలుగుతుంది ;

4) ప్రకృతి అతీతమైన శక్తులపై ఆధారపడకుండ తన కాళ్ళపై తాను నిలబడగలిగే శక్తి కలుగుతుంది ;

5) అన్యాయాలను, అక్రమాలను, అసమానతలను ఎదిరించి, విమర్శించే మానసిక ధైర్యం కలగుతుంది ;

6) స్త్రీలు, పురుషులు సమానమనే భావన పెరుగుతుంది ;

7) సమాజాన్ని వెనుకకు తీసుకుపోతున్న అంశాలను విడిచిపెట్ట డానికి, ముందుకు తీసుకుపోయే అంశాలకు చేయూతనివ్వడానికి వీలవుతుంది;

8) విశ్వమానవ హక్కులకు అనుగుణంగా నియమాలను, చట్టాలను రూపొందించటానికి సహాయకారులు కావటానికి వీలవుతుంది.

(ఎం. వి. రామమూర్తి: హేతువాదమంటే ? 66-68 పుటలు)

ప్రాంతాల్లో కొంతగా బాల్య వివాహాలు జరుగుతూనే ఉన్నాయి. రెండవది, వీలైనంత వరకు వ్యక్తుల తరఫున ఇతరులు వివాహాన్ని యేర్పాటు చేయరాదు. అంటే ప్రస్తుతం జరుగుతున్న పెద్దలు కుదిర్చిన పెండ్లిండ్ల స్థానే వధూవరులు నిర్ణయించుకునే వివాహాలు రావాలి. అంటే ఆ వివాహం ఆ యా వ్యక్తుల అంగీకారంతోనే జరిగేవిగా ఉండాలి.

వ్యక్తులు పరస్పరం తమను తాము తెలుసుకొని అర్థం చేసుకొని పెళ్ళి చేసుకో గలిగినప్పుడు, వారికి, వారి ఇరుగు పొరుగు వారికి, చుట్టూవున్న సమాజానికి యెంతో ప్రయోజనం చేకూరుతుంది. పెళ్ళయిన తరువాతనే ఒకరినొకరు తెలుసుకొనటానికి వీలవుతుందని చాలామంది అంటారు. ఇది వాస్తవం కాదు. ఈ సందర్భంగా రచయిత్రి రంగనాయకమ్మ మాటలు గుర్తించుకో దగ్గవి :-

"మీరు బజార్లో కూరగాయలు కొనితెచ్చుకుంటే ఇష్టమొచ్చిన పద్ధతిలో కూరలు వండుకోవచ్చు. బజార్నించి బట్ట తెచ్చుకుంటే ఇష్టమొచ్చిన ఫేషన్‌లో చొక్కా కుట్టించుకోవచ్చు. ఒక మనిషిని జీవితంలోకి తెచ్చుకొని ఆ మనిషిని యెలా కావాల్నంటే అలా మార్చుకోవచ్చు ననుకోవటం ఉత్త తెలివి తక్కువా, నీచమూ, అహంకారము. ఒక వ్యక్తి జీవితాన్ని మార్చేయడానికి ఆ వ్యక్తికి తెలియకుండ ప్లాను చెయ్యడానికి ఇంకో వ్యక్తికి హక్కులేదు." (శాస్త్రీయదృక్పథం : కొన్ని ప్రశ్నలు - జవాబులు, 153 పుట)

శాస్త్రీయ దృక్పథానికి కార్యకారణ సంబంధం ప్రాతిపదిక సహేతుకం కాని దానిని, వివేచనతో నిమిత్తంలేని దానిని, శాస్త్రజ్ఞానం మీద ఆధార పడని దాన్ని అంగీకరించక పోవటమే శాస్త్రీయదృష్టి. మన పూర్వులు చెప్పారనో, మన మతగ్రంథాలు చెప్పాయనో మన పీఠాధిపతులు ప్రవచించా రనో మనం దేనినీ అంగీకరించరాదు.

ఒకరినొకరు తెలుసుకొని భార్యా భర్తలయితే కలిగే సత్ఫలితాలు చాల వున్నాయి.

ఉదాహరణకి భార్యాభర్త లిద్దరూ పేదరికంతో బాధపడుతున్నారను కుందాం. పేదరికాన్ని గురించి శాస్త్రపరమైన విశ్లేషణ వారు ముందే

# వివాహం: శాస్త్రీయ దృక్పథం

— సి. శేషారత్నం

వివాహ వ్యవస్థను ఒక ప్రత్యేక అంశంగాకాక బహుముఖ సాంఘిక, ఆర్థిక, సాంస్కృతికఅంశాలతో ముడిపడివున్న సమస్యగా చూడాలి. సమాజ పరిణామక్రమాన్ని శాస్త్రీయ దృక్పథంతో, చారిత్రిక దృష్టితో పరిశీలించినప్పుడే వివాహంలాంటి అతి ముఖ్యమైన సామాజిక వ్యవస్థ లోతుపాతులను తెలుసుకొనడానికి వీలవుతుంది.

ప్రజల్లో శాస్త్రీయ దృష్టి, ముఖ్యంగా మనలాంటి దేశ ప్రజల్లో పెరగటం అంత తేలికగా జరిగేదికాదు. దీనికి కారణం మన శతాబ్దాల సంస్కృతి, సాంప్రదాయం అడ్డంకులుగా ఉండటమే. సమాజంలో స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమత, సమానత్వం అనే విలువలకు గుర్తింపు కలిగిననాడే శాస్త్రీయ దృక్పథం పెరుగుతుంది.

ఇప్పుడున్న వివాహ వ్యవస్థ శాస్త్రీయం కావాలంటే చాలాకాలం వేచి వుండాలి. దానికోసం మనమంతా యెంతో కృషిచేయాలి. మనకున్న పరిమితులద్వారా చేయవలసినంతకృషి చేయులేకపోతున్నాం. ఈ పరిస్థితుల్లో నేటి వివాహ వ్యవస్థ శాస్త్రీయ దృక్పథపు పెంపుదలకు తోడ్పడగలదా? ఈ ప్రశ్నను చాల లోతుగ పరిశీలించాలి. వివాహం ఇద్దరు వ్యక్తుల కలయిక. ఈ కలయికకు ఆధారం కేవలం వ్యక్తుల, తల్లిదండ్రుల, బంధువుల నిర్ణయాలు కారాదు. తమంతట తామే ఒకరినొకరు వీలైనంత ఎక్కువగ అర్థం చేసుకోవటమే కలయికకు ఆధారం కావాలి. అంటే బాల్య వివాహాలు జరగకూడదు. మన తెలుగునాడులో కందుకూరి వీరేశలింగం లాంటి సంఘ సంస్కర్తల కృషి ఫలితంగా బాల్య వివాహాలు జరగటం తగ్గినా, గ్రామీణ

# ★ వివాహ వ్యవస్థ: ఆలోచనాంశాలు ★

— డా॥ పి. సంజీవమ్మ.

సమాజంయొక్క ఆరోగ్యాన్ని నిలబెట్టేవి ప్రధానంగ స్త్రీ పురుష సంబంధాలు – అంటే వివాహవ్యవస్థ. సమాజం యొక్క సంస్కృతిని ప్రతిబింబించేవి ముఖ్యంగ ఈ సంబంధాలే. సమాజం యొక్క స్వరూపాన్ని మలిచేవి ఆర్థిక రాజకీయ అంశాలే అయినప్పటికీ, దానికి పుష్టినిచ్చి ఆరోగ్య వంతంగ నిలిపేవి సాంస్కృతిక సంబంధాలు. అందులో స్త్రీ పురుష సంబంధాలు ప్రధానమైనవనేది నొక్కి చెప్పాల్సివుంది. ఈ సంబంధాలకు రూపం యిచ్చేదీ, వాటిని నిర్ణయించేదీ వివాహవ్యవస్థ. ఈ వ్యవస్థ సవ్యంగ కొనసాగితేనే సమాజానికి మంచి మనుగడ.

కాబట్టి ఈనాటి వివాహవ్యవస్థ స్వరూప స్వభావాల్ని గురించి పరిశీలిద్దాం. వివాహం అనగానే ఈనాడు ఆడపిల్లల్ని, వాళ్ళ తల్లిదండ్రుల్ని విపరీతంగా భయపెట్టేది, బాధించేది కట్నం. ఆపైన 'కట్నం హత్యలు'. కట్నంహత్యలు అన్న పదం మన నిఘంటువుల్లో చేరిన కొత్తపదం. ఈ హత్యలు నేడు పరమ దారుణమైన స్థాయికి చేరుకున్నాయి. కాసుకి విలువ పెరుగుతున్న కొద్దీ స్త్రీ మానప్రాణాలకి విలువ తరిగిపోతూంది. ప్రతిరోజూ వార్తల్లో స్త్రీల మానభంగాలు, కట్నంహత్యల గురించి దండిగా వింటూనే మరోవైపు మన సంస్కృతి ఔన్నత్యాన్ని గురించి గొంతులు చించుకుంటున్న వైపరీత్యాన్ని కంటూనే వున్నాం.

మన ఈనాటి ఆర్థికవ్యవస్థ పెట్టుబడిదారీ వ్యవస్థ. కాని సాంస్కృతి కంగా మనం యింకా రాచరిక (ఫ్యూడల్) యుగంలోనే జీవిస్తున్నాం. పెట్టుబడిదారీ నాగరికత వేషభాషల్లోనే చూస్తున్నాం కానీ, జీవిత విధానం లోని చాలా విషయాల్లో ఫ్యూడల్ విధానాలే, ఆ భావాలే, ఆ ఆలోచనలే,

ముఖ్యంగా ఆ మనస్తత్వమే కొనసాగుతున్నాయి. పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ ఫలితంగా కట్నాలు వాటి రేట్లు విపరీతంగా పెరిగిపోతూ స్త్రీల చావులకి, హత్యలకి కారణమవుతూ వివాహవ్యవస్థ స్వరూపాన్ని పరమ వికృతంగా తయారు చేస్తుండగా, మరోవైపు పురుషాధిక్య భావన ఆడది అణిగి మణిగి వుండాలనే తత్వం, వివాహాలు జరిగే పద్ధతులూ వైవాహిక 'ధర్మాలు' – ఇవన్నీ ఫ్యూడల్ సంప్రదాయాన్నే ప్రతిబింబిస్తున్నాయి. అంటే ఈ రెండు వ్యవస్థల్లోని దుష్ట లక్షణాల్నే సంతరించుకొని నేటి వివాహ వ్యవస్థ కుళ్ళి కంపుకొడుతున్న పరిస్థితిలో వుంది.

ఫ్యూడల్ వ్యవస్థలోని వివాహాలు కట్నాల ప్రాముఖ్యం లేనివి కాబట్టి కనీసం స్త్రీల ప్రాణాలకైతే భద్రత వుండేదికాని, మిగిలిన అన్ని విధాల వాళ్ళ జీవితాలు అధ్వాన్నమయం అనేది మాత్రం వాస్తవం. అవిద్య, అజ్ఞానం మూర్తీభవించిన స్త్రీ ఆర్థికస్వాతంత్ర్యం అనేమాట ఆమె జీవితం దరిదాపులకైనారాలేని పరిస్థితుల్లో వైవాహికజీవితం ఎలాగడిపేదో, ఎంత అణచివేతకు గురిఅయిందో ఆలోచించవచ్చు. ఆచార సంప్రదాయాల పేర వంటయింటికీ పడకటింటికీ బందీఅయి, మరోవైపు పురుషాహంకారం చేత ఒక వ్యక్తిత్వం అనేమాటే లేక పూర్తిగా బానిసస్థితికి నెట్టబడివుంది. అలాంటి పరిస్థితుల్లో స్త్రీ పురుష సంబంధాలు ఎంత కృత్రిమంగా తయారయి వుంటాయో, స్త్రీ పురుష సంబంధానికి – వివాహానికి ప్రాతిపదిక కావలసిన 'ప్రేమ' అనే పదార్థం వారిజీవితాలకు ఎంత దూరంలో వుండేదో వూహించుకోవచ్చు.

పెట్టుబడిదారీ వ్యవస్థ స్థిరపడటంతో సమాజంలో వచ్చిన ఎన్నో మార్పులతో పాటు స్త్రీల పరిస్థితుల్లోనూ మార్పు వచ్చింది. చదువుకొనే అవకాశాలు, వుద్యోగాలుచేసే అవకాశాలు లభించాయి. కాని ఈ అవకాశాలు ఎందరికో అందుబాటులో లేవు అనే విషయమూ మనం మర్చిపోరాదు. చదువు, విజ్ఞానమూ, కొంత ఆర్థిక స్వాతంత్ర్యమూ స్త్రీకి వ్యక్తిత్వాన్ని యిచ్చాయి; తన హక్కుల్ని గుర్తించి వాటి కోసం తిరుగుబాటు చేసి పోరాడే చైతన్యాన్ని కలిగించాయి. అయితే ప్రస్తుత జనాభాలో సగభాగం గావున్న స్త్రీలలో విద్యావకాశాలు లభించి, విజ్ఞానార్జనచేసి, చైతన్యవంతంగ

పోరాడగలిగిన స్త్రీలు నూటికొక్కరైనా వున్నారని చెప్పటం సాహసమే. ఈనాటి వివాహాలు – కట్నాలు, స్త్రీ పురుష సమానత్వం, స్త్రీకి ఆస్తి హక్కు మొదలైన సమస్యల్ని గురించి మనం ఇప్పుడు ఆలోచిస్తున్నది స్త్రీల జనాభాలో చాల తక్కువ భాగంగావున్న మధ్య తరగతి స్త్రీల విషయమే ప్రధానంగ అనే సంగతి గుర్తుంచుకోవాలి. ఇక పై తరగతి స్త్రీలూ పురుషాధిక్య భావనచేత అణచివేతకు గురిఅయినవాళ్ళే అయినప్పటికీ వాళ్ళకి ఆర్థిక పరమైన సమస్యలు, వాటినుండి వుత్పన్నమయే యితర సమస్యలూ దూరంగా వుంటాయి. జనాభాలో అత్యధిక భాగం క్రింది తరగతివారు, అందులోనూ కార్మిక కర్షకవర్గం స్త్రీలు స్త్రీ జనాభాలో ప్రధానమైన భాగం. వారి సమస్యలు అందరి స్త్రీలకుండే సమస్యలతోపాటు మరిన్ని అదనమైనవీ వున్నాయి. వాళ్ళు వాళ్ళ పురుషులతో పాటు ఆర్జనపరులే అయినప్పటికీ తరతరాల పురుషాధిక్య భావనచేత అతినీచంగ బాహాటంగ అణచివేయబడుతున్నారు. అందువల్లనే కాబోలు వాళ్ళలో అవిద్య, అజ్ఞానం నిండుగ వున్నప్పటికీ తిరుగుబాటు మనస్తత్వం మాత్రం బాగా చోటు చేసుకొని వుంటుంది. కాని తిరగబడినప్పటికీ వాళ్ళ విషయంలో ప్రయోజనం శూన్యం. మగవానిచేత తిట్లు తన్నులూతింటూనే, కూలిసంపాదిస్తూ యింటిని, పిల్లల్ని గురించిన బాధ్యత పూర్తిగ వహించాల్సి వుంటుంది. ఈ స్త్రీల పరిస్థితి 'బానిసకు బానిస' అన్న చందంగ వుంటుంది. మధ్య తరగతి వరకే పరిమితమై వుండిన కట్నాల అంటుజాడ్యం చాల తొందరగ క్రింది తరగతికీ వ్యాపించి ఆ స్త్రీల జీవితాల్ని మరింత దుర్భరం కావించే స్థితిలో వుంది.

మధ్యతరగతి స్త్రీల బ్రతుకుల్ని ప్రధానంగ ఈనాడు వివాహం-కట్నం అనే సమస్య పీల్చి పిప్పిచేస్తుంది. కట్నాల మూలంగా స్త్రీలకి పెళ్ళిళ్ళు కావటమే కష్టంగావున్న వాస్తవాన్ని ప్రత్యక్షంగా చూస్తున్నాం. సమాజంలో అతి సహజం అయిన సంసార జీవితానికి కట్నం కారణంగా యెందరో స్త్రీలు దూరంగ వుండాల్సి వస్తూంది. ఎంత కృత్రిమమూ, నికృష్టమూ అయిన పరిస్థితి ఇది! కష్టించి ఆర్జించి అప్పులుచేసి కట్న కానుకలు చెల్లించి ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేసిన తలిదండ్రులకు తరువాత అయినా తమ పిల్లలు సుఖంగా సంతోషంగా కాపురాలు చేసుకొంటూ బ్రతగ్గలరనే గ్యారంటీ లేదు. మరిన్ని కట్న కానుకల కోసం జీవితాంతం హింసించే భర్త, అత్తమామలు,

మరో కట్నంకోసం మరో భార్యను తెచ్చుకోవటం కోసం వున్న భార్యను నిలువునా నిప్పులుపోసి తగలేసే ధనపిశాచాలు విలయతాండవం సలుపుతున్న రోజులివి! ఆడపిల్లల్ని కన్న తల్లిదండ్రులకు దుర్భరమైన కడుపు శోకమే దక్కుతుంది.

ఆడపిల్ల పెళ్ళి అంటూనే-పెళ్ళిధర-కట్నం కుదరటమే ప్రధానం. ఆడపిల్లలు ఒకచీరనో, మరోవస్తువునో కొనేందుకు వెచ్చించేంత సమయాసైనా జీవిత భాగస్వామిని ఎన్నుకోటానికి యిచ్చేందుకు వీలులేకుండ పోతుంది. కట్నం ధర కుదరటమే పెళ్ళికి పరమ ప్రయాణం ఈనాడు అంటే జీవితంలో అత్యంత ప్రధానమైన విషయానికి – డబ్బుకు లంకె అన్నమాట. పెళ్ళికి ప్రాతిపదిక కావాల్సిన ప్రేమస్థానంలో డబ్బు తిష్టవేసుకొని కూర్చుంది.

చదువు, ఉద్యోగమూవుండి - పురుషునితో సమానంగా సంపాదిస్తూ ఎందునా వానికి తీసిపోకుండ వున్న స్త్రీలు, ఎన్నో విషయాల్లో పురుషునికి మిన్నగవున్న స్త్రీలూ కూడ "పెళ్ళి" అంటూనే మగవానికి – కేవలం వాడు "మగవాడు" అయినందుకే కట్నం కానుకలు సమర్పించక తప్పటం లేదు - అదీ హెచ్చు స్థాయిలోనే. కట్నం సమర్పించుకోవటం కోసమే స్త్రీలు కొందరు కొంత కాలం వుద్యోగంచేస్తూ సంపాదించి కూడబెట్టి పెళ్ళి పేరుతో ఈ "వెల మగల్ని" కొనుక్కొని కాపురాలు చేయాల్సిన దౌర్భాగ్యం పట్టింది. ఈ వెలమగలు మరి "భర్తలు" అనే మాటకు ఎంతమాత్రం తగుదురు? వీళ్ళు మరల అందరి భర్తల్లాగే భార్యమీద పెత్తనం, అధికారం చెలాయించే వాళ్ళే, పురుషాహంకారంతో పెళ్ళాల్ని హింసించేవాళ్ళే.

ఇటీవలి కాలంతో మన భారత రాజధాని ఢిల్లీ మహానగరంలో కట్నం హత్యలు మరింత అధికమయ్యాయి. సంవత్సరానికి కొన్ని వందల సంఖ్యలో జరుగుతున్నాయి. ఈ హత్యలకి గురవుతున్న స్త్రీలందరూ పోనీ చదువు సంధ్యలు లేనివాళ్ళా అంటే, అదీకాదు. అందులో వున్నత విద్య పొందిన వాళ్ళు వుండటం గమనార్హం. ఒక చంద్రమోహినీ సలూజా సుప్రీం కోర్టులో న్యాయవాది, మరో రీటా ఖురానా గెజిటెడ్ ఆఫీసర్, శకుంతలా అరోరా పి. హెచ్. డి. పట్టంపొంది డి.లిట్ చేస్తున్న వ్యక్తి - - మరెందరో వున్నత విద్యావంతులైన స్త్రీలు ఈ హత్యలపాలైన వారే. స్టీల్ కప్ బోర్డ్ కానుకగా తేలేదని ఒకామె, పెద్ద ఫ్రిజ్ బదులు చిన్న ఫ్రిజ్

తెచ్చిందని మరొకామె, ఫర్నిచర్ చాలినంత లేదని మరో వధువూ వివాహాలు జరిగిన దినాలు, వారాలు, నెలలలోపునే హత్య చేయబడ్డారు! ఈ కేసులు కోర్టుల్లో జరుగుతున్నాయి. న్యాయవ్యవస్థ పుణ్యమా అని చాలా మంది హంతకుల శిక్షలనుండి తప్పించుకొంటున్నారు. (చంద్రమోహనీ సలూజా కేసులో ఇటీవలే తీర్పు ఇచ్చారు. ఆమె భర్తకు, అత్తమామలకు యావజ్జీవ కారాగార శిక్ష విధించారు - శుభం) కట్నాలు, కానుకలు డిమాండ్ చేసే ఈ కొత్తరకం 'బిచ్చగాళ్ళు', ఇవ్వకపోతే హంతకులుగ మారుతున్న ధనపిశాచాలు విచ్చలవిడిగానే తిరుగుతున్నారు ఈ వ్యవస్థలో.

ఈ కట్నం హత్యలు రోజురోజుకీ అధికమగుతున్నందు వల్లా, చదువు కొని ఉద్యోగాలు ఆధారంగ బ్రతుకుతున్న ఈ మధ్య తరగతిలో కట్నాలు పెద్ద సమస్య అయినందువల్లా దీనిమీద ఈనాడు దేశమంతటా పెద్ద ఎత్తున చర్చలు జరుగుతున్నాయి. పార్లమెంటులో, అసెంబ్లీలోనూ చర్చలు జరుగుతున్నాయి. కట్నాలు తీసుకోవటాన్ని నిషేధించిన చట్టమైతే ఎప్పట్నుంచోవుంది కాని, పెళ్ళి జీవితంతోముడిపడివున్న సున్నితమైన సమస్య అయినందువల్ల అది నిష్ప్రయోజన మయింది .దాన్ని సంచరించ టానికి బోలెడు చర్చలు జరుగుతున్నాయి. మరి ఇది ఏ రూపాన్ని తీసుకొని సమస్యను ఎదుర్కొ గలుగుతుందో వేచి చూడాల్సి వుంది.

ఈ సమస్యకు ఒకానొక పరిష్కార మార్గంగా స్త్రీకి వారసత్వపు ఆస్తిలో హక్కు కల్పించడాన్ని ప్రతిపాదిస్తున్నారు పలువురు. స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యాన్ని కలిగించేది, వ్యక్తిత్వాన్ని యివ్వగలిగేది కూడ అవుతుంది ఆస్తిహక్కు. కాబట్టి తప్పకుండా పురుషునితో సమానంగా ఆస్తిలో వాటా వుండటం అవసరం స్త్రీకి. కానయితే యిందులో మరో చిక్కు ఎదురవక తప్పదు. ఏ స్త్రీకి ఆస్తిలో వాటా ఎక్కువుంటుందో ఆ స్త్రీలనే పెళ్ళి చేసు కోటానికి ముందుకు వస్తారు పురుష పుంగవులు! తక్కువ ఆస్తులున్న, మరే పేదవారు అయిన స్త్రీల గతేమిటి? కాబట్టి సమస్య పూర్తిగ పరిష్కారమవ టానికి యిది మాత్రమే మార్గం కాజాలదు.

మన వివాహ వ్యవస్థలో అతి ప్రాధాన్యం వహిస్తున్నది కులవ్యవస్థ ఒకటి. ప్రపంచంలో ఏ దేశంలోనూ లేనట్టి వింతయిది. మన సమాజాన్ని తలక్రిందులుగ నడిపిస్తున్న వ్యవస్థయిది అనిపిస్తుంది. కట్నాలు అనే ఆర్థిక కారణం మన వివాహ వ్యవస్థను ప్రత్యక్షంగా దెబ్బతీస్తూంటే, కులవ్యవస్థ

అనే సామాజిక కారణం పరోక్షంగ దెబ్బతీస్తున్న విషయం వాస్తవం. కులం తప్పి వివాహం చేసుకోవటం మహా పాపంగ పరిగణిస్తున్న ఫ్యూడల్ మన స్తత్వం మనలో జీర్ణించుకొనివుంది. కులవ్యవస్థ కారణంగ వధూవరుల ఎన్నికలో విస్తృత పరిధిలో ఎంపిక లేకుండా పోతుంది. 'కులపోడ్నే' పెళ్ళి చేసుకోవాల్సి రావటంతో కట్నం విషయంలో వాడు చెట్టెక్కి కూచునే అవకాశం మరింత ఎక్కువగవుంది. ప్రేమ ఆధారంగ కులాంతర, మతాంతర వివాహాలు విస్తృతంగా జరప గలిగిన నాడు కట్నాల సమస్య కొంతవరకు తీరటమేకాదు, కులవ్యవస్థే కదలబారటానికి దోహదం అవుతుంది. అయితే అదంత సులభసాధ్యం మాత్రం కాదు.

ప్రేమవివాహాలు కట్నం సమస్యను పరిష్కరించే మార్గాల్లో ఒకటిగ భావిస్తున్నాం. అయితే భాషలలో ఈ 'ప్రేమ' అనేపదం ఈనాడు దుర్వి నియోగ మవుతున్నంతగ మరే పదమూ కావటం లేదేమో. ఆ పదానికి ఏనాడూ సరిగ అర్థాన్ని గ్రహించినట్లు లేదు సమాజం. ఎప్పట్నుంచో సాహిత్యంలో, కళల్లో ప్రధానమైన వస్తువు ప్రేమ. ఇది ప్రాణమైన వస్తువు ఆధునికమైన వస్తువు మాత్రమేకాదు, సరిక్రొత్త వస్తువు - నిత్య నూతనమైన వస్తువూ. అయితే అంత సాహిత్యమూ ఎంతో కాలంనుండీ చదువు తున్నప్పటికీ సమాజానికి 'ప్రేమ' యొక్క పూర్తిస్వరూపం అవగతం కానూలేదు. కేవలం సెంటిమెంటల్‌గ ఆలోచిస్తే అంతుచిక్కే పదార్థము కాదది.

మానవజాతి యొక్క వేల సంవత్సరాల సంస్కృతీ నాగరికతలు పండించుకున్న వుత్తమమైన భావ ఫలం ప్రేమ! అత్యున్నతమైన సంస్కృతీ పరిణామ మయింది. హృదయ సంబంధమైన ఆకర్షణ స్నేహానికీ, మానసికమైన ఆకర్షణకు ఆదరణకు, శారీరకమైన ఆకర్షణ కోరికకూ ప్రేరణ అవుతాయి. ఈ మూడింటి సమ్మేళనం ప్రేమ! ప్రేమను ఈ విధంగ విశ్లేషించుకోగలిగిన చైతన్యంవున్న స్త్రీ పురుషుల మధ్య ప్రేమ వివాహాలు సఫలం కాగలుగుతాయి. కాని ప్రస్తుత సమాజంలో అలాంటి వాతావరణం చాల తక్కువవుంది.

మరికట్నం సమస్య అనేది తీరిపోతే యిక వివాహ వ్యవస్థ బాగుపడి పోతుందా? స్త్రీల బ్రతుకులు బాగుపడతాయా? ఈ వివాహ వ్యవస్థలోని

యితర లోపాలేమిటి ? ఆలోచించాల్సివుంది. ఈనాటి మన వివాహవ్యవస్థ ఫ్యూడల్ వివాహ వ్యవస్థ అన్న విషయం మరల ఇక్కడ మనం గుర్తు చేసుకోవాల్సివుంది. "కన్యాదానం", మంత్రాల పఠనం ఒకవైపు జరుగుతూవుంటే, కట్నం ముడుపులు చెల్లింపు మరోవైపు జరగక తప్పటం లేదు ఈ పెళ్ళిళ్ళలో. ఫ్యూడల్ సమాజం యొక్క ఘోరమైన అవశేషాల్లో ఒకటి పురుషాధిక్య భావన. అది సమాజంలో వేళ్ళూనుకొనివున్న భావం. ఎంత వున్నతమైన విద్యావిజ్ఞానం కలిగిన పురుషుడైనా ఈ భావం నుండి బయటపడలేకుండ వున్నారు. వీళ్ళు స్త్రీల హక్కుల్ని, సమానత్వాన్ని మాటల్లో అంగీకరిస్తూనే, మెచ్చుకుంటూనే ఆచరణలో మాత్రం వెనుకబడే వుంటున్నారు. ఇక విద్యా విజ్ఞానంలేని మొరటు మనిషి విషయం ఏం చెప్పగలం ? ఈ భావన పురుషుల్లో వేల సంవత్సరాల నుండి పెంచి పోషింప బడ్డది. కాబట్టి దీనికి ధనిక దరిద్ర భేదం ఏమీలేదు. కనీసం పెళ్ళానికి కూడు పెట్టలేనివాడు కూడ ఆ భారంతో విర్రవీగు తుంటాడు. చాల సందర్భాల్లో విద్యావంతులైన పురుషులు కూడ ఈ మత్తుకమ్మి స్త్రీలని మానసికంగానే కాదు, శారీరకంగానూ హింసిస్తుంటారు. జీవితంలో అడు గడుగునా ఈ అనాగరికమూ, హేయము అయిన భావాన్ని స్త్రీలు మాన సికంగా ఎలాగూ భరించక తప్పటంలేదు, శారీరకంగాకూడ హింసల పాలవు తున్నారు. అలాంటి స్త్రీ పురుషుల వైవాహిక జీవితాలు సవ్యంగ ఎలా వుండగలవు ?

వివాహ వ్యవస్థ గురించి ఇంత ఆలోచన జరిగాక మనం రేపటిదాని స్వరూపం ఎలా వుండాలని ఆశిస్తున్నామో, ఎలా వూహించు కొంటున్నామో కూడ నాలుగు మాటలు చెప్పుకోవాలి. వర్గరహిత సమాజంలో - ఆర్థికమైన దోపిడీకి అవకాశంలేని వ్యవస్థలో ఆర్థికమైన అసమానతలు సమస్యలు లేనప్పుడు ప్రజల సామాజిక జీవితంలో ఒడిదుడుకులు లేకుండ, విద్య విజ్ఞానా లతో వెల్లివిరిసే పరిస్థితిలో స్త్రీ పురుష సమానత్వం ఆచరణలో పూర్తిగ సాధింపబడి వివాహాలకు, వైవాహిక జీవితాలకు ప్రేమే ఆధారమైనప్పుడు - Emotional, intellectal, Professional స్థాయిలను గుర్తించుకొనే అవకాశం ప్రేమ ఆధారమైనప్పుడు - అప్పుడు వివాహవ్యవస్థ సంపూర్ణ ఆరోగ్యంతో చిరకాలం వర్ధిల్లగలదు.

# వివాహవ్యవస్థ: సామాజిక, ఆర్థిక అంశాలు



— జి. హరగోపాల్.

వివాహ వ్యవస్థ సంధి యుగంలో వున్నదని ప్రత్యేకంగా నొక్కి చెప్పాల్సిన అవసరం లేదు. నిజానికి ఈ అంశం రుజువు చేయటానికి సాక్ష్యంతో నిమిత్తంలేదు. అన్ని సామాజికవర్గాలు ఈ పరివర్తనా ఫలితాలను అనుభవిస్తున్నాయి; అందులో ముఖ్యంగా మధ్యతరగతి ఈ మార్పు యొక్క తాకిడిని భరిస్తోంది. ఈ మార్పు యొక్క పరిణామాన్ని, దీని కారణాలను, చరిత్రలో సందిగ్ధస్థితిలో ఇరుక్కున్న వర్గంపై దీని ప్రభావాన్ని విశ్లేషణ చేయుటానికి ప్రయత్నిద్దాం.

గతాన్ని గమనించి, ఆనాటి విలువల వ్యవస్థను నియతం చేసిన సామాజిక ఆర్థిక పద్ధతిని పరిశీలిస్తే ఈనాటి సంధికాల స్థితిని సరిగా అర్థం చేసుకోగలం. గతంలోవున్న పరిస్థితుల్ని గమనిస్తే అవి ఫ్యూడల్ వ్యవస్థ లక్షణాలని తేలుతుంది. మానవ శ్రమఫలితాన్ని స్వలాభం కొరకు వాడుకోవడం, ఆస్తివున్న వారికి ఎదువుమాట చెప్పకుండా సేవ చేయుడం, వారి యెడ స్వామిభక్తి కలిగివుండటం, అంతస్తులతో కూడిన మానవ సంబంధాలు, సోమరిపోతుతనానికి, విశ్రాంతికి దోహదం చేసే అలవాట్లు ఆచారాలు ఇవన్నీ ఆ ఫ్యూడల్ వ్యవస్థ యొక్క ముఖ్యలక్షణాలు. ఈ విలువలే వివాహాన్ని, వివాహానంతర ప్రక్రియులను ప్రభావితం చేశాయి. మొత్తం కుటుంబానికి స్త్రీ అంకితమై భక్తి శ్రద్ధలతో చాకిరీ చెయ్యడం, భర్తకు సంపూర్ణంగా లోబడి వుండటం, కుటుంబంలో స్త్రీ యాంత్రికమైన, నిస్సారమైన పాత్ర వహించడం ఇవన్నీ ఆనాటి సంబంధ విధానాన్ని ప్రబలంగా శాసించాయి. స్త్రీపై యాజమాన్యం వహించడం జరిగింది. స్వంత ఆస్తిపైన ఆధారపడిన సామాజిక నిర్మాణ పద్ధతిలో ఆమె ఇంకొకరి సొత్తు అయింది. క్రొత్త సంబంధాల పద్ధతి ఆవిర్భవించడంలో ఈ పాతకాలపు విలువల వ్యవస్థకు పెద్ద కుదుపు కలిగింది.

ఈ కుదుపు ఎలా వచ్చింది? దీనికి ఒకటే జవాబు. మానవ జీవితపు భౌతిక ప్రాతిపదికలో మార్పు మొదలయింది. వ్యవసాయ రంగంలోని మార్పులు, పారిశ్రామికీకరణ పెరుగుదల, నగరవాసం పెద్దపెట్టున సాగడం, మారుమూల ప్రాంతాలకు మార్కెట సౌకర్యాలు విస్తరించడం, విద్యా, వైద్య అవకాశాలు వీటి అన్నింటిలో భౌతిక శక్తుల అభివృద్ధి కనిపిస్తున్నది. పూర్వంకన్నా సామాజిక సంపద అదనంగా లభించడంవల్ల ఉత్పత్తి క్రమంలో పాల్గొనవలసిన అగత్యంలేని వర్గం ఒకటి ఉదయించింది. మధ్య తరగతి సామాజిక వ్యవస్థ ఫ్యూడల్ నిర్మాణంపై అధారపడి ఉంటున్నది. అయితే నూతన ఆర్థిక సంబంధాలు వారికి 'స్వర్ణయుగపు' విశ్రాంతిని ఒనగూర్చటంలేదు. దీనివల్లనే మధ్యతరగతి, ఆ వర్గానికి చెందన వ్యవస్థలు విషమస్థితిలో చిక్కుకున్నాయి. వివాహ వ్యవస్థకూ ఆ పరిస్తితి తప్పలేదు.

సమాజం యొక్క ఆర్థిక పునాదిలో మార్పులు వచ్చాయి. దాంతో సమష్టి హిందూ కుటుంబం బదాబదలయింది; మానవ సంబంధాలు మార్కెటు న్యాయాన్ని అనుసరించసాగాయి. అంటే ఎంతసేపూ కొనుగోలు అమ్మకం, దానివల్లవచ్చే లాభనష్టాల దృష్టి ఏర్పడిందన్న మాట. అలాగే స్వేచ్ఛ, వ్యక్తిత్వం మొదలైన భావాలు పుట్టాయి. దీంతో ఫ్యూడల్ సిద్ధాంతానికి పెద్ద కుదుపు వచ్చింది. అందువల్ల విలువల పరంగా అంతర్గత సంఘర్షణ ఏర్పడింది.

గతంలో వివాహితులు ఎలా సంచరించారో అలా ఈనాటి అలుమగలు ప్రవర్తించలేరు. పరిస్తితులు మారినయి. కాని వారు పాతకాలపు విలువలను విడనాడలేకున్నారు. మొత్తం వ్యవస్థను గురించి యోజన చేయలేకున్నారు. పాత వ్యవస్థపై పోరాటం సాగించలేకున్నారు.

వివాహానంతరం కూడా భార్యాభర్తల సంబంధాలు సంఘర్షణ పడుతున్న రెండు విలువల సముదాయాలవల్ల నియంత్రణం అవుతున్నాయి. వ్యవస్థ మార్పుకులోనవుతున్న కొలదీ, భయం, భద్రతలేదనే భావం, స్వార్థం వాళ్ళపై ఖరులలో నడవడిలో ప్రబలంగా ప్రవేశించినయి; మరో వైపున అవతలి మనిషిని స్వంతం చేసుకుందామనే ఆలోచన, అతిగా ఇతరులపై ఆధారపడటం, అనవసరమైన ఉద్రేకాలు, వాంఛలు బలపడ్డాయి

సామాజిక బాధ్యతలేని రచయితలు, సినిమా ఈ విలువలను, ముఖ్యంగా ఈ 'విపరీత భావోద్రేకాలను' వాటి అవాస్తవిక ప్రమాదకర స్వభావాలను కూడా విస్మరించి, ఉజ్వలంగా చిత్రిస్తున్నాయి.

నిరాశా నిస్పృహలు, నిరుపయోగమైన కోపము, అడ్డదిడ్డమైన నడవడి, పిల్లలపై దౌర్జన్యం, నిరంతర ఉద్రిక్తత, కుటుంబంలో ఘర్షణలు ఈ సంఘర్షణాయుతమైన పరిస్థితివల్ల, విలువలవ్యవస్థవల్ల కలుగుతున్నాయి. పెండ్లి చేసుకోకపోతే సుఖపడి ఉండేవారమని ఎప్పుడో ఒకప్పుడు అనుకొనని స్త్రీ పురుషులు చాలకొద్ది సంఖ్యలో ఉంటున్నారు.

నిస్పృహతోకూడిన దృక్పథాన్ని ప్రచారం చేయుటం మా ఉద్దేశ్యం కాదు. తద్భిన్నంగా, వర్తమానాన్ని విమర్శనాయుతంగా పరిశీలించి ఇంత కన్న మెరుగైన భవిష్యత్తు నిర్మాణానికి సూచనలు చేయాలనే ప్రయత్నమే ఇది. ఇంతకన్న ఉన్నతమైన సామాజికవ్యవస్థ ఏర్పడేవరకు ఎంత పరస్పర అవగాహన ఉన్న దంపతులు కూడా విస్తృత వ్యవస్థ వారి వైవాహిక జీవితానికి తెచ్చే ప్రమాదాలకు లొంగిపోవక తప్పదు. ఇంటి నాలుగు గోడలమధ్య కుటుంబ జీవితం ఆనందదాయక మవుతుందని భావించడం పొరపాటు; భ్రమకూడాను. కుటుంబమే యావత్తు విశ్వంగా పరిగణించడం విషాద భరితమయిన ఆలోచన. కుటుంబం సమాజం యొక్క ఆటుపోట్లకు లోనుకాని ద్వీపం కాదు. ఈ భావాన్ని అవశ్యం గ్రహించడం అవసరం. వివాహం కేవలం ఇరువురి వ్యక్తులు స్వంతంగా నిర్మించుకున్న ఏర్పాటు మాత్రమే కాదు. కుటుంబం ద్వారా వారు సమాజంతో సంబంధం కల్పించుకుంటారు. అలా సామాజిక పాత్రను నిర్వహిస్తారు. తన శ్రేయస్సు కోసం, సమాజపు శ్రేయస్సు కోసం ఉన్నత మానవవిలువల ప్రాతిపదిక పై నూతన వ్యవస్థ నిర్మాణానికి కుటుంబం పాటుపడవలసి ఉన్నది. అవకాశాల విషయంగా సమానత్వం, వ్యక్తిగౌరవం, హుందాలపునరుద్ధరణ, మానవవాద వైఖరి, శాస్త్రీయదృక్పథం నూతన వ్యవస్థకు ప్రాతిపదికలు కావాలి. లక్షలాది ప్రజలు దౌర్భాగ్యంలో ఉంటే కొలదిమంది సుఖశాంతాలతో ఓలలాడే అన్యాయ అక్రమ సమాజం మధ్య అర్థవంతమైన ఆనందదాయకమైన వైవాహిక జీవితం సాధ్యపడదు.



# వ్యక్తిత్వ వికాసానికి వివాహం దోహదం చేయాలి.

— వాసిరెడ్డి సీతాదేవి.

వివాహ వ్యవస్థను చారిత్రికంగా అధ్యయనం చేసినవారున్నారు. ఆధునిక సిద్ధాంతాలను ఆలంబనం చేసుకొని విమర్శనా దృష్టితో పరికించిన వారున్నారు. శాస్త్రజ్ఞులు విశ్లేషణ (Analysis) చేసి పరిశీలిస్తే తత్వ వేత్తలూ కళాకారులూ సమ్యక్ దృష్టితో (Integral Outlook) తో ఆ వ్యవస్థను దర్శించటం జరుగుతున్నది.

ఒక్కొక్కరికి వివాహ వ్యవస్థలో ఒక్కొక్క అంశం కొట్టవచ్చినట్లు కనపడుతుంది. కొంతమందికి స్త్రీ యొక్క శ్రమ శక్తిని దోపిడీచేయటం కట్టెదుట విలయతాండవం చేస్తుంది. స్త్రీని తక్కువచూపు చూస్తున్నారనే వ్యధ మరి కొందరిని కుమ్రింగదీస్తున్నది. ఇంకొక వర్గపు వారు స్త్రీ యొక్క స్వేచ్ఛను వివాహ వ్యవస్థ కించపరుస్తున్నదని ఘోషిస్తున్నారు. స్త్రీ వ్యక్తిత్వాన్ని పెంపొందించక పోగా అణచి వేస్తున్నది ఈ వ్యవస్థ అని నిందిస్తున్నారు.

వివాహాన్ని పవిత్ర ధర్మంగా కొందరు భావిస్తుంటే మరికొందరు దీనిని కేవలం లౌకిక ప్రయోజనం కోసం ఉద్దేశించ బడిందని తలపోస్తున్నారు. వివాహబంధాన్ని మరింత కట్టుదిట్టం చేయాలని కొందరు వాదిస్తుంటే అసలు వివాహ బంధమే అనవసరమని కొందరు తగాదా పెట్టున్నారు. ఇంతమంది ఇన్ని భావాలు వెలిబుస్తుంటే వివాహవ్యవస్థ మాత్రం కుంటుతూ నడుస్తున్నది. అది కొంత దృష్టి లోపంతోను కొంత అంగవైకల్యంతోను వ్యాధి పీడితంగా ఉంది. స్త్రీ స్వేచ్ఛను అంగీకరించలేని గ్రుడ్డితనం మహిళ వ్యక్తిత్వాన్ని అణచివేసి, పురుషాధిపత్యం ఒంటికాలితో అయినా

రెండవ అవిటికాలిని లాగుతూ నడుస్తున్నది. పురుషాధిపత్యం స్త్రీని వైవాహిక జీవితంలో అవిటి దానినిగా చేసింది. ఇలామటుకు సాగితే వివాహవ్యవస్థ గోతిలో పడిపోతుంది ; పతనమౌతుంది.

సమాజంలో వ్యక్తులు అనేక సంబంధాలను కల్పించుకుంటారు. ఒకే వ్యక్తి దేశకాల పాత్రలను బట్టి వివిధ వ్యక్తులతో విభిన్న సంబంధాలను ఏర్పరచుకోవడం జరుగుతున్నది. ఒక మనిషి భార్యతో లేక భర్తతో, సంతానంతో, తల్లిదండ్రులతో, రక్త సంబంధీకులతో, ఊరి వారితో, తను వాడే భాషను మాట్లాడే వారితో, దేశీయులతో, తోటి మానవులతో, ఉద్యమాలలోని సహచరులతో, పార్టీ కార్యకర్తలతో, ఇలా అనేకానేక రకాలుగా సన్నిహితత్వం కలిగి ఉండటం కద్దు. ఇందులో భార్యాభర్తల సంబంధం విశిష్టమైనది. కనుకనే దీనిని గురించి ఎక్కువగా కథలు, నవలలు, గాథలు, ఇతోధికంగా వస్తున్నాయి.

ప్రతి వ్యక్తి ఒక విశిష్టజీవి. అతని లేక ఆమె వ్యక్తిత్వంలో రెండు విభిన్నాంశాలు ఉంటాయి. ఒకటి పూర్తిగా వ్యక్తిగతాంశమూ, రెండవది సామాజికాంశమూ. ఆలుమగలు ఇద్దరూ ఒకే ఇంట్లో కాపురము చేస్తున్నా, వారి సంబంధం ఎంతో సన్నిహితమైనదైనా మౌలికంగా వారిరువురు విభిన్న వ్యక్తులు. వారి అభిరుచులు, వారికి ఆసక్తిని కలిగించే విషయాలు, ఆటపాటలు, మాట తీరు, నడక చందము, ఆలోచనారీతి, జీవితదృక్పథం, రచనా విన్యాసం, విశ్వాసాలు, ఆచారాలు, సహజంగా భిన్నంగా ఉంటాయి. వేరు వేరు పరిసరాల్లో పెరిగి పెద్దవారయి ఒక వయస్సులో ఒకరికొకరు దగ్గరవారైనందున ఈ భిన్నత్వం ఉండక తప్పదు. కాగా ఒకే సంఘటనను భార్యాభార్తలిద్దరూ గమనించినా దాని సారాన్ని గ్రహించటంలో వైవిధ్యం ఉండటానికి అవకాశముంటున్నది. వారి వ్యక్తిత్వంలో ఉన్న పూర్తి వ్యక్తిగతాంశం సామాజికాంశాన్ని కూడా కొంత వరకు ప్రభావితం చేస్తున్నదన్న మాట.

యువతీ యువకులు వైవాహిక జీవితంలోకి ప్రవేశించటానికి వారి వారి మనస్తత్వాలనుబట్టి వివిధ అంశాలు ప్రోద్బలం చేస్తాయి. ఇల్లాలు, వంటకత్తె, ఇంటి పనిమనిషి, సావాసకత్తె ఇలాంటి అర్హతలున్న వ్యక్తి

కోసం కొందరు పురుషులు తాపత్రియపడితే, మరి కొందరు ఇంటికి అందం తెచ్చే సౌందర్యవతి కొరకు అన్వేషిస్తారు. ఈనాడు ఆధునికులుగా చలామణి అయ్యేవారు అణగి మణగి ఉండే ఉద్యోగిని భార్య కోసం తపిస్తున్నారు. ఇలా అనేక రకాల పురుషులు విశిష్ట లక్షణాలున్న స్త్రీలను భార్యలుగా పొందాలని తహతహలాడుతున్నారు. అలాగే కొందరు స్త్రీలు రక్షణకోసం పెండ్లికి సిద్ధమవుతుంటే, తదితరులు తోడుకోసం వివాహమాడుతున్నారు. ప్రేమ వివాహాల్లోనూ, పెద్దలు ఏర్పాటుచేసిన వివాహాలలోనూ ఈ కోరికలూ, ఆకాంక్షలూ చోటు చేసుకుంటున్నాయి. ఇదంతా సర్వ సామాన్యంగా జరుగుతున్న విషయం. కాగా ఉన్నత ప్రమాణాలను ఏర్పరచుకున్న యువతీ యువకులు తమ వ్యక్తిత్వాభి వృద్ధికి దోహదకారిగా వివాహాన్ని గురించి ఆలోచిస్తారు. "ఈ పురుషునికి భార్య అయితే – పాత అర్థం కాదు సుమండీ, అంటే భరింపబడేది భార్య అనికదా మామూలు మాట – అతడు నా వ్యక్తిత్వాభివృద్ధికి సాయపడగలడా? అలాగే నేను అతని వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడగలనా!" అనే ప్రశ్నలను చైతన్యంకల స్త్రీలు స్పష్టంగా విధిగా వేసుకోవాలి. అలాంటి అవకాశం ఉన్నపుడే ఆ సంబంధానికి ఇతోధిక విలువ ఏర్పడుతుంది. లేనినాడు కేవలం ప్రాథమికస్థాయి సౌకర్యాలనిమిత్తం కలుగచేసుకునే సంబంధంగా అది మిగిలిపోతుంది.

ఇల్లు గడుపు కోవటంలో, ఆస్థి సంపాదించు కోవటంలో, శారీరక సన్నిహితత్వం పొందడంలో, సంతానాన్ని కలిగి పెంచడంలో ఒకరి కొకరు సాయపడినంత మాత్రాన చాలదు. పక్షులు కలసి గూడు కట్టుకుంటాయి. కాపురం చేస్తాయి. రెక్కలు వచ్చేవరకు పిల్లలను సాకుతాయి. మరి మనుషులకు ప్రత్యేకత ఉంది కదా! ఒకరి మానసికాభివృద్ధికి, చైతన్య స్ఫూర్తికి, సృజనాశక్తి వికాసానికి, కళాభిజ్ఞతకు, సత్యాన్వేషణా సక్తికి, స్వేచ్ఛా పిపాసకు, నైతిక ప్రవర్తనకు, మరొకరు సహాయ సహకారాలు అందించినపుడే ఆ వైవాహిక బాంధవ్యానికి సఫలత వస్తుంది. అలాంటి అవకాశాలుండే సంబంధానికి వీలులేకపోతే ఏదో మిష, సాకు, నెపం, కారణం మీద దాంపత్య జీవితంలో అడుగిడడం అంత సబబుకాదేమో!

వ్యక్తిత్వ వికాసమనగానే చాలామందికి సవాలక్ష సందేహాలు వస్తాయి. ఈ మాటలు పామరులకు వర్తించవని, కేవలం పండితులకు మాత్రమే

ఉపకరిస్తాయని అభ్యంతరం ఉదయిస్తుంది. ఈ భావం పూర్తిగా పొర పాటు కింద లెక్క. కష్టజీవి అయినా, పరభాగ్యోపజీవి అయినా, పామరుడైనా పండితుడైనా ప్రతిమనిషికీ ఇందాక అనుకున్నట్లు ప్రత్యేక వ్యక్తిత్వం ఉంటుంది. అలాగే ప్రతి మనిషికీ కొన్ని విలువలూ, వాటి అవగాహన ఉంటాయి. అందచందాలు, రూపురేఖలు, ఆరోగ్యం, సమర్థత, ఆర్జన శక్తి, శరీర పాటవం వీటిలో ఏ ఒక్కదానిలో కాని లేక కొన్నింటిని గాని, అన్నింటిని కాని కాబోయ్యే భర్తలోనో, భార్యలోనో ఆశించడం అయా వ్యక్తియొక్క విలువలనుబట్టి ఉంటుంది. కొంతమంది పై వాటితో మాత్రమే తృప్తిపడరు. మానసిక సాహచర్యాన్ని అభిలషిస్తారు. కొందది మంది తమ సృజనాశక్తి అనే లతకు ఆలంబనాన్ని ఆశిస్తారు. తదితరులు సహృదయత్వాన్ని కాంక్షిస్తారు. ఇలా వైవిధ్యముంటుంది మానవుల ఆకాంక్షలలో. వారు ఏ విలువకు ప్రాధాన్యత ఇస్తారనే విషయం వారి మానసిక స్థాయినిబట్టి ఆధారపడుతుంది. విలువల ప్రసక్తి మానవులకే. పశుపక్ష్యాదులు వాసనాప్రేరిత జీవులు. వాటికి ఈ బాధలేదు. ప్రతి మనిషికీ వ్యక్తిత్వముందనీ, దాని వికాసాన్ని అవ్యక్తంగానో, వ్యక్తంగానో కోరు కుంటాడని తేలుతున్నది.

వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేసేది వివాహం అని అంటున్నపుడు ఏ విధమైనభావవైరుధ్యానికి తావులేదు. మానవజాతి ప్రత్యేకతను దృష్టిలో ఉంచుకొని ప్రకటించే భావం ఇది. మనిషికి జంతు వారసత్వం ఉన్న మాట వాస్తవం. కాని దానిని అధిగమించి తన వైశిష్ట్యాన్ని మానవజాతి రుజువు పర్చుకోవలసి ఉన్నది. ఆ ప్రయత్నాన్ని జీవితంలో ప్రధాన భూమికను నిర్వహించే వివాహం సందర్భంగా ఆరంభించడం యుక్తియుక్తం.

ఒకరకంగా ఆలోచిస్తే ఆలుమగలుగా వ్యవహరించే స్త్రీ పురుషుల సంబంధం వారిద్దరికి మాత్రమే సంబంధించింది. మరొక విధంగా దృష్టి సారిస్తే అది సమాజానికి సంబంధించింది. సంతానం కలగడం, వారికి ఆస్తి చెందజేయాలని భావించడం, ఇలాంటివి వారిరువురిని సమాజంలోకి ఈడుస్తున్నాయి. ఆస్తి సంక్రమణకు ఒక క్రమం, గుర్తింపు కోసం వారిరువురి కూటమికి ఒక పేరు అవసరమయి కుటుంబం ఒక వ్యవస్థగా రూపొందుతున్నది. కాలక్రమేణా వివాహంలోని సామాజికాంశం వ్యక్తి

గతాంశాన్ని మింగివేసింది. సమాజం క్రమశిక్షణ పేరుతో వ్యక్తుల స్వేచ్ఛను కుంచింప చేసింది. ఫలాని కులంలోనే, ఫలాని శాఖలోనే, ఫలాని మతం లోనే వివాహాలు జరగాలని శాసించింది. దీనితో వధూవరుల ఎంపిక పరిధి సంకుచితమయింది. ఒక దృష్టితో పరిశీలిస్తే కట్నాలు ఇతోధికంగా ఇవ్వవలసి రావడానికి ఇది ఒక కారణంగా పరిణమించింది. వరకట్న దురాచారం మౌలికంగా పురుషాధిక్యతా భావంపై ఆధారపడి ఉన్నమాట వాస్తవమే. ఆ భావం నశించేవరకు వరకట్నం పోదు. ప్రముఖ సాహితీవేత్త కీర్తిశేషుడు ముద్దుకృష్ణ ఛలోక్తిగా అన్నట్లు కట్నం అనేది ఆడపిల్లను కన్నందుకు అల్లుడు మామకువేసే జరిమానా. ఈ కట్నాల గొడవనుండి బయట పడాలంటే కనీసం సంపాదించే స్త్రీ – మధ్యతరగతి ఉద్యోగిని కావచ్చు, శ్రామిక స్త్రీ కావచ్చు – తన సంపాదనను, తద్వారా తను సంపాదించే ఆస్థిని తన పేర పెట్టుకునే మనస్తత్వమూ, ప్రయత్నమూ రావాలి. అలాంటి సమాజంలో స్త్రీని చిన్నచూపు చూడటానికి సాహసించడు పురుషుడు – భర్త అయినా కూడా. కేవలం ప్రబోధంవల్ల సమాజం మారదు. భావాల ప్రభావాన్ని కాదని, సామాజిక మార్పు జరగందే ఏమీ లాభం లేదని కూర్చున్నా ప్రయోజనం లేదు. భావ విప్లవమూ, దానికనుగుణమైన సామాజిక ప్రయత్నమూ ఏక కాలంలో సాగాలి. రెంటిలో ఏది లోపించినా ఫలితం సిద్ధించదు.

సమాజంలో సమూలమైన మార్పు అవశ్యం రావలసిందే. కాగా అది ఒక్కసారిగా రాదు. క్రమ క్రమంగా జరిగే అనేక సామాజిక ప్రయత్నాల ఫలితంగానే అది సిద్ధిస్తుంది. ఒక్కొక్క దశలో, ఒకానొక కాలంలో మార్పు తీవ్ర తరమవుతుంది. స్వభావంలో తేడా కనిపించే స్థితికూడా కలుగుతుంది. దానినే విప్లవకరమైన మార్పు అంటున్నాము. ఇలాంటి మార్పు తేవడానికి ఎన్నో చిన్న చిన్న ప్రయత్నాలు కూడా దోహదం చేస్తాయి. కాగా సమస్యను అవగాహనచేసుకొని, పంథా తప్పకుండా సాగిపోతుంటే సంస్కరణ యైనా ప్రయోజనకరమే. అలాంటి ప్రయత్నాన్నే అభ్యుదయ వివాహ వేదిక చేస్తున్నదని నా నమ్మకం. అందుకే ఈ వేదికకు కార్యసిద్ధి కలగాలని ఆశిస్తున్నాను.

# స్త్రీయే సర్దుకుపోవడం న్యాయమా?

— డా॥ వై. సరస్వతీరావు.

ఇద్దరు కాని ఇంకా ఎక్కువమంది కాని కలిసి జీవించాల్సిన పరిస్థితి కలిగినప్పుడు ఎంతో సర్దుబాటు అవసరం. పెద్దలు చేసిన పెళ్ళిలో కాని లేక ప్రేమ వివాహంలో కాని ఈ పరిస్థితి తప్పదు. వివాహబంధంలో స్వేచ్ఛా, స్వేచ్ఛలేమి రెండూ పడుగు పేకలవలె చిక్కగా కలిసి వుంటాయి. ఇక్కడ వుదయించే ప్రశ్న అల్లా ఒక్కటే. ఎవరు సర్దుకు పోతున్నారు, అందుకు ఎవరు సుముఖత చూపుతున్నారు, అదికాక ఇరువురిలో ఎవరు ఎక్కువగా మనస్సు సమాధాన పర్చుకుంటున్నారు అనేదే ప్రశ్న. ఈనాడు, మధ్య తరగతి కుటుంబాల్లో భార్య మాత్రమే ఎక్కువగా సర్దుకుపోవటం జరుగుతున్నది. ఈ సందర్భంగానే స్త్రీయొక్క వ్యక్తి స్వేచ్ఛ చాలావరకు కుంటుపడుతున్నది.

స్వేచ్ఛ అనే పదానికి నైతిక పరమైన అర్థం ఉన్నది. వివాహంలో కుటుంబము, సమాజము నిర్ణయించే అంశాలకన్నా భార్యాభర్త లిరువురి మధ్యావుండే వ్యక్తిగత నైతిక సంబంధమే ముఖ్యమైనది.

సాముదాయకంగా జీవించేటప్పుడు ఏదోరకమైన సర్దుబాటు తప్పని సరి అవుతుంది. జీవితంలో ప్రతిరంగంలోనూ, ప్రతి అంశంలోనూ ఈ సూత్రం వర్తిస్తుంది. సమాజంలో జీవించడమంటేనే ఒకరికి అనువుగా మరొకరు సరిదిద్దుకొనడం అన్నమాట.

స్నేహితుల మధ్య జరిగే సర్దుబాటు కేవలం ఉద్వేగ పరమైనది. భార్యాభర్తల సంబంధానికి శాశ్వతత్వం ఆశిస్తున్నాం కనుక వారిరువురి మధ్యా ఉండే పొందిక, సామరస్యం ఇతోధికమయినది. స్త్రీ పురుషుల మధ్య సాంస్కృతికంగా ఆమోదయోగ్యమైన సంబంధంగా వివాహానికి

నిర్వచనం చెప్పవచ్చు. వివాహం సాహచర్యం కొరకు సంతాన ప్రాప్తికోసం ఉద్దేశించబడింది. తమ సాహచర్యాన్ని రెండోవారికి అందించడానికి, తమ అనుభవాలలో పాలుపంచుకోడానికి, మంచి కుటుంబాన్ని నిర్మించడానికి భార్యా భర్తలిద్దరూ కృషి చేస్తున్నారా అనేదే కీలకమయిన ప్రశ్న.

కుటుంబం అంటే - నిర్మాణాన్ని బట్టి ఆలోచిస్తే - దంపతులూ, వారి సంతానమూ మాత్రమేకాక వారి దగ్గర బంధువులతో కూడ కలిసి ఉంటుంది. ఈ దేశపు కుటుంబాలలో బంధువర్గం అంటే పురుషుని తాలూకు బంధువులే అన్నమాట. స్త్రీకి జీవితంలో సర్దుబాటు తన భర్త తాలూకు బంధువుల విషయంగా ప్రారంభం అవుతుంది. దానికి సామాజిక విలువగా పరిగణన లభించింది. కుటుంబంలో ఇంటిపని యెడల స్త్రీ శ్రద్ధ వహించేలాగున, పురుషుడు బయటపనిచేసి కుటుంబ పోషణకు శ్రమించి సంపాదించాలని సంప్రదాయం యుగయుగాల నుండి సాగుతున్నది. పైకి ఇద్దరూ వారి యథోచిత పాత్రలను నిర్వహిస్తూ వారిస్థానాలలో వారు ఆనందంగా వుంటున్నట్లు కనపడుతున్నది. తనచుట్టూ ప్రపంచంలో ఏమి జరుగుతున్నదో గమనించడానికి పురుషుడికి ఇతోధిక అవకాశాలు ఏర్పడ్డాయి. వివిధ అనుభవాలను పొంది, వాటివల్ల గుణపాఠాలను గ్రహించి అతడు పురోగమించగలుగుతున్నాడు. సుసంపన్నమైన మానసికాభివృద్ధికి అతనికి విరివిగా అవకాశాలు కలిగాయి. అందువలన ఇంటివెలుపలి జీవితానికి సంబంధించిన విషయాలలో అతడు అనుభవజ్ఞుడై, జ్ఞానవంతుడై శక్తివంతుడవుతున్నాడు. స్త్రీ విషయంలో తద్వ్యతిరేకం జరుగుతున్నది. ఇంటికి మాత్రమే పరిమితమైన ఆమె కార్యరంగం చాలా సంకుచిత మయినందున ఆమెకు ప్రపంచానుభవం పొందడానికి అవకాశం నశించింది. ఆమెకు ఇల్లే ప్రపంచం; కుటుంబమే జీవితం. ఆమె తన వ్యక్తిత్వ వికాసానికి సావకాశం లేకుండా పోయింది. అందువల్ల ఆమె కూపస్థ మండూకంలా జీవితం సాగిస్తున్నది. తత్ఫలితంగా ఆమెను ప్రపంచం గుర్తించని పరిస్థితి ఏర్పడింది; ప్రపంచానికి ఆమె ప్రసక్తి అక్కరలేదు. కుటుంబము యొక్క సంకుచిత అవసరాలను తీర్చటానికి మాత్రమే ఆమె వ్యక్తిత్వం పరిమితమయింది; భావ వ్యక్తీకరణకు కూడా ఆమెకు సావకాశంలేదు. కాలక్రమేణా ఆమెను గురించి ప్రత్యేక శ్రద్ధ తీసుకోవలసిన అవసరం నశించింది. జ్ఞాన సంపన్నుడైన

పురుషుడు తన అభిరుచులకు, అవసరాలకు అనుగుణంగా పరిసరాలను తీర్చి దిద్దుకున్నాడు. అలా పురుషాధిక్య సమాజం ఉదయించింది. స్త్రీకి పరిమిత మైన జ్ఞానం మాత్రమే ఉన్నందువల్ల ఉద్వేగపరంగా పురుషుడు ఆమెను అధిగమించగలిగాడు; ఆమెను మాయచేయ గలిగాడు. ఆమె వ్యక్తిత్వం కాలక్రమేణా కుంచించుకు పోయింది. వ్యక్తిత్వ వికాసంలేని తల్లి పెంప కంలో కుమార్తె కూడా అలాగే తయారవుతుంది. ఈ దీర్ఘకాల పరిణామ ప్రక్రియలో స్త్రీలో న్యూనతాభావం, అణగి మణిగివుండే నైజం, ఆజ్ఞాపాలన, రాజీ మనస్తత్వం కలుగుతాయి; ఆమె దోపిడీకి గురిఅవుతుంది. చివరకు పురుషుడి అధికారాన్ని సర్వేసర్వత్రా అంగీకరించే స్థితికి ఆమె వస్తుంది. ఇతరులకన్నా తను తక్కువ అనిభావించే వ్యక్తిని అందరూ వాడుకుంటారు. స్త్రీ విషయంలోనూ అదే జరిగింది. సమాజంలోనూ, కుటుంబంలోనూ అందరికన్నా తక్కువ స్థాయిని ఆమె తనకుతానే నిర్దేశించు కున్నది. ఇలా తన ఆలోచనా సరళిని – తనకు తెలియకుండానే – తనకు నష్టదాయకంగా ఆమె ఏర్పాటు చేసుకున్నది. స్త్రీలు ఏనాడూ వ్యక్తి స్వేచ్ఛను అనుభవించ లేదు; వ్యక్తి స్వేచ్ఛ అంటే ఏమిటో తెలియదు. కనుక దానిని వారు ఏనాడూ ఆశించలేదు. ఆ మాటకొస్తే, ఈనాడు కూడా, తన హక్కులను నిలబెట్టుకోవాలని ప్రయత్నించే స్త్రీని దురాక్రమణ స్వభావంకల వ్యక్తిగాను, స్త్రీ నైజవ్యతిరేక ప్రవృత్తికల మనిషిగాను చిత్రించడం పరిపాటి అయింది; ఆమెను అదో రకంగా – అంటే నిరసన పూర్వకంగా చూడటం సర్వసాధార ణంగా జరుగుతున్నది. వధువును ఎంపికచేసే సందర్భంగా స్త్రీ విమోచ నోద్యమ కార్యకర్తలలో తీవ్రవాదులను చూచి వరులు బెదిరిపోతున్నారు. మలుచుకోడానికి అనువై, అణగిమణగి ఉండి, లొంగుబాటు స్వభావంగల గృహిణులు కావాలి పురుషులకు.

వ్యవహార స్వేచ్ఛ, మానసిక స్వేచ్ఛ రెండూ భిన్నమైనవి. అనేక ప్రత్యామ్నాయాలు ఉంటే, వాటిలో దేనినో దానిని ఎన్నుకోవడానికి అవ కాశము ఉన్న వ్యక్తి, స్వేచ్ఛను పొందియున్నాననే భావంకలిగి ఉంటాడు. తన ఆజ్ఞాపాలనం చెయ్యడానికి మనుష్యులను మలిచే అధికార వ్యక్తికిగాని, సంస్థకుగాని పూర్తిగా లొంగిపోయి తమ స్వేచ్ఛను కోల్పోయి కూడా స్వేచ్ఛను అనుభవిస్తున్నామని భావించేవారూ లేకపోలేదు. కుటుంబాలలో

బాలికలకు ఇచ్చే శిక్షణ, సంప్రదాయబద్ధమైన పరిస్థితులు ఈ రెండూ తమ స్వేచ్ఛను ఇతరుల పాదాలవద్ద సమర్పించే స్థితికి స్త్రీలను తెచ్చాయి. లైంగిక వివక్షలేకుండా శాసనం స్వేచ్ఛను సర్వులకూ ప్రసాదించినా స్త్రీలు కుటుంబ యజమానులైన పురుషులకు మోకరిల్లుతున్నారు. వైవాహిక జీవితంలో శాంతిని ఎలాగో అలాగు సాధించుకోవటానికీ, బ్రతకటానికీ స్త్రీలు చాలవరకు ఇలా చేయడం సంభవిస్తున్నది.

ఇతరుల శ్రమఫలితాన్ని దోపిడీ చేయడమనేది, ఇతరులను స్వప్రయోజనాల కోసం వాడుకోవడమనేది అంటువ్యాధి. అది సమాజంయొక్క రాజకీయార్థిక సామాజిక రంగాలన్నింటిలో ప్రవేశించింది. చివరకు స్త్రీ వ్యక్తిత్వాన్ని కూడా బలిగొన్నది. ఇంటిలో ఆమెచేసే వెలలేని శ్రమ ఆమె విధ్యుక్త ధర్మంగా చేయవలసిన పనిగా నిర్ణయింపబడింది. ఆమె శ్రమకు నయాపైసా విలువకూడా ఇవ్వటం లేదు. తన కుటుంబపోషణకు సంపాదిస్తున్నందుకు పురుషుడు మహత్కార్యం చేస్తున్నట్లు అతనిని అభినందించటం, వీరునిలా పూజించటం సాగిపోతున్నది. స్త్రీ పురుషుల పాత్రోచిత ప్రవర్తనను గురించిన దృష్టిలో వ్యత్యాసం, అసమతుల్య స్థితి ఏర్పడ్డాయి. సామాజిక సామరస్యానికి శ్రమ విభజన ఆమోదయోగ్యమై సాధనమైనా శ్రమ యెడల వివక్షాయుత దృష్టి ఉండటం నింద్యము. ఇలా వివక్షతో కూడిన విలువలను తమవిగా చేసుకున్నందువలననే చాలామంది స్త్రీలు వ్యక్తిస్వేచ్ఛ విలువను గ్రహించటంలేదు. కుటుంబంలో స్త్రీలుచేసే పనికి విలువకట్టించి, స్త్రీ పురుషుల మధ్య సమానత్వ హోదాను సంపాదించ ప్రయత్నించే డెన్మార్కు స్త్రీల కృషి గమనార్హం.

పురుషుని శారీరక బలాధిక్యత అతని అహంకారాన్ని పోషించింది. సౌందర్యం పేరుతో శారీరక బలాన్ని స్త్రీలు సంపాదించుకోకుండా ఉద్దేశపూర్వకంగా అడ్డుకొనడం జరుగుతున్నది. స్త్రీ పురుషుల సౌందర్యాలకు కొలమానాలు వేర్వేరుగా ఉన్నాయి. ఇతర జీవులలో ఈ తేడా కన్పించదు. పురుషుని శారీరక బలం అతనిలో దురాక్రమణ మనస్తత్వాన్ని, దౌర్జన్య స్వభావాన్ని పెంపొందిస్తున్నది. స్త్రీ పురుషుల వైఖరులలో ఉండే ఈ తేడాలను వ్యక్తిత్వ విభేదాలుగా 5 సూత్రాలక్రింద బెన్నెట్ మరియు

కోహెన్ (1959) అనే రచయితలు క్లుప్తంగా చెప్పారు. వారి పరిశోధనా ఫలితంగా ఈ క్రింది విషయం తేలింది. పురుష ప్రయత్నాలు వైఖరులు స్వార్థపరంగా ఉంటాయి. స్త్రీ ప్రయత్నాలు వైఖరులు పరిసరాలచుట్టూ పరిభ్రమిస్తూ, సామాజిక ప్రేమ, స్నేహం వీటితో కూడి ఉంటాయి. స్వార్థపరవ్యక్తి తన మనుగడ కోసం రక్షణ సాధనాలను ఏర్పరచుకోవాలి; పురుషుని దురాక్రమణ స్వభావం అలాంటి సాధనం. హృదయ వైశాల్యం స్త్రీత్వ లక్షణం; పురుష మనస్తత్వం తను పట్టిన కుందేలుకు మూడే కాళ్ళు అంటుంది; మనః కవాటాలను మూసి ఉంచుతుంది.

వివాహంలో దంపతులిరువురు కొంతగా కొంత వ్యక్తిగత స్వేచ్ఛను వదులుకోవాల్సి ఉంటుంది. వారిరువురు ఇచ్చి పుచ్చుకునే ధోరణిలో సర్దుకొనిపోక తప్పదు. అయితే, ఏ దశలోనూ, ఏ పరిస్థితిలోనూ స్త్రీ కన్నా పురుషుడు ఎక్కువ స్వేచ్ఛకు అర్హుడని కాని, ఎక్కువ స్వేచ్ఛను పొందివుండాలని కాని భావించరాదు. వివాహం కాగానే ఈ స్వేచ్ఛను ఎవరూ ఆమెకు బహుమతిగా ఇవ్వరు. ఆమె ఆ హక్కును–స్వేచ్ఛను అనుభవించే హక్కును –కావాలని కోరి తనకున్న సాధనాలద్వారా దానిని తానే సంపాదించుకోవాలి. తనకు తను సహాయం చేసుకుందామని ఆమె భావిస్తేతప్ప ఏ శాసనాలు, ఏ మహిళాసంఘాలూ ఆమె సమస్యను పరిష్కరించలేవు. సర్వేసర్వత్రా వర్తించే ఒకేఒక పరిష్కారమార్గం ఈ సమస్యకు లేనే లేదు.

స్త్రీల యెడ పురుషులుకూడ తమ వైఖరిని మార్చుకోవాలి. ఆహార సముపార్జన కోసం సంపాదన ఎంత ముఖ్యమో ఇంటిని చక్కదిద్దుకొని కుటుంబాన్ని నడపడం అంత ముఖ్యమైనదని గ్రహింపచేసే సంస్కారాన్ని పురుషులు అలవర్చుకోవాలి.

—(೦)—

# ★ పురుషాధిక్యత: స్త్రీల అణచివేత ★

— ఆచార్య నీరా దేశాయ్

ఈనాటి వివాహవ్యవస్థను గురించి మనకు కొంతగా కొంత తెలుసు. ఇప్పుడు ఆ వ్యవస్థ మారుతున్న తీరును పరిశీలిస్తే భవిష్యత్తులో ఇది ఎలా పరిణామం చెందుతుందో ఊహించలేము. కుటుంబానికి మరింత స్థిరత్వం తెస్తుందా లేక వివాహంలో భాగస్వాములైన యిరువురిమధ్య సమానత్వంపై ఆధారపడే స్థిరత్వానికి దారి తీస్తుందా అనేది ప్రశ్న. ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ వివాహ వేదిక లక్ష్యాలలో ఒకటి కొట్టవచ్చినట్లు కనపడుతున్నది. కులం, మతం, వస్తుభావన, వ్యాపార దృక్పథం వీటితో నిమిత్తం లేకుండా స్త్రీ పురుషుల భాగస్వామ్యంతో ఉండే వివాహాన్ని, సమానత్వ ప్రాతిపదికపై ఉండే వివాహవ్యవస్థను ఈ వేదిక ఆశిస్తున్నది. భారతదేశ పరిస్థితులలో దీనిని గమనిస్తే వివాహము స్త్రీ యొక్క న్యూనత స్థితిపై ఆధారపడినదని విదితమవుతున్నది. ఈ వ్యవస్థలో స్త్రీ అణచివేతకు గురి అవుతున్నది. ఏ రకమయిన వివాహతంతును చూచినా అది స్త్రీని తక్కువ చూపుచూచి ఆమెను లొంగదీసేదిగా వున్నది. కన్యాదానం అనే తంతులో స్త్రీ యొక్క తక్కువస్థాయి, పురుషాధిక్యత గోచరమవుతున్నాయి.

తెలుగులో ఒక సామెత ఉన్నదని విన్నాను. ఎప్పటికైనా అత్తమామల యింటికిపోయేది కనుక కూతురును పెంచటంవృథా అని దానిభావం. పరాయివారి ఆవరణలో ఉన్న మొక్కకు నీరుపోయడం లాంటిది ఆడపిల్లను పెంచడం. తెలుగులోనే కాదు అన్ని భాషలలోనూ ఇలాంటి సామెతలు విరివిగా ఉన్నాయి. అన్ని భాషలవారు ఒకే వైఖరిని, ఒకే దృక్పథాన్ని ప్రదర్శిస్తున్నారు. ఒకేరకంగా స్త్రీని చూస్తున్నారు. పుట్టింట స్త్రీ నివాసం తాత్కాలికమైనదిగా ఎంచబడుతున్నది. అంతేకాదు. పురుషుడితో వినా స్త్రీకి వేరే జీవితం ఉండరాదట. ఇటీవల విడాకులు పొందిన స్త్రీలను గురించి ఒకామె పరిశోధన చేసింది. ఇంటిలో విధవరాలు ఉండటం దుర దృష్టకరమని భావిస్తున్నారట ; అలాగే అవివాహిత కుటుంబంలో ఉంటే

తతిమ్మావారు పణికి పోతున్నారు. విడాకులు పొందిన స్త్రీని ప్రమాద హేతువుగా పరిగణిస్తున్నారు. ఆ దాంపత్యం కుంటుపడుతున్నా, వివాహిత స్త్రీని గౌరవిస్తున్నారు. పెండ్లి ఏ పద్ధతిలో జరిగినా, స్త్రీ విధిగా వివాహ మాడాలి. అప్పుడే ఆమెకు గౌరవమూ, భద్రతా లభిస్తాయి. భర్తచేత రోజూ దెబ్బలు తింటున్న శ్రామిక స్త్రీని 'భర్తను వదలిపెట్టరాదా?' అని ఒకరు ప్రశ్నిస్తే ఆమె యిచ్చిన సమాధానం ఇది :-

"ఇప్పుడు భర్త ఒక్కని చేతుల్లోనే దెబ్బలు తింటున్నాను. నేను ఇల్లువదలి బయటికిపోతే నా మీదికి లంఘించడానికి పది తోడేళ్ళలాంటి పురుషులు సిద్ధంగా ఉన్నారు." ఈ జవాబునువిన్న తరువాత అవివాహిత స్త్రీయొక్క, లేక వివాహితయై భర్తకు దూరంగా వేరుగా ఉన్న స్త్రీకి భద్రత లేదని తెలుస్తున్నది. స్త్రీకి వివాహం తప్పనిసరి. ఈ భావంతో గుజరాతీ భాషలో ఒక సామెత ఉన్నది. వృద్ధుడయిన పురుషుడు అవివాహితుడుగా చనిపోవచ్చును; కాని, వృద్ధురాలయిన స్త్రీ అవివాహితగా చనిపోరాదు. వివాహానికి సంబంధించిన బలవంత స్వభావమిది. దీనిని సర్వేసర్వత్రా అంగీకరిస్తున్నారు. అందువలన వివాహ జీవితంలో వైపరీత్యాలు అదుర్దాలు, ఆందోళనలు ఉద్భవిస్తున్నాయి.

వరకట్న సమస్యను తీసికుందాం. అది వివాహంతో ముడిపడిఉన్నది. వరకట్నాన్ని వధువు కానీ ఆమె బంధువులు కానీ ఇవ్వవలసి వస్తున్నది. వరకట్నం ఇచ్చేవారు తక్కువ స్థాయిలోనూ, పుచ్చుకునే వరుడు ఎక్కువ స్థాయిలోనూ ఉన్నట్లు సమాజం భావిస్తున్నది. ఇది ఈనాటి సమాజ పోకడకు నిదర్శనం. యువతికి వివాహం చెయ్యాలంటే వరునికి కొంత ధనం లేక నష్టపరిహారం ముట్టచెప్పాలి. ఎందుకు ఇలా జరుగుతున్నది? ఈనాడు వరకట్నం భీకరరూపం దాలుస్తున్నది. అది ఒక వ్యాపార లక్షణం కలిగిఉన్నది; ఒక రకంగా వస్తుమార్పిడికి, స్త్రీల నీచస్థానానికి సంబంధించిన విషయం. అంతేకాదు, దాంపత్య సంబంధాలలోని మానవతను ఈ పద్ధతి తీసివేస్తున్నది. ఈ స్థితికి మనం ఆందోళన చెందుతున్నాం. ఢిల్లీ మహానగరంలో రోజుకు రెండు వరకట్న మరణాలు సంభవిస్తున్నట్లు పత్రికల్లో చూస్తున్నాము. స్త్రీయొక్క తల్లితండ్రులు కట్నం ఇవ్వలేదనేకాక,

తక్కువ ఇచ్చారనే సాకుమీద కూడా నూతన వధువులను చంపి వేస్తున్నారు. ఇది చాలా తీవ్రమయిన విషయం. ఈ పరిస్థితిని మనం మార్చాలి. భార్యాభర్తల సంబంధం వ్యాపార లక్షణాలతో కూడుకొని వుండని పద్ధతిలో వివాహ వ్యవస్థను రూపొందించు కోవాలి. అలాంటి వ్యవస్థకు చోటు కల్పించే సమాజాన్ని మనం నిర్మించుకోవాలి.

19వ శతాబ్దంలోని సంఘ సంస్కర్తల కృషి ఫలితంగా సహగమనం, వెట్టిచాకిరీ, బలవంతపు వైధవ్యజీవితం, బాల్యవివాహం, విద్య లేమి నశించాయి; సమాజంలో అలాంటి అత్యాచారాలు చాలవరకు సమసి పోయాయి. గుజరాత్ ప్రాంతంలో రాజారామ్‌మోహన్‌రాయ్ కాలంలో రామ్ మెహతాజీ అనే పేరుకల సంఘసంస్కర్త 1832లో ఉండేవాడు. ఆయన తన పద్ధతిలో సంఘసంస్కరణకు పూనుకొన్నాడు. ఐడిపంతులుగా ఉన్న ఆ మహనీయుడు విధవా పునర్వివాహం, స్త్రీ విద్య, మూఢ విశ్వాస నిర్మూలన వీటికొరకు కృషిచేశాడు. కాగా ఆయనకు రాజారామ్ మోహన్ రాయ్‌కి వచ్చినంతగా పేరుప్రతిష్టలు రాలేదు. అతడు ప్రాంతీయ భాషలో తన రచనలను సాగించినందువల్ల అలా జరిగింది. ఆయనవలె అన్ని ప్రాంతాలలోనూ సంఘసంస్కర్తలు ఉండేవారు. వారు ప్రాంతీయ భాష లలో రచనలు చేసినందున వారికి కూడా అదేస్థితి కలిగింది. రాజారామ్ మోహన్‌రాయ్ ఇంగ్లీషు భాషలో వ్రాసినందుననూ, సమాజంలోని శ్రేష్ఠులకు ఆయన కృషి తెలిసినందువల్లనూ మనకు రాజారామ్‌మోహన్‌రాయ్ పేరు బాగా పరిచయమైంది.

19వ శతాబ్దపు చివరిలోనూ, 20వ శతాబ్దపు తొలి రోజులలోనూ సంఘ సంస్కరణ బాగాసాగింది. కాని, ఇప్పటికీ పాత ఆచారాలు, మూఢ విశ్వాసాలు, అసమాన సంబంధాలతో కూడుకొని ఉన్న వివాహ వ్యవస్థ సమాజంలో పాదుకొని ఉన్నాయి. ఒకటిచెప్పి మరొకటిచేస్తే 19వ శతాబ్దంలో సహించేవారు కాదు. మహర్షి రణడే జాతీయ సంఘసంస్కరణల మహాసభను నిర్మించిన మహావ్యక్తి. స్త్రీల విద్య కోసం సంఘసంస్కరణ కోసం ముమ్మరంగా ఆందోళన చేశాడు. కాని, తీరా ఆయన వివాహం చేసుకోవలసివస్తే, 10 ఏళ్ళ బాలికను పెండ్లాడాడు. దాంతో సంస్కరణోద్యమం పెద్ద దెబ్బతిన్నది. ఈనాడు మనం అలాంటి

పరిస్థితులలోనే ఉన్నాం. కులాంతర వివాహాలలో మనకు విశ్వాసం ఉంటే, మతాంతర వివాహాలలో మనకు నమ్మకం ఉంటే, ఏ లాభదృష్టి లేకుండా నిరాడంబర లౌకిక వివాహాలను మనం ఆదరించదలిస్తే సంస్కరణ మనతో ప్రారంభం కావాలి ; మన కుటుంబంతో దాన్ని ప్రారంభించాలి.

స్వాతంత్ర్యానికి పూర్వం సంఘసంస్కరణకు అంకితమవడం, సామాజిక మార్పును అభిలషించడం జరిగేది. కాని, ఇటీవల అది తగ్గుముఖం పడుతున్నది. సామాజిక రుగ్మతలను రెండు దశాబ్దాలుగా - అంటే 1951 నుండి 1971 వరకు - పట్టించుకోవటం తగ్గుతున్నది. రాజ్యాంగంలో కులం తీసివేశామని, జనాభా లెక్కలలో కులం పేరు నమోదు చెయ్యడం లేదని చెప్పుకుంటూ సంతోషిస్తున్నాం ; గర్విస్తున్నాం. రాజ్యాంగపు సూర్యకాంతిలో ఆశాపూరిత హృదయాలతో తిరుగాడుతున్నాము. కుల నిర్మూలన మాత్రం జరగలేదు. ఎందుకని ఇలా సంభవిస్తున్నది ? రాజకీయ సంకల్పం లేనందువలననా, లేక అంకితమయిన సంఘ సంస్కర్తలు లేకనా, అలా కాక సామాజిక నిర్మాణం అనుకూలించ నందువలననా ఆలోచించవలసి వున్నది. మార్పు కావాలని కోరేవారికి తమ బాధ్యతలను గుర్తు చెయ్యడం, వైవాహిక సంబంధాల విషయమై దృక్పథాన్ని మార్చడం వేదిక చేయ పూనడం ముదావహం. యువతీ యువకులు ఒకచోట సమావేశమై పరస్పరం పరిచయం చేసుకోవడానికి ఈ వేదిక కృషి చేస్తుందని తెలిసింది. వ్యాపార దృష్టితో నడపబడే సంఘాలకు ఈ వేదికకు తేడా ఉన్నది. వ్యాపార సంస్థలు ధనార్జనపై దృష్టి కేంద్రీకరింప చేస్తాయి. అలాకాక వృద్ధులూ, అనుభవజ్ఞులూ అయిన వ్యక్తులు శ్రద్ధతో ఈ పనిని నిర్వహించ తలచడం సంతోషకారణం.

యువతీ యువకులు ఈ మహత్ కార్యంలో పాలుపంచుకోవడం శుభప్రదం. వరకట్నాలను ఆశిస్తున్నారని యువకులను పాత తరంవారు నిందిస్తున్నారు. కాగా సామాజిక సౌధాన్ని పునర్నిర్మించడానికి కృషిచేసే ఈ రకపు సంస్థలు సమాజంలోని కొత్త పోకడలను బహిర్గతం చేస్తున్నాయి. మున్ముందు కుటుంబం యొక్క, వివాహంయొక్క భవిష్యత్తు ఇతోధికంగా ఇప్పటికన్నా మెరుగవుతుందని నేను దృఢముగా విశ్వసిస్తున్నాను. అప్పుడు

వివాహం అవతల వ్యక్తియొక్క విశిష్టతమీద, వ్యక్తిత్వంపైన ఆధారపడు తుంది; అంతేకాని కేవలం భద్రతకోసం స్వీకరింపబడదు.

వివాహం యొక్క భవిష్యత్తు కేవలం ఆస్తి సంబంధాలమీద ఆధార పడదు. పితృస్వామ్య విలువల ప్రాతిపదికమీద ఈనాటి వివాహ వ్యవస్థ నెలకొనివున్నదని మనందరికీ తెలుసు. ఉత్పత్తి సాధనాలు వగైరాలలో వ్యక్తిగత ఆస్తిని తీసివేసిన రష్యా చైనాలలోకూడా వివాహవ్యవస్థ కొనసాగు తున్నది. పితృస్వామ్య సమాజం నిర్దేశించే సంబంధాలు ఇంకా అమలులో ఉన్నాయి. ఆస్తి, పితృస్వామ్య సంబంధాలు వైవాహిం జీవితాన్ని కుంటుపరచని సమాజాన్ని మనం ఆశిద్దాం.

పితృస్వామ్య వ్యవస్థ కనుమరుగయిననాడు భార్యాభర్తలు కలిసి ఒక యింటిలో కాపురం చేసే పరిస్థితిని మనజాలగ పోవచ్చును.

# వివాహం : కుటుంబం : సమాజం

— ఆచార్య ఎ. ఆర్. దేశాయ్

వివాహ వ్యవస్థ అసలు ఎందుకు ఉద్భవించింది ? దాని పనితీరు ఏమిటి ? స్త్రీ మానవిగా, మరియొక్క మానవ వ్యక్తితో సంబంధం కలిగి ఉండే వ్యక్తిగా కాకుండా కేవలం సంతానోత్పత్తి క్రమంలో ఒక పనిముట్టుగా మాత్రమే ఎందుకు చూడబడుతున్నది ? ఈ ప్రశ్నలకు సమాధానాలను మనం వెదకాలి ?

వివాహ వ్యవస్థ కుటుంబ వ్యవస్థతో ముడిపడి ఉన్నది. ఆస్థి, వారసత్వం మొదలైన అంశాలపై ఆధారపడి ఉన్నది కుటుంబ వ్యవస్థ. అంతే కాదు, అది సంతానోత్పత్తిని శాసిస్తున్నది. స్త్రీని కేవలం సంతానోత్పత్తి సాధనంగా పరిగణించటంతో ఆమె పతనం ప్రారంభమయింది. తన ఆస్తిని, తను స్త్రీ ద్వారా–భార్య ద్వారా–పొందే సక్రమ సంతానానికి చెందజేయాలని తహతహలాడతాడు పురుషుడు. దాంతో తనకున్న అధికారాన్ని, బలాన్ని, వాడి భార్య పవిత్రురాలుగా ఉండాలని శాసిస్తాడు. అంతటితో ఆగక పురుష సంతానానికి ప్రాధాన్యత ఇస్తాడు. ఇలా కుటుంబం, పురుష సంతానం, వ్యక్తిగత ఆస్తి పరస్పర సంబంధం కలవిగా తయారు అయినవి. పిల్లలను పెంచటానికి, ఇంటిచాకిరి చేయటానికి విధవలను - ఈనాడు కూడా - నియమించడం మనం గమనిస్తున్నాం.

ఆర్థిక ప్రాతిపదికలు స్త్రీని ఆధారపడి జీవించేమనిషిగా నిర్ణయించాయి. స్త్రీలపై హింస, వరకట్న మరణాల వార్తలు రోజూ వింటున్నాం ; చూస్తున్నాం. భర్త ఆమెను–తన భార్యను – తనతో సమానమయిన వ్యక్తిగా గుర్తించటంలేదు. సమాజంలో అమలులో ఉండే మత ధర్మశాసనాలు (Personal Laws) ఆమెకు తక్కువ స్థానాన్ని నిర్దేశించాయి. సెక్యులర్ రాజ్యాంగం (అలా ప్రకటించుకుంటున్నాం కదా !) అన్యాయమైన మత ధర్మ శాసనాలను ఎలా అమలులో ఉండనిస్తున్నదో నాకు తెలియటం లేదు.

స్త్రీ సమస్యను మొత్తం ప్రపంచ సమస్యగాను, భారతదేశ సమస్యగాను రెండు రకాలుగా చూడవచ్చును. భారతదేశ పరిస్థితుల పరిధిలో ఆలోచిస్తే వినియోగ విలువ ( Use Valve ) ఉన్న కోట్లాది పనిగంటలు- స్త్రీలుచేసే పని గంటలు - లెక్కలోకి రావటంలేదు. ఇంటిని శుభ్రం చేయడం, పిల్లలను పెంచడం, వారి అనుపానులు చూడటం, దుస్తులు ఉతకడం ఇలాంటి వాటిని స్త్రీలు చేస్తున్నారు కదా! వాటిని ఉత్పత్తికి అనుగుణమైన పనిగా గుర్తించడంలేదు. అదే పనిని, ఉదాహరణకు వంట పనిని ఆమె హోటలులో చేస్తే, లేక చాకలి దుకాణంలో (Laundry) చేస్తే అది లెక్కకు వస్తుంది. దానికి విలువ వస్తుంది.

జాతీయాభివృద్ధి క్రమంలో స్త్రీ వృత్తులలో పాల్గొనడమూ, ఆమెకు వృత్తిపరంగా విలువా తగ్గుతున్నాయి. 11శాతం స్త్రీలు మాత్రమే ఆర్థికంగా లాభించే వృత్తులలో ఉన్నారు. మిగతా 89 శాతం మంది పురుషులపై ఆధారపడి జీవిస్తున్నారు. వారి జీవితాలు పురుషుని కొనుగోలు శక్తితో ముడిపడి ఉన్నాయి.

అతడు ఇంటికితెచ్చే చాలీచాలని జీతపు పైకంతో ఆమె ఇల్లుగడపాలి. జనాభాలో అధిక శాతం బీదరికపు రేఖకు దిగువస్థాయిన జీవితం గడుపుతున్నారు. ఈ దారిద్ర్యం గృహిణులకు పెద్ద సమస్య తెచ్చిపెట్టున్నది. ఆమెకు లాభకరమైన ఉద్యోగవసతి లేనందున పరిస్థితి మరీ క్లిష్టమవుతున్నది. అదిగాక మత ధర్మశాసనాలు (Personal Laws) స్త్రీ యొక్క హోదాను నిర్ణయించాయి. అవి స్త్రీలకు వ్యతిరేకంగా ఉన్నాయి. వారసత్వం, దత్తత, ఆస్తిహక్కు ఇలా అన్నింటిలో అవి స్త్రీలకు అన్యాయం చేస్తున్నాయి. ఇటీవల కాపురానికి రమ్మనమని భర్తలుపెట్టే పిటీషనులు (Petitions for Restitution of conjugal Rights) ఎక్కువవుతున్నాయి. తమ భర్తల డిమాండ్లను పాలించటానికి అనేకమంది భార్యలు తమ ఉద్యోగాలకు రాజీనామలిచ్చి వెళ్ళవలసి వస్తున్నది. ఇటీవల జనాభా లెక్కల సేకరణలో ఒక ఆశ్చర్యకరమైన మార్పువచ్చింది. పూర్వం సంపాదనా పరుడు, ఆధారపడే వ్యక్తి అని రెండే రెండురకాలుగా నమోదు చేయటం జరిగేది. ఇటీవల 3 రకాలుగా నమోదు చేస్తున్నారు. సంపాదన పరుడు, ఇతరులపై ఆధారపడుతూ

సంపాదించు వ్యక్తి (Dedendent Earner), ఇతరులపై ఆధారపడే మనిషి అని వర్గీకరణ జరిగింది. సంపాదించి గృహిణిగా ఉండే స్త్రీని రెండవరకపు వ్యక్తిగా నమోదు చేస్తున్నారు.

విల్సన్ అనే పరిశోధకుడు "సంక్షేమ రాజ్యం : స్త్రీ" అనే గ్రంథం వ్రాశాడు. సంక్షేమ కార్యక్రమాల సందర్భంగా ఆమెను తల్లిగా పరిగణించటం జరుగుతున్నదని, ఆమెను పౌరునిస్థాయిలో గుర్తించటం జరగటం లేదని అతడు స్పష్టీకరించాడు. ఆమె కుటుంబాన్ని పెంచి ప్రోదిచేసే వ్యక్తి; మార్కెటులో శ్రమ శక్తిని అమ్ముకునే వ్యక్తులను తయారుచేసే మనిషి. స్త్రీ సమస్య ఆస్తి సమస్యతో, కుటుంబంతో, సంతానానికి ఆస్తి చెందజేసే పద్ధతితో దగ్గర సంబంధం కలిగి ఉన్నది. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే వివాహ సమస్యను విడిగా చూడకుండా కుటుంబము, ఆస్తి సంతానం మొదలైన విషయాల సందర్భంగా పరిశీలించాలని నా భావం. కనుక, వివాహం ఇరువురు వ్యక్తుల ఎంపిక కాదు. స్త్రీ ఒక ఆస్తి; ఒక వస్తువు. ఆ వస్తువును-ఆస్తిని-ఒక కుటుంబం నుండి మరియొక కుటుంబానికి మార్పిడి చేయటమే ఈనాటి వివాహం యొక్క ముఖ్యలక్షణం. మత ధర్మ శాసనాలు ఈ మార్పిడిని న్యాయ సమ్మతం చేశాయి. ఈ మత ధర్మ శాసనాలు స్త్రీ జీవితం యొక్క మౌలికాంశాన్ని ప్రభావితం చేస్తున్నాయి. వివాహం విషయంగా స్త్రీ శక్తిని మెరుగు పరచాలన్నా, అసమానత్వాన్ని ఆమోదిస్తున్న ఈ సామాజికవ్యవస్థను మార్చాలన్నా ప్రత్యేక కృషిసాగాలి.

సిద్ధాంతరీత్యా ఆమెకు సమానత్వాన్ని ఇచ్చాము. కాని శాసనరీత్యా, ఆర్థికపరంగా ఆమెను పరులపై ఆధారపడి జీవయాత్ర సాగించే మనిషిగా మార్చాము. వరకట్నాల గాథలు, భార్యలను హింసించటం, ఇంటిలో స్త్రీ యొక్క నిస్సహాయత, దత్తు విషయంలో ఆమెకు హక్కు లేకపోవటం, బయటి ప్రపంచంలో తిరగటానికి అసౌకర్యాలూ ఇబ్బందులూ కష్టాలూ ఇవన్నీ ఆమెకున్న అసమానత్వ స్థాయిని రుజువు చేస్తున్నాయి. చివరకు వరుని ఎన్నుకోవటంలో కూడ ఆమెకు స్వేచ్ఛలేదు. సినిమాలలో కథలు చూస్తున్నాం. పెండ్లివారు పెండ్లిచూపులకు వస్తారు. అమ్మాయి 'టీ' తెచ్చిఇస్తుంది. మహా అయితే వధూవరులను ఏకాంతంగా 5 నిమిషాలు మాట్లాడుకోనిస్తారు. తరువాత కులం ప్రవేశిస్తుంది రంగంలోనికి. ఇలా ఆమె స్వతంత్ర ప్రతిపత్తిని చంపివేయుటం జరుగుతున్నది.

స్త్రీ మౌలికంగా మరియొకరికి లొంగి ఉండవలసిన వ్యక్తి; పరులను ఆశ్రయించి బ్రతకవలసిన జీవి. సమాజంలో కుటుంబం ఒక భాగం. వివాహం కుటుంబానికి ప్రాతిపదిక. వివాహం వస్తుమార్పిడి. ఈ సందర్భంగానే వివాహాన్ని అర్థం చేసుకోటానికి ప్రయత్నించాలి.

కుటుంబంలో స్త్రీయొక్క పరాశ్రియత, విలువలవ్యవస్థలో ఆమెస్థానం, సంతానోత్పత్తికి ఉపకరించే సామాజిక సాధనంగా ఆమె ప్రతిపత్తి:- దీనిని గురించి సంప్రదాయవాదులు స్తోత్రపాఠాలు వల్లిస్తారు – ఇవి సామాజిక వ్యవస్థయొక్క ప్రతీకలు; లక్షణాలు. ఈ అంశాలను గమనంలో ఉంచుకొని పితృస్వామ్య విలువలపై నెలకొల్పబడిన తొలి వివాహ వ్యవస్థను చారిత్రక దృక్పథంతో పరిశీలించాలి. అన్ని మత శాసనాలు స్త్రీని పురుషుడికి లొంగి ఉండాల్సినట్లుగా విధులు ఏర్పరిచాయి. ఆమె అణచివేతకు గురి అయింది. వేదకాలంలో స్త్రీ స్వతంత్ర వాయువును పీల్చిందని తరువాత ఆమె తన స్వేచ్ఛాయుత స్థానాన్ని కోల్పోయిందని కొందరు చెప్తారు. దీని విషయంగా సరియైన పరిశీలన లేదు. (అంటే ఇప్పటికి ఉన్న పరిశోధనా ఫలితాలను బట్టి ఈ వాదనకు ఆధారాలు లేవని తాత్పర్యం) ప్రస్తుతమున్న వివిధ వైవాహిక రీతులు, వాటిని బాగుచేయటానికి అడ్డు వస్తున్న అనేక అంశాలు, వివాహానికి వెలుపల సంబంధాలు, వీటిని అన్నింటిని ఆస్తి, వర్గం సంబంధాలు, పితృస్వామ్య విలువల వ్యవస్థ సందర్భంగానే అధ్యయనం చేయాలి. అలా కాకపోతే మనం వ్యాధిని వదలిపెట్టి రోగ లక్షణాలను పట్టుకుని ప్రేలాడినట్లు అవుతుంది.

ఇటీవల 1975 నుండి 1980 వరకు అమెరికాలో, బ్రిటనులో క్రొత్త ఉద్యమం బయలుదేరింది. ఉద్యమం క్రొత్తదైనా భావాలు పాతవే. విలువల విషయంగా ఇది తిరోగమనం. పితృస్వామ్య విలువలను తిరిగి నెలకొల్పాలని, స్త్రీని మాతృమూర్తిగా మాత్రమే చూడాలని, స్త్రీ ఉద్యోగ సందర్భంగా పురుషునితో పోటీ పడరాదని ఆ ఉద్యమ లక్ష్యం. అంటే పురుషాధిక్య సమాజపు విలువలను స్త్రీ తనస్వంతం చేసుకోవాలన్న మాట. నిధులను సమకూర్చే పద్ధతిని అవలంబించి ఈ ఉద్యమాన్ని ఇతర దేశాలకు ఎగుమతిచేసే ప్రయత్నాలు సాగుతున్నాయి. ఈ వేదికలాంటి సంస్థలను

ప్రభావితం చేయాలనే కృషి జరుగుతున్నది. ఈ వేదిక ఆ దుర్మార్గ ప్రయత్నాలకు బలి కాబోదని ఆశిస్తున్నాను. మరొక ప్రమాదం పొంచి ఉన్నది. పాలకవర్గం ఈ వేదిక నడిపే ఉద్యమాలలాంటి వాటిని భగ్నం చేయటానికి నిరంతరం కృషి చేస్తుంది. కనుక ఆ విషయమై ఈ వేదిక అప్రమత్తంగా ఉండటం అవసరం.

విశాల పరిధిలో పరిమితమైన ఈ వివాహ సమస్యను చర్చించాలని నా అభిమతం. ఈ వేదిక కేవలం కుటుంబ విషయమైన సలహా కేంద్రం గాను, వివాహ మార్గదర్శక సంస్థగాను మాత్రమే వ్యవహరించి తృప్తి పడకుండా పోరాట పటిమకల సంస్థగా రూపొందాలని కోరుతున్నాను.

వివాహ వ్యవస్థ ఎప్పుడు పుట్టింది? దాని జన్మకు కారణ భూతాలు ఏవి? పితృస్వామ్య విలువల వ్యవస్థా లేక ఆస్తి సంబంధాలవల్ల కలిగిన ఆర్థిక పెత్తందారీ తనమూ, తద్వారా సంభవించిన స్త్రీ యొక్క న్యూనతా స్థితియా లేక మత తంతు ఫలితమా అనేది ఒకరకంగా ప్రస్తుతానికి పండిత గోష్టికి వదలి వేయవలసిన విషయం. భారతదేశ పరిస్థితుల సందర్భంగా నేను లేవనెత్తే అంశం ఏమంటే స్త్రీలు పురుషాధిపత్యానికి లొంగి ఉండటం స్త్రీలకు ఉన్న ప్రత్యేక అసౌకర్యాలు పరిమితుల వల్లనా లేక చారిత్రక పరిణామ ఫలితంగా సంభవించిన (ఆర్థికం వగయిరా) ఆమెపై ఆధిపత్యం వల్లనా అనేది గమనించమని నేను కోరుతున్నాను. ఆ విశాల పరిధిలోనే ఆమె యొక్క సంతానోత్పాదనా శక్తినీ దాని విలువనూ, పాత్రనూ మదింపు వేయవలసి ఉంటుంది. స్త్రీకి కలుగుతున్న కష్టాలు ఎన్ని ఆర్థిక కారణాలవల్ల ఉత్పన్నమవుతున్నాయి అనేది ముఖ్యప్రశ్న. ఇలా అన్నంత మాత్రాన ప్రతిదానినీ సరాసరి ఆర్థిక పరిస్థితులకు ముడిపెట్టడం తగదు. స్త్రీ యొక్క నిస్సహాయతను, దాని మౌలిక స్వభావాన్ని నొక్కి చెప్పటం జరుగుతున్నది. అంతే. ఆ నిస్సహాయత ఆర్థికమూ, తదితరమూ కూడా. కాగా ఆర్థిక నిస్సహాయత ప్రాథమికమైనది.

ఒక అంశాన్ని ఈ సందర్భంగా వివరించటం అవసరం. సోషలిస్టు దేశాలలో కూడా స్త్రీల అణచివేత, స్త్రీలయెడ తక్కువచూపు, నిరాదరణ సాగుతున్నదని విమర్శ వినబడుతున్నది. ఆ స్థితి అంతా సమాజ పరమయినా

స్త్రీ పురుషుల అసమానత్వం ఇంకా కొనసాగుతున్నదనే ఆరోపణ వస్తున్నది. ఇది వాస్తవం. సోషలిజం వెనుకబడిన దేశాలలో వచ్చినందుననో, లేక ఆ దేశాలు తదితర దేశాల అనుభవంవల్ల గుణపాఠాలు నేర్చుకోవటానికి వీలు లేకుండా తదితర దేశాలకు దూరంగా ఉండటం వల్లనో, లేక పాలకులకు అధికారమనస్తత్వం ప్రాప్తించినందుననో ఆ పరిస్థితి ఏర్పడి ఉండవచ్చును. ఏదైనా అలాంటి స్త్రీ పురుష అసమానత్వం అక్కడలేదని వాదించ పూనటం నిరుపయోగం. వ్యవస్థను కూలదోస్తే, నూతన వ్యవస్థలో అంతా సజావుగా జరుగుతుందనే భావం ప్రబలంగా ఉన్నది. కాని అనుభవం మాత్రం మరో విధంగా ఉన్నది. వ్యక్తిగత ఆస్తిని కూలద్రోసే ప్రయత్నంలో స్త్రీలు అనుచరులవుతున్నారు; భాగస్వాములు కావటంలేదు. కమ్యూనిస్టుపార్టీ మహాసభలలో నేనొక సన్నివేశాన్ని చూచాను. మహిళా కార్యకర్తలను వంట, భోజనాల ఏర్పాట్లను చూడమంటారు. మగ కార్యకర్తలు ఇతర పార్టీ కార్యక్రమాలను పర్యవేక్షిస్తారు. ఇది ఆక్షేపణీయమైన అంశమే. అందులో సందేహానికి తావులేదు.

చాలామంది మార్క్సిస్టులు స్త్రీలను ప్రత్యేక తరగతి (Category)గా పరిగణించడం లేదు. స్త్రీలు ఉత్పత్తిలోనూ, సంతానోత్పత్తిలోనూ సమానంగా పాలుపంచుకోవలసినవారు. వీరికి సమానప్రతిపత్తిని ఇవ్వవలసి ఉంటుంది. ఈ సందర్భంగా గమనించదగిన విషయం ఒకటుంది. రెండురకాల అభిప్రాయాలు ప్రస్ఫుటమవుతున్నాయి. ఈ సమాజాన్ని పురుషాధిక్య సమాజంగా గుర్తించి పురుషులకు వ్యతిరేకంగా వైఖరిని ప్రదర్శించేది ఒకటి. దీనిని 'రాడికల్ ఫెమినిజం' (Radical Feminism) అని పిలుస్తున్నారు. ఈ వ్యవస్థలో పితృస్వామ్య విలువలు పెత్తనం చేస్తున్నాయని గ్రహించి వాటినిఎదుర్కొనేది 'సోషలిస్టు ఫెమినిజం' (Socialist Feminism). రష్యాలో మాతృత్వాన్ని తెగపొగిడి ఎక్కువమంది సంతానాన్ని పొందగలిగిన తల్లులకు బహుమతులిచ్చి గౌరవిస్తున్నారు. ఇది అభ్యంతరకర విషయం. కొన్ని సోషలిస్టు దేశాలలో ఒకరకపు అధికార వర్గం స్త్రీలను అణచివేస్తున్నది; వారి వికాసానికి అవరోధాలు కల్పిస్తున్నది. సోషలిజంలో నమ్మకమున్న స్త్రీలు కూడా ఇలాంటి భావాలను ప్రకటిస్తున్నారు.

ఇక్కడ నేనొక అభ్యర్థన చేస్తున్నాను. సోషలిస్టు సమాజాలు సాధించిన విజయాలను, ప్రయోజనాలను గమనించడం అత్యవసరం. విద్య విస్తరించింది. ఉద్యోగాలు అందరికీ వచ్చాయి. సామాజిక సదుపాయాలు అందరికీ లభించాయి. స్త్రీలూ ఇలా లాభించారు. కాగా కొన్ని విలువలు-పితృస్వామ్య వ్యవస్థ విలువలు-ఇంకా శిథిలం కాకుండా మిగిలాయి. ఇది నూతన సమస్యగా పరిణమించింది. అయితే పెట్టుబడిదారీ సమాజాలకు సోషలిస్టు సమాజాలకు తేడాను మనస్సులో ఉంచుకోవాలి. పెట్టుబడిదారీ సమాజంలో స్త్రీ కేవలం వస్తువు. మార్కెటు ఆర్థికవ్యవస్థలో ఆమె ఒక పావు. ఆమె శ్రమకు వినియోగపు విలువ లేదు. సోషలిస్టు దేశాలలో స్త్రీల సమస్య వారి నిస్సహాయతకు – మౌలిక నిస్సహాయతకు – సంబంధించినది. ఈ విభేదాన్ని విస్మరించి సోషలిస్టు దేశాల ప్రగతిని మరచిపోవటం జరుగుతున్నది.

ఇపుడు ఈ వివాహ సమస్యను స్త్రీలు - ఒక తరగతికి చెందిన వ్యక్తులుగా - పరిష్కరించ ప్రయత్నిస్తున్నారు. ఇది ముదావహం. సోషలిస్టు దేశాలను ఈ సందర్భంగా విమర్శించేవారు కొంతవరకు వాస్తవాన్నే పలుకుతున్నారు.

చర్చలలో రావలసిన మౌలిక ప్రశ్న ఏమంటే ఆమె విప్లవాన్ని సాధించే వ్యక్తియా? లేక విప్లవం వల్ల లాభంపొందే మనిషియా? ఆమె యెడ నిరాదరణ వ్యక్తిగత ఆస్తి విధానం వల్ల కలుగుతున్నదా? లేక పాతకాలపు విలువల వ్యవస్థ వల్ల ఉత్పన్నమవుతున్నదా? స్త్రీలలో నూతన జాగృతి ఉదయిస్తున్నది. అన్ని రంగాలలో భాగస్వామ్యాన్ని వారు డిమాండు చేస్తున్నారు. ఇది శుభకరమైన పరిణామం.

—(౦)—

# కులతత్వ సమస్య

—న్యాయమూర్తి కె. పున్నయ్య

ప్రేమ వివాహాలు విఫలమయిన వంటారు కొందరు. నేను నమ్మను. ప్రేమ వివాహాలు కులాంతర, మతాంతర వివాహాలకు దోహదం చేస్తాయి.

సమగ్ర హిందూ వివాహ శాసనం హిందువులలో కులాంతర వివాహాలకు వెసులుబాటు కల్పిస్తున్నది. ప్రత్యేక వివాహశాసనం క్రింద మతాంతర వివాహం చేసుకోవచ్చును. చట్టం ముందుకు పోయి మతాంతర, కులాంతర వివాహాలకు అవకాశం ఇస్తున్నది. కాని సమాజం పురోగమించటం లేదు. ఉద్యోగరీత్యా అమెరికా వెళ్ళిన విద్యావంతులైన యువకులు భారత దేశానికి వచ్చి తమ కులంలోనే వధువులను ఎంపిక చేసుకొని పెండ్లాడి మరల తిరిగి అమెరికా వెళ్తున్నారు. చదువుకుంటే కులతత్వం పోతుందని అనుకున్నాం. కాని అది అలా పోవటంలేదు సరికదా, కులతత్వం కరుడు కట్టుతున్నట్లుగా కన్పట్టుచున్నది. విశ్వవిద్యాలయాలు, కళాశాలలు కుల తత్వానికి ఆలవాలమైనవి. న్యాయవాదుల సంఘాల విషయం మరి చెప్ప నక్కరలేదు. 1920 నుండి 1945 వరకు ఉత్తేజ పూర్వకమైన వాతావరణం ఉండేది. రాజకీయ, సాంఘిక రంగాలలో కుల ప్రసక్తిలేని ఉద్యమాలు ఆనాడు ఉండేవి. స్వాతంత్ర్యానంతరం ఈ సమస్య అంతరించి పోతుందని భావించారు. కాని, ఇది నానాటికి ఘనీభవించి పోతున్నది.

దీనిని మరి ఎలా పరిష్కరించాలి? 100కి 20 మంది కులాంతర వివాహాలకు సిద్ధపడుతున్నారు. కులరహిత సమాజాన్ని నిర్మించాలంటే కులాంతర వివాహాలు జరిపించాలి.

ప్రతి విశ్వవిద్యాలయంలో వివాహవేదికను నెలకొల్పాలి. విద్యార్థులుగా ఉన్నపుడు సామాజిక విప్లవాన్ని గురించి మాట్లాడినవారు చదువు అయిపోయిన తరువాత విప్లవ లక్ష్యాలను మరచి పోతున్నారు. కనుక అక్కడే – ఆ కళాశాలలోనే – వేదికలను నిర్మించటం మంచిది. కనీసం ఆర్థిక స్తోమతు కలిగినవారికి ఈ వేదికలు దోహదకారులవుతాయి.

ప్రేమ వివాహాలలో నాకు నమ్మకమున్నది. పెద్దలు ఏర్పాటుచేసే పద్ధతి నాకు నచ్చదు. ఆ మాటకువస్తే, విధిగా విధిగా వివాహమాడాలనే నియమం ఉండరాదు.

కులాంతర వివాహాలు చేసుకున్నవారికి ఉద్యోగాలు దొరకడం లేదు సరికదా, అమ్మాయి తల్లిదండ్రులు వరునిపై తప్పుడు కేసులు పెడుతున్నారు. ఇలాంటి సందర్భాలలో వధూవరులకు రక్షణ కల్పించాలి.

శాసనం వెనుకబడి ఉండలేదు. కాకపోతే, న్యాయవాదులూ న్యాయమూర్తులూ ఇంకా వెనుక చూపుతో ఉంటూ ఉన్నారు. ఎన్ని ఇబ్బందులు ఉన్నా సమాజ శ్రేయస్సు దృష్ట్యా, దేశప్రగతి కోసం, వారిరువురి సౌభాగ్య సంతోషాల కొరకు యువతీ యువకులు కులాంతర మతాంతర వివాహాలు చేసుకోవడానికి ముందుకురావాలి.

# కీలక ప్రశ్నలు

— ఆచార్య సి. లక్ష్మన్న

ఈ సెమినారు నిర్వాహకులు 15 అంశాలపై దృష్టిని కేంద్రీకరించినట్లు తోస్తున్నది. వివాహవ్యవస్థ ఉండాలనేదే వారి అభిప్రాయమయినట్లు ద్యోతకమవుతున్నది. కాగా ఏ రకపు పెండ్లికావాలి, ఈనాటి పెండ్లి పద్ధతికి అది ఎలా భిన్నంగా ఉంటుంది అనేవి ప్రశ్నలు కావచ్చును.

కులాతీత, మతాతీత వివాహాలలో కులం మతం సందర్భరహితం అవుతాయి. విశ్వజన్యీతకు 'ఏ అర్థం చెప్పుకున్నా, ఇతోధికంగా బహుకాలం మన్నికగా ఉండేవి శాశ్వతత్వ స్వభావం కలిగి ఉండేవిగా ఉన్న భార్యా భర్తల సంబంధానికి — నూతన వైవాహిక రీతిలోని భార్యా భర్తలకు – విశ్వజనీనత విధిగా ఉండవలసిన ఆధారమవుతున్నది. నూతన వివాహం అనగానే లౌకిక వివాహం స్ఫురణకు వస్తుంది. మంత్ర తంత్రాలు లేని వివాహం అది.

వ్యక్తి స్వేచ్ఛకు వివాహం భంగకరం కాదనుకుంటే వివాహ వ్యవస్థ అవసరమవుతుంది. పెండ్లివల్ల ఇరువురి యొక్క లేదా ఏ ఒకరి యొక్క స్వేచ్ఛకు దెబ్బతగులుతుందనుకుంటే అపుడు వివాహ వ్యవస్థ ఉనికి అనవసర మవుతుంది. కనుక వ్యక్తి స్వేచ్ఛకు వివాహవ్యవస్థకు అవినాభావ సంబంధం ఉన్నదన్నమాట.

వివాహ విధానం ఎలా పుట్టింది? ఎలా పెరిగింది? ఏం పనిచేస్తున్నది? అనేవి ముఖ్య ప్రశ్నలు. కాగా వివాహ వ్యవస్థ పనిచేసే తీరు ఫలితంగా కొన్ని అసందర్భమైన, అసంగతమైన లక్షణాలు ఉద్భవించవచ్చును. కాలక్రమేణ వాటికికొంత తంతుఏర్పడి అసలు మౌలిక స్వభావం మరుగునపడి పోవచ్చును. అలా జరుగుతున్నదా? వివాహ వ్యవస్థను మనం ఖండించేటప్పుడు దాని మౌలికాంశాన్ని త్రోసిరాజంటున్నామా లేక దాని చుట్టూ అల్లుకున్న తంతునా అనే ప్రశ్నకు సమాధానం చెప్పుకోవాలి. ఈ గోష్ఠిలో ఇంచుమించుగా సగంమంది స్త్రీలు ఉన్నారు (గట్టిగా

లెక్కవేస్తే పురుషుల సంఖ్యే అధికం). ఎవరైతే ఒక సమస్య వల్ల చిక్కులకు లోనవుతున్నారో, ఎవరైతే బాధలకు గురి అవుతున్నారో వారే ఆ విషయంపై అభిప్రాయ ప్రకటన చేయాలనే వాదన ప్రబలంగా ఉంది. అసలు ఈ సూత్రం సమంజసమయినదేనా ? భారతదేశ పౌరులందరికీ వర్తించే ఒకేఒక తరహా వ్యవహార సంహిత (Uniform Civil Code) కావాలని డిమాండు వింటున్నాం. ఈ సందర్భంగా ముస్లింలూ, క్రైస్తవులూ తమంత తాముగా మార్పులను కోరేవరకూ, సవరణలను సూచించే వరకూ అలాంటి ప్రయత్నం చేయరాదని కొందరు వాదిస్తున్నారు. అంటే, ఒక పౌరుడు ఈ విషయంపై ఎంత ఆసక్తి కలిగిఉన్నా అతడు ఈ వ్యవహారంలో జోక్యం కలుగజేసుకోరాదన్నమాట. అలాచేస్తే ముస్లింల క్రైస్తవుల మనోభావాలను దెబ్బతీసిన వాడవుతాడట. ఈ సూత్రాన్ని అంగీకరిస్తే అధిక సంఖ్యాకులయిన స్త్రీలు డిమాండు చేసేవరకు వారికి సంబంధించిన శాసనాలు, నియమాలు, ఆచారాలు, అలవాట్లు వీటిలో మార్పుకు పురుషులు ప్రయత్నించరాదు. ఇది ఎంతవరకు సబబు ?

నూతన పద్ధతిలో స్త్రీ పురుషుల సంబంధాలు ఎలా ఉండాలి ? పెండ్లి లేని సమాజం ఏ రకంగా ఉండాలి ?

వివాహ వ్యవస్థకు పూర్వం ఉన్న సమాజపు స్థితిగతులను గురించి రెండు విరుద్ధవాదనలు ఉన్నాయి. వందల సంవత్సరాలుగా వావీవరుసా లేని స్త్రీ పురుష సంబంధాలు ఉండేవని ఒకవర్గం అంటే అలాకాదని వెస్టర్ మార్క్ వాదించాడు. అధిక సంఖ్యాకులైన పరిశోధకులు మొదటి అభిప్రాయాన్నే బలపరుస్తున్నారు. ఆనాటి స్త్రీ పురుషుల ఆదిమ నాగరిక సంబంధం ఈనాటికి సంక్లిష్టమయింది. నాగరికత వృత్తిపద్ధతిలో పరిణామం చెందుతుందని అందరూ అంగీకరించక పోయినా స్త్రీ పురుష సంబంధాల విషయంలో ఈ నాటికి మొదటికి వచ్చామా అనే అనుమానం పొడసూపుతున్నది. ముఖ్యంగా పాశ్చాత్య సామాజిక రీతులను అధ్యయనం చేస్తే ఈ ప్రశ్న తప్పక ఉదయిస్తుంది.

వివాహవ్యవస్థ అవసరం లేకపోతే మానవావసరం ఏమిటి ? లైంగిక తృప్తి ఒకటి కావచ్చును. అయితే స్త్రీ పురుషుల మధ్య ఉండవలసిన సంబంధ స్వభావ నిర్దేశనం జరగాలి. ఇందుకు తీవ్రంగా కృషిచేద్దాం.

—)(—

# ఇలాంటి వేదికలు అవసరం

— డా॥ బల్వంతరెడ్డి

బ్రిటిష్ ప్రభుత్వంలో ఇండియా మంత్రిగా పనిచేసిన పెథిక్ లారెన్సు ప్రభువు స్త్రీ విమోచనోద్యమ కార్యకర్త అని చెప్పవచ్చు. పురుష దురహంకారం నుండి విముక్తి పొందిన పురుషులు మహిళా విముక్తికి అండగా నిలిచారు. కనుక స్త్రీ విమోచనను కాంక్షించి దానికోసం కృషిచేసే స్త్రీలు తమతోపాటు విజ్ఞులైన పురుషులను ఉద్యమంలో పనిచేయనివ్వాలి. ఒకే లక్ష్యంతో పనిచేసే స్త్రీ పురుషులు కలిసికట్టుగా పనిచేస్తే తప్ప విజయం సాధించలేం.

మానవులకు సృజనాత్మక ప్రేరణలు వున్నాయి. అలాగే సమాజం యెడ బాధ్యతలూ వున్నాయి. ఈ రెంటినీ సమన్వయపరచి వీటిమధ్య సామరస్యాన్ని సాధించాలి. ప్రతి సంస్థా ఒక లక్ష్యాన్ని, ఒక ప్రయోజనాన్ని సాధించడానికి ఉద్భవిస్తుంది. కాలక్రమేణా అది నిరుపయోగమై దానిస్థానే మరియొక సంస్థ పుడుతుంది. కనుక ఇంతకన్నా మెరుగైన సమాజాల్లో కొత్త సంస్థలను స్థాపించడం, లేక ఇంతకన్నా మంచి సంఘాలను నిర్మించడం మనం చేయవలసిన పని. ఈ మౌలిక సూత్రాల దృష్ట్యా వివాహ వ్యవస్థను పరిశీలించాలి. ప్రభుత్వం యువతీయువకుల విషయమై పట్టించుకోవలసి వున్నది. నిజానికి ఆ బాధ్యతను ప్రభుత్వానికి ఇవ్వడమా లేదా అనేది వేరే ప్రశ్న. అలా ప్రభుత్వానికి ఆ బాధ్యతను కట్టపెట్టటానికి ఇష్టపడకపోతే ఈ వేదికలాంటి స్వచ్ఛంద సంస్థలు అవసరమవుతాయి.

యుక్త వయస్సులో వున్న యువతులకు సామాజికపరమైన పరిచయం, అనుభవం కావాలి. మన విద్యా విధానంలో స్త్రీలకు సామాజికీకరణకు తక్కువ అవకాశాలు వున్నాయి. తగిన సమయంలో అవసరమైన అనుభూతి కొరవడితే తర్వాత అలాంటి అవకాశం ఇచ్చినా లాభంలేదు.

ఈ పరిస్థితిని ఎలా మార్చాలి? విద్యా విషయికంగా ఎన్నో మార్పులు చేయటానికి అవకాశాలు వున్నాయి. సమాజంలో స్త్రీ యొక్క స్థానాన్ని గురించి యువతులకు విషయ పరిజ్ఞానం అందించాలి.

స్త్రీలు ఏ వర్గానికి చెందినవారైనా – ధనవంతులు లేక మధ్య తరగతి లేక శ్రామికులు–వారనుభవించగల స్వేచ్ఛ వారి ఆర్థిక స్వాతంత్ర్యం మీద ఆధారపడుతుంది. స్త్రీలకు ఇతోధికంగా ఉద్యోగావకాశాలు కల్పించాలి. ఉన్నత సమాజాన్ని నిర్మించాలి. ఇది ఎలా సాధించాలి అనేది ఒక గడ్డు ప్రశ్న.

వరకట్నం కన్నా యువతీ యువకుల్ని బాధించేది మరొక సమస్య వున్నది. వివాహానికి ముందు వారు ఒకర్నొకరు కలిసికొని సంప్రదించుకోవటానికి ప్రస్తుత సమాజంలో అవకాశాలు లేవు. ఈ విషయమై కొంత దర్యాప్తు జరగాలి. పెళ్ళికి ముందు స్త్రీ పురుషులను పరస్పరం పరిచయం చేసుకోవటానికి వీలు కలిపించే సంస్థలు కావాలనుకుంటే అవి ఎలాంటి స్వభావం కలిగుండాలి? ఈ వేదికలాంటివి అందుకు వుపకరిస్తాయా?

మరో అంశం ప్రస్తావించవలసి వున్నది. ఏ వైవాహిక బంధమూ శాశ్వతంగా మనజాలదు. ఒకవేళ స్త్రీ పురుషులు త్వరపడి వివాహబంధంలో ఇరుక్కుంటే పొరపాటును సరిదిద్దుకునేది ఎలా? ఈ సందర్భంగా మన సామాజిక లక్ష్యాలు ఏమిటి? ఆ దంపతులకు సంతానంవుంటే సమస్యను ఎలా పరిష్కరించాలి? వివాహత్పూర్వం, తర్వాత యువతీ యువకుల మధ్య ఉత్పన్నమయ్యే సమస్యల పరిష్కారంలో సహాయకారిగా వుండటానికి ఈ వేదికలాంటి సంస్థలు ఉపయోగపడతాయని నా అభిప్రాయం. అలాగే దంపతుల మధ్య మనస్తత్వాలు వేరై సామరస్యం లోపించినప్పుడు పరిస్థితిని సరిదిద్దడానికి లేక సమస్యను పరిష్కరించటానికి ఈ వేదికలాంటి సంస్థలు దోహదం చేస్తాయి. తీవ్రవాద భావాలున్నవారు వేరే ఇతర సంస్థలను పెట్టుకోవచ్చు. కాని సామాన్య ప్రజానీకానికి ఇలాంటి వేదికలు అత్యవసరం.

000

# మధ్యతరగతి కృషినికూడా బలపరచాలి

— డా॥ రమా మేల్కోటే

స్త్రీలకు శత్రువులు స్త్రీలేనని చాలామంది స్త్రీలు అంటూవుంటారు. తమను గురించి ఈ ఆత్మ విధ్వంసక భావం స్త్రీలకు ఎలా కలిగింది? ఇలాంటి చిత్రణ ఎలా పెంపొందుతున్నది? శతాబ్దాలతరబడి ఆమెకు అందించబడిన విషయజ్ఞానంవల్ల ఆమెలో ఈ భావం తరతరాలుగా పాదుచేసుకున్నది.

చాలామంది ఈ వేదికలాంటి సంస్థలను మధ్యతరగతి సంస్థగా చిత్రించి ఈసడిస్తున్నారు. ఈ వ్యవస్థలో కూడా ఇలాంటి వేదికలు స్త్రీలకు చాలా అవసరం. సమాజంలో ఆర్థికత మౌలికమని, ఉపరితలంలో ఇలాంటి ఉద్యమాలు భాగమనీ కొందరు వ్యాఖ్యానిస్తున్నారు. కావచ్చును. ఉపరితలాన్నయినా మార్చడానికి ప్రయత్నం అవసరం కదా? అది మధ్యతరగతి కృషి అయినా దాన్ని ప్రోత్సహించాల్సిందే.

వివాహ విషయమై నేడు జరుగుతున్న చర్చ పట్టణాలకు సంబంధించినదని, గ్రామస్థుల జీవితాలకు వర్తించదని ఒక అభిప్రాయం వెలిబుచ్చడం జరిగింది. అలాగే ఇదంతా శ్రామిక సమాజానికి సంబంధించని విషయమని విమర్శ వచ్చింది. ఈ రెండు దృక్పథాలూ లోపభూయిష్టాలే. గ్రామీణ ప్రాంతాలలో కూడా వివాహిత స్త్రీలపై అత్యాచారాలు జరుగుతున్నాయి. శ్రామిక స్త్రీలు కూడా వివాహ చట్రంవల్ల అనేక ఇబ్బందులకు గురి అవుతున్నారు. ఈ వ్యవస్థను సరిగా అర్థం చేసుకోవాలి. పరిమితమయిన దృక్పథంతోనైనా చేసే కృషిని అభినందించగలగాలి. ఆర్థిక నియతి సూత్రాన్ని సరిగా అవగాహన చేసుకోవాలి. ఆర్థికస్థితి మారితేకాని దేనినీ మార్చలేమని, భావిస్తూ పరిస్థితిని మార్చడానికి కృషిప్రారంభించక పోవడం పొరపాటు. ఎక్కడో అక్కడ, స్థితిగతులను మార్చే ప్రయత్నాన్ని ప్రారంభించడం సమంజసం.

# "నేను నేనుగా జీవించాలి"

— వసంతా కన్నబిరాన్

ఈ గోష్టిలో వైవాహిక రీతులపై కొంత నొక్కు పెట్టి ప్రసంగించారు కొంతమంది. వివాహ విధానం కన్నా వివాహబంధ స్వభావం ముఖ్యమైనది. అన్ని వైవాహిక పద్ధతులలోనూ స్త్రీల అణచివేత కన్పడుతున్నది. ఇక్కడ కొన్ని ప్రశ్నలు ఉదయిస్తున్నాయి. తల్లి కాకుండా లేక తల్లి కావాల్సిన అగత్యం లేకుండా స్త్రీ వివాహబంధంలో ఎందుకు ఉండరాదు? ఆమె వ్యక్తికాదా? తన జీవితాన్ని తన ఇష్టం వచ్చినట్లు కొనసాగించు కోటానికి ఆమెకు హక్కు లేదా? స్త్రీ ఎంతో శక్తి సంపన్నురాలు. ఆమెలో కళాభిరుచి, సృజనాత్మక శక్తి నిండుగా ఉంటాయి. వాటికి వికాసం అక్కరలేదా? బ్రిటన్‌లో మహిళలకు ఓట్లుకావాలని పోరాడిసాధించిన సిల్వియా పేంక్‌హర్స్టు "నేను నేనుగా వుండాలి" అని భావ ప్రకటన చేసింది. సరోజినీనాయుడు లాంటివారు సృజనాత్మక కృషిసలిపారు. స్త్రీకి స్త్రీత్వం వుండాలట. దానిని ఆమె పోషించాలట. ఈ దురభిప్రాయాన్ని ఎంత త్వరగా నాశనంచేస్తే అంత మంచిది. భర్తకు సేవచేస్తూ, పిల్లల్ని పోషిస్తూ స్త్రీ అణగారి పోతున్నది. స్త్రీని ఒకవైపు భర్త మరోవైపున సంతానం దోచుకుంటున్నారు. ఏ పురుషుడికి స్వప్రయోజన కాంక్ష లేదు? వివాహం అంటే 25 గంటలు పనిచేసే పనికత్తెను భార్యరూపంలో పొందడమని ఏ పురుషుడు భావించడు? స్త్రీ ప్రేమ జీవితంలో, మాతృత్వజీవితంలో తలమునకలై తన్ను తాను నాశనం చేసుకుంటున్నది. తన వ్యక్తిత్వాన్ని ఆమె కనుగొనలేక పోతున్నది; తన వ్యక్తిత్వ వికాసంకోసం తన శక్తి యుక్తులను ఆమె వినియోగించగల అవకాశం లేనిదవుతున్నది. ఏనాడు స్త్రీ తనకొసం బ్రతుకుతూ, తన శక్తి యుక్తుల వికాసానికి తను దోహదం చేసుకోగలుగుతుందో ఆనాడే వాస్తవమైన అభ్యుదయాన్ని పొందగలుగుతుంది.

కొంతమంది శాస్త్రీయ విశ్లేషణ పేరుతో నీతి ప్రబోధక వైఖరిని అవలంభిస్తున్నారు. సమాజం మారేవరకు చేతులు ముడుచుకొని కూర్చోవలెనని

కొందరి భావంగా తోస్తున్నది. అది పొరపాటు అభిప్రాయం. స్త్రీ తన జీవితాన్ని మార్చుకోవటానికి, తనచుట్టూవున్న సమాజాన్ని మార్చటానికి ఏక కాలంలోనే ప్రయత్నించాలి.

కొంతమంది పురుషులు స్త్రీ విమోచనను సమర్థిస్తున్నారు ; బలపరుస్తున్నారు. కాని అధిక సంఖ్యాక పురుషుల వైఖరి వేరుగావుంది. వారు స్త్రీలను లైంగిక దృష్టితో మాత్రమే చూస్తున్నారు. సమాజంలో నేటి స్త్రీల పరిస్థితి ఏమంటే పెళ్ళి చేసుకొని ఏ ఒక్క పురుషుడి దయాదాక్షిణ్యాల పైననో ఆధారపడటమో, లేక బైటి ప్రపంచంలో వందమంది పురుషులకు బలికావడమో తప్ప మరో గత్యంతరం లేదు.

చాలామంది స్వైర విహార జీవితాన్ని నిరసిస్తారు. ఈ పదాన్ని విని ఎందుకు ఇంత భయపడుతున్నారు ? పవిత్రత అనేభావం అణచివేతలో పుట్టింది. పురుషుడు తన స్వార్థంకోసం సృష్టించిన భావమది.

మాతృత్వం స్త్రీ ఇష్టాయిష్టాలపై ఆధారపడి ఉండాలి. నవమాసాలు మోసి బిడ్డను ప్రసవించేది ఆమె కనుక ఆమె నిర్ణయమే తుది నిర్ణయం కావాలి. ఆమె వద్దనుకుంటే ఆమెను సంతానం కనమని భర్తకూడా బలవంతం చేయరాదు.

స్త్రీ పురుషుని ఆశ్రయించి ఉండే వస్తువుకారాదు. ఆమె జీవంకల మనిషి. ఆమెకూ మేధస్సూ ఉద్వేగాలూ, కోరికలూ ఉన్నాయి. ఆమె పరాధీనగా, పరాశ్రయురాలిగా జీవించవలసి రావడం ; అనుచితం; అక్రమం, అన్యాయం అది.

స్త్రీ పురుషుల సంబంధం ఆలుమగలుగా ఎలా ఉంటున్నదనేదే ముఖ్యం. ఇద్దరూ వివాహబంధంలో సమానహోదాతో మనగలుగుతున్నారా అనేదే ప్రశ్న. వరకట్నం కేవలం ఆర్థిక సమస్యకాదు. అచ్చంగా వస్తువు కొనుగోలు సమస్య కాదు. ఎంత విలువగల వస్తువును స్త్రీ కుటుంబంలోనికి తెస్తున్నదా అనేదికాదు ప్రశ్న. ఇది నైతిక విలువల సమస్య స్త్రీ పురుషుల సమానత్వానికి సంబంధించిన విషయం.

స్త్రీ యొక్క లైంగిక ప్రవృత్తిని, ఆమెకున్న సంతానోత్పాదనా శక్తిని పురుషుడు తన స్వార్థానికి వాడుకుంటున్నాడు. ఆమె మేధాజీవిగా జీవించటానికి అనువైన పరిస్థితులను అతడు కల్పించటం లేదు సరికదా ఆమెను అణచివేస్తున్నాడు; ఆమె వ్యక్తి వికాసానికి అడ్డు పడుతున్నాడు. ఇది ప్రస్తుత వివాహ బంధంలోని స్త్రీ నైచ్యస్థితి. దీనిని గుర్తించకుండా ఇతర అసంగత విషయాలు ప్రసంగించటం పూర్తిగా దారి తప్పటమో లేక మోసమో అవుతుంది.

—(o)—

# సెమినారు రిపోర్టు



1983 అక్టోబరు 15, 16 తేదీలలో "వివాహం: నేడు, రేపు" అనే అంశంపై చర్చావేదికను ఆం. ప్ర. అభ్యుదయ వివాహవేదిక నిర్వహించింది. వేదిక అధ్యక్షులు పి. సత్యన్నారాయణ స్వాగతం పలికారు. కార్యదర్శి మల్లాది సుబ్బమ్మ వేదిక లక్ష్యాలనుఆదర్శాలను, ఎరుకపరిచారు. ప్రముఖ రచయిత వాసిరెడ్డి సీతాదేవి అధ్యక్షత వహించారు. ఆచార్య నీరాదేశాయ్ ప్రారంభోత్సవం చేశారు. ఆచార్య ఏ. ఆర్. దేశాయ్ ముఖ్యోపన్యాసం చేశారు. కల్పనా కన్నబిరాన్ సంచికను ఆవిష్కరించారు. ఆ సందర్భంలో ప్రసంగిస్తూ వివాహం దౌర్జన్యం పైననూ హింసపైననూ ఆధారపడిన వ్యవస్థ అని అభివర్ణించారు. వివాహతంతులేని సమాజాన్ని ఆశించారు. వేదిక ఉపాధ్యక్షుడు ఎం. వి. రామమూర్తి వందన సమర్పణ చేశారు.

మరునాడు 16వ తేదీన సెమినారు కొనసాగింది. ఉదయపు సమావేశానికి ఆచార్య సి. లక్ష్మన్న అధ్యక్షత వహించారు. సాయంత్రపు సమావేశానికి న్యాయమూర్తి కె. పున్నయ్య అధ్యక్షులుగా ఉండి సభానిర్వహణ చేశారు. డా॥ జి. హరగోపాల్ వందవ సమస్పణ చేశారు.

ముగింపు సభలో డా॥ చేకూరి రామారావు అధ్యక్షస్థానాన్ని అలంకరించారు. డా॥ బల్వంతరెడ్డి ముగింపు ఉపన్యాసం చేశారు. డా॥ శివలింగ ప్రసాద్ వందన సమర్పణ చేశారు. 100 మంది సెమినారులో పాల్గొన్నారు. 50 మంది చొరవతో, చురుకుగా చర్చల్లో ప్రసంగించారు.

ఎస్. సి. భాగ్యవతి చర్చలో పాల్గొంటూ ఇలా అన్నారు:-

"ప్రతి స్త్రీకూడ కట్నం కోరినవానిని వివాహమాడనని భీష్మించుకుని కూర్చుంటే తప్ప వరకట్న సమస్య పరిష్కారం కాదు. ఈనాటి యువతులకు ఆ జాగృతి రాకపోయినా తల్లులుగా ఉన్న మనం గుర్తించి తదనుగుణంగా నడుచుకోవాలి. "నా కొడుకుకు నేను కట్నం తీసుకోను" అని నిర్ణయించుకోవాలి.

పెంపకంలో స్త్రీ పురుషులమధ్య తేడా చూపరాదు. చదువు బాగా వచ్చే కూతురుకు చదువు చెప్పించకుండా చదువురాని కుర్రవానికి సీటుకొని

చదువు చెప్పించటానికి సిద్ధపడుతున్నారు తల్లిదండ్రులు. 'ఆడపిల్లకు చదువు చెప్పించాలి, అదనంగా కట్నం ఇవ్వాలి. అలాకాక కుమారుని విషయంలో వాడు కట్నం తెస్తాడు' అని ఆలోచన చేస్తున్నారు. ఇలాంటి సంఘటనలు అనేకం సంభవిస్తున్నాయి. కనుక స్త్రీలు ఈ విషయంలో శ్రద్ధ తీసుకుని పిల్లల పెంపకం విషయంలో తేడా లేకుండా పెంచటం అలవర్చుకోవాలి."

కులరహిత సమాజం కావాలని కె. వెంకటరెడ్డి చెప్పారు. కులాన్ని పెర్కొనని పద్ధతిలో జీవితాలు సాగించాలని ఉద్బోధించారు.

ఫ్యూడల్ మనస్తత్వాన్ని విడనాడటానికి తగిన సంకల్ప బలాన్ని పుంజుకోవాలని, కనీసం భారత రాజ్యాంగ నిబంధనల మౌలికాంశం మేరకు పురోగమించాలని డా॥ మాచిరెడ్డి ప్రోద్బలం చేశారు.

ఊహాగానాలు చేయవద్దని శ్రీధర్ హెచ్చరించారు. కట్నాల విషయంలో, ప్రేమ వివాహాలకు ఆటంకాలు కల్గించటంలో తల్లిదండ్రులే ప్రధాన దోషులని మహీధర రామమోహనరావు అభిప్రాయ ప్రకటనచేశారు. ఆస్తిలో వారసత్వహక్కు వస్తేగాని వరకట్నం పోదని తుమ్మల చౌదరి స్పష్టీకరించారు. పారిశ్రామిక సమాజపు మెరుపులకు ప్రలోభపడవద్దని, మధ్య తరగతి పరిస్థితిని అధిగమించి ఆలోచించమని హెచ్చరించారు. వివాహ సమస్యను ఆర్థికవిధానంయొక్క ఉపరితలపు అంశంగాపరిగణించి ఆలోచించమని జనార్ధనరావు కోరారు.

వివాహం అయిన దరిమిలా అదనంగా వరకట్నం తెమ్మని బాధించే భర్తలను శిక్షించాలని జె. బి. రావు ప్రతివాదించారు. వరకట్నం స్త్రీల ఆత్మగౌరవానికి భంగకరమని రజిత ఘంటాపథంగా చెప్పారు. ఎన్. కె. ఆచార్య వివాహ సమస్య పరిష్కారం సోషలిజంలో దొరుకుతుందని వాదించారు. ఐలయ్య, జ్వాలాముఖి, బి. ఎస్. నాగేశ్వరరావు చర్చలలో కలుగజేసుకొని ప్రసంగించారు. పల్లెలలో వరకట్న మరణాలు లేవని సురమౌళి అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

ఇంకా అనేక ప్రముఖులు ఆసక్తితో చర్చలలో కలుగచేసుకొని మాట్లాడారు.

# ఆం. ప్ర. అభ్యుదయ వివాహ వేదిక

అభ్యుదయ వివాహ వేదిక హైదరాబాద్‌లో 1981 మేలో స్థాపించటం జరిగింది. వేదికకు శ్రీ నార్లవారు గౌరవాధ్యక్షులుగా వుండటానికి అంగీకరించారు. అసలు ఈ వేదిక ఎందుకు స్థాపించామో, దీని ప్రాశస్త్యమేమిటో మీకు ముందుగా మనవి చేస్తున్నాను. దీని లక్ష్యాలను గురించి ఉద్దేశాలను గురించి మీకు తెలియజేయడం నా విధ్యుక్తధర్మం.

వైవాహిక జీవితంలో ప్రవేశించడానికి ఉదాత్త ఆశయాలు, ఉన్నత లక్ష్యాలు, సహనభావం. సహాయ సహకారాది ఆదర్శాలు యువతీయువకుల్లో పెంపొందింపచేయడం వేదిక ముఖ్యలక్ష్యం. స్త్రీ పురుషుల మధ్య హెచ్చు తగ్గులు, లైంగికతేడా లాంటి అసమానతా భావాన్ని త్రోసిరాజంటుంది ఈ వేదిక. వివాహ బంధానికి కులము, మతము, బాష, ప్రాంతీయత అడ్డుగోడలుకారాదనే భావాన్ని వ్యాప్తి చేయడం వేదిక ఆశయం. స్త్రీ పురుషులు సమానులు కనుక కట్నం పుచ్చుకోవడం స్త్రీని ఘోరంగా అవమానించడమనే భావ ప్రసారాన్ని సాగించడం దీని ఆదర్శం. కట్నం తీసుకొన్న వారిని అవినీతిపరులుగా, సాంఘిక విద్రోహులుగా చిత్రించడం, మత తంతులేని వివాహం అంటే సెక్యులర్ వివాహాలు శ్రేష్టమని, వాంఛనీయమని ప్రజలకు నొక్కి చెప్పటం వేదిక ప్రసారాలలో ముఖ్యమైనది. వివాహాలకు ఆడంబరాలు, దుబారా ఖర్చులు వ్యర్ధమనే సందేశాన్ని తెలియజెప్పటం వేదిక కర్తవ్యంగా చేపట్టటం జరుగుతోంది. కుల మత బాషా ప్రాంత జాత్యాది అడ్డంకులను అధిగమించే సార్వజనిక లౌకిక వివాహాలను చేపట్టమని యువతను ప్రోత్సహించడం, ఈ తరహా వివాహాలు చేసుకో తల్చుకున్న వధూవరులకు మార్గదర్శకత్వం, మానసిక వత్తాసు, సామాజిక బలం, ఆర్ధిక సహాయం లాంటి సదుపాయాలు కలిగించడం ఈ వేదిక ప్రత్యేకత. ఇలాంటి వివాహాలకు నిర్వాహకులుగా వుండి దండల మార్పిడితో పెళ్లిళ్లు చేయించడమేకాక సంఘ సంస్కర్తలను, సమాజంలోని పెద్దలను ఆశీర్వదించడానికి ఆహ్వానించడం కూడా వేదిక నిర్వహిస్తోంది. వివాహ

సలహా సేవాపథకాన్ని మహిళాభ్యుదయ సంస్థ అని పేరుగల సోదరసంస్థ సహకారంతో నిర్వహించడం కూడా జరుగుతోంది.

ఈ వేదికలో పదవీ నిర్వహణ చేసేవారు వేదిక స్థాపనకు పూర్వమే ఇలాంటి వివాహాలను అనేకం చేశారు. త్రిపురనేని కవిరాజు ఉద్యమం, హేతువాద ఉద్యమం, హ్యూమనిస్టుల ఉద్యమం కుల నిర్మూల నోద్యమా లతో వారికి సన్నిహిత సంబంధాలు ఉన్నాయి. అలా సంస్కరణోద్యమ కార్యకర్తల సహకారం వేదికకు లభించింది.

వేదిక లక్ష్యాలకు సమ్మతి తెలియజేసి వివాహమాడదలచిన స్త్రీ పురుషుల పేర్లు నమోదుచేసి తద్వారా వారి కవసరమైన సమాచారాన్ని వేదిక అందిస్తున్నది. కొన్ని వివాహాలను వేదిక కార్యస్థానంలో జరిపించింది కూడా.

వేదిక కార్యస్థానమైన వికాసకేంద్రంలో ఎన్ని వివాహాలు జరిపాము అనేదానికన్నా భావ ప్రసారానికి ప్రాధాన్యత ఇవ్వబడుతోంది. వేదికవల్ల ప్రబోధితులైనవారు, వేదిక సలహా సేవా పథకంవల్ల సహాయం పొందిన వారు వేదిక కార్యస్థానంలో కాని వేదిక ఆధ్వర్యంక్రింద కాని తమ పెళ్ళిళ్లను చేసుకోవాలనే నియమం నిబంధనా లేవు. అందువల్ల వేదిక పదవీ నిర్వాహ కులను ఇతరులు వివాహ నిర్వాహకులుగా ఆహ్వానించడం జరుగుతోంది. వరకట్న రహిత, మత తంతు రహిత, కులాంతర మతాంతర వివాహాలు విరివిగా జరగాలని ఈ సంస్థ ఆకాంక్షిస్తున్నది.

భారతదేశం, లెక్క ప్రకారం 20వ శతాబ్దంలోవున్నా భావాల పరంగా మధ్య యుగంలో వుంది. ఇటీవల దేశంతో జరిగిన పారిశ్రామికీ కరణవల్ల సమాజంలో కొంత కుదుపువచ్చింది. అంతేకాక ప్రపంచంలోని ఇతర దేశాల ప్రజల సంస్కృతీ నాగరికతలు మనకు పరిచయమయ్యాయి. దాంతో పాత విలువలను కాదనడం, పాత భావాలపై దాడిచెయ్యడం సాగుతోంది. వివాహవ్యవస్థకూడా విమర్శకు గురి అయింది. యుగయుగాలుగా, తర తరాలుగా అంగీకారాన్ని పొందినభావాలు నేటికి సవాలును ఎదుర్కోవలసి వస్తోంది. ఈ పరిస్థితుల్లో యువతరం అయోమయావస్థలోనికి పోతోంది. ఈ సందర్భంలో చర్చావేదిక ద్వారా భావస్పష్టతను చేకూర్చుకొని ముంద డుగు వేయ నుంకించుట జిజ్ఞాసాపరుల కర్తవ్యం.

ఏ రాజకీయ పాలనలోవున్నా ఏ ఆర్థిక వ్యవస్థలోవున్నా 80 శాతము యువతీ యువకులు వివాహమాడుతున్నారు. వివాహం వారి జీవితంలో ప్రధాన భూమికను నిర్వహిస్తోంది. కనుక వివాహాన్ని గురించిన పరిజ్ఞానాన్ని, అవగాహనను యువతీ యువకులకు అందజేసే నిమిత్తం ఈ సంఘం ఈ సెమినారును నిర్వహిస్తోంది. వైవాహిక జీవితంలో స్త్రీ పురుషులకు స్వేచ్ఛ కుంటుపడుతోందని, పెళ్ళికి పూర్వం ఎంపికకు అవకాశాలు దాదాపు మృగ్యమని, వివాహ సందర్భంగా ప్రేమాభిమానాలు తప్ప తతిమ్మా అంశాలు అంటే కులము, శాఖ, మాత్రము, కట్నము, ఆస్తి, అంతస్తు పరిగణనలోకి వస్తున్నాయని అందువల్ల వివాహ వ్యవస్థను త్రోసి రాజనాలని తీవ్రమైన వాదనలు వినిపిస్తున్నాయి. వీటి నివారణకు కులాంతర మతాంతర వివాహాలను ఒక వర్గంవారు ప్రతిపాదిస్తే కుల మత ప్రసక్తిలేని వివాహాలను మరొక వర్గం వారు సూచిస్తున్నారు. అంతటితో ఆగక ఒకే కులంలోని వివాహాలను నిషేధించాలని వేరొక వర్గం వాదిస్తోంది. వివాహానికి మత తంతు అక్కరలేదని కొందరు ప్రచారం చేస్తున్నారు. ఈ తర్జన భర్జన ఇలా ఒకవైపు సాగుతుంటే మరొకవైపున వరకట్నాల కోసం తాపత్రయం హత్యలకు, మరణాలకు దారితీస్తోంది. వరకట్న దురాచారం స్త్రీని న్యూనత పరుస్తోందని, వధువు తల్లిదండ్రులకు భారంగా పరిణమిస్తోందని స్త్రీ విమోచనోద్యమ కార్యకర్తలు ఘోషిస్తున్నారు. నూతన వివాహ రీతులను సమాజం అన్వేషిస్తోంది. యువతరం ఆదర్శ సమాజానికి బాటలు వెయ్యాలని ఆశించడంలో పొరపాటులేదు. ఇలాంటి భావప్రసారం చేయడానికి ఇలాంటి వేదికలు అవసరమని ఈ సంస్థ నిర్వాహకుల అభిప్రాయం. అందుకే పై అంశాలను క్షుణ్ణంగా పరిశీలించే పరిశోధనా వ్యాసాలతో ఈ సెమినారు జరుగుతుంది.



వేదిక చేపట్టే కార్యక్రమాలకు చేయూతనిమ్మని అభ్యుదయ కాముకులను అభ్యర్థిస్తున్నాం

—కార్యదర్శి

—)(—